


సంపు. ౧౨ యువసంవత్సరము, భాద్రపదమాసము (సెప్టంబరు ౧౯౩౫) సంఖ్య

# విఘ్నపిశాచోచ్చాటనము

త్రిపురాన వేంకటసూర్య ప్రసాదరావు

అన్వయం పావితుం భానో ర్నిమే శ్లోకాన్ కవే ర్వచః,
అవతారో యయోః పృథ్వ్యాం దంపతీ తౌ భజా మ్యహమ్.

౧

మాదారి కడ్డురారాదు పోపొండు
శ్రీదేవు పదసేవ చేసికోనీండు
వెనకయ్యా ముందుంచి వేఁడుకొంటాము మేము
పనిఁబూని హరిపదాల్ పాడుకొంటాము మేము
సద్దుసేయక దవ్వు సనుఁడయ్యా మీరు
బుద్ధిమాలిన విఘ్నభూతమ్ములార
మాదారి.

పుడమిఁ బుట్టినదాది పూర్వకర్మవశానఁ
బడరాని యిక్కట్లు పడుచు వేసరినాము
జడబుద్ధి నిమ్మేను శాశ్వతమ్మని నమ్మి
కడలేని సంసారగతికిఁ బాల్పడినాము
నడుమ ఋణానుబంధమునఁ జేపడినట్టి
పడఁతిబిడ్డలమీఁది భ్రాంతిలోఁ బడినాము

ఎడలేని భవబాధ లెడపి శాశ్వతసౌఖ్య
మిడఁగోరి పరమేశు నెడఁ గొల్వ నున్నాము.
సద్దు సేయక దవ్వు సనుఁడయ్య మీరు
బుద్ధిమాలిన విఘ్న భూతమ్ములార !
మాదారి.

ఎంతయు సజ్జనగోష్ఠి సలుపుచుందుముగాని
ఖలులతో నెన్నండుఁ జెలిమి సేయఁగఁబోము
బలిమిగల్గియు క్షమ పరత నుందుముగాని
యలఁతులైనను జనమ్ముల నొంప మైకోము
అలికి మాస్తురు శరణన్నఁ గాతుముగాని
తొలికీడు మదినెంచి తూలనాడఁగఁబోము
జలరుహాక్షుకథారచనలచేఁ గాలమెల్లఁ
దలఁగి యీభవవార్ధిఁ దరియింప నున్నాము
సద్దు సేయక దవ్వు సనుఁడయ్య మీరు
బుద్ధిమాలిన విఘ్న భూతమ్ములార !
మాదారి.

హరిమయం బీజగంబని నెమ్మదిని నమ్మి
హరి సర్వసమబుద్ధిఁ బొందియుందుము మేము
పరమేశుఁ డిడినసంపదలతోఁ దనివొంది
పరధనమ్ముల కాసపడక యుందుము మేము
సరసకావ్యామృతాస్వాద తత్పరులమై
యురుతరానందాబ్ధి నోలలాడుదు మేము
నిరతమ్ము సుకవితాసిద్ధామహాతపః
పరులమై కాలమ్ము జరపికోనున్నాము.
సద్దు సేయక దవ్వు సనుఁడయ్య మీరు
బుద్ధిమాలిన విఘ్న భూతమ్ములార !
మాదారి.

౫

అపకారమొనరించునట్టి ద్రోహులకైన
నుపకారముంజేసి సుశీలురము మేము
విపులాపదలు సంభవించువేళలనైన
సన్మార్గమును ద్రొక్క నభిలషింపము మేము
కపటచర్యలను లోకమువారి వంచించు
కృపణచిత్తుల పొత్తు గిట్ట దెన్నఁడు మాకుఁ
ద్రిపథగోర్ములఁ బోలు దివ్యగీతుల నించి
విపుల నాకముగఁ గావింప నూల్కొన్నాము.
సద్దు సేయక దవ్వు సనుఁడయ్య మీరు
బుద్ధిమాలిన విఘ్న భూతమ్ములార !
మాదారి.

సమరేఖ నలరు వాక్సతిజోడు పాలింపఁ
గమరారు తఱిపి పాల్ గ్రోలుచుందుము మేము
కమనీయరసగర్భ కవితావిలాసినీ
విమల సాంగత్యమ్ము విడువఁజాలము మేము
కమలాక్షుఁ గొలుచు సత్కవులె మాచుట్టాలు
అమరసత్కృతులె మాయనుఁగు సంతానాలు
భ్రమగొల్పు చిన్నికబ్బపుఁ గన్నియలఁ గాంచి
కమలార్కు సవతులంగాఁ జేయ నున్నాము.
సద్దు సేయక దవ్వు సనుఁడయ్య మీరు
బుద్ధిమాలిన విఘ్న భూతమ్ములార !
మాదారి.

నిగమసంచయము లన్నియును శబ్దమయమ్ము
లగణిత శబ్దచయము బ్రహ్మమయమాట
జగదధీశ్వరు సేవ సారస్వతపుసేవ

జగము సేవయుఁ గూడ సమమటకా మది నెంచి
సగుణపద్ధతిఁ బూని సంగీతసాహితీ
యుగళీరసామృత మ్మొలికించుకైతల
నిగమగోచరుఁడైన నిఖిలేశునిం బాడి
జగముఁ గొల్వఁగ మేము సమకట్టియున్నాము

సద్దుసేయక దవ్వు సనుఁడయ్యా మీరు
బుద్ధిమాలిన విఘ్నభూతమ్ములార!
మాదారి.

వికటప్రారబ్ధసుదుర్వికృతిమై నిన్నాళ్లు
లకట సత్కావ్యక్రియలకు దవ్వయినాము
సుకృతలేశము కల్మి క్షుద్రబాధ లణంగి
వికృతిహోరుఁగన్నవిచ్చి మేల్కొనినాము
సకలలోకస్రష్టచాతురిం దలపంచు
ప్రకృతిసౌందర్య సంపదసొంపుల వెలార్చి
పికరాజు వాసంతవేళఁ గ్రోల్చినలీల
సుకవితామృతధారఁ జూటలీనున్నాము

సద్దుసేయక దవ్వు సనుఁడయ్యా మీరు
బుద్ధిమాలిన విఘ్నభూతమ్ములార!
మాదారి.

ప్రసవార్చనముల మానస మిట్టటుచలించు
మిసిమికైతల జిక్కి మెసలంబో దడయుచు
లసితభావ సుగంధలహరిపై బ్లిరపొంద
రసరూపనవమకరంద బిందులు చిందఁ
బసమీఱు కలికినుస్పులుకుఁ గ్రొన్నన లేర్చి
యసమానగతిఁ బద్దియంపు కెత్తులు గూర్చి
యసమాధికు రమేశు నర్చింతు మేవేళ
మసలరా దిచ్చోట మాజోలి మీకేల

సద్దుసేయక దవ్వు సనుఁడయ్యా మీరు
బుద్ధిమాలిన విఘ్నభూతమ్ములార!
మాదారి.

౧౦

కవులు శ్రీజగదీశు గారాపుబిడ్డలు
కవుల నొంచెడువారు గతులు గాంచఁగలేరు
కవులతో వైరమ్ము గను కొంతయును గీడు
కవులకై మేల్సేయఁగా భద్ర మొనగూడుఁ
గవులవల్లన లోకకళ్యాణము ఘటిల్లుఁ
గవులచేతలకు విఘ్నములు సేయఁగరాదు
కవులందు సకలలోకమ్ము లిమ్ముల నిల్చుఁ
గవులసేకాక సత్కవిసేవకుల మేము.

సద్దుసేయక దవ్వు సనుఁడయ్యా మీరు
బుద్ధిమాలిన విఘ్నభూతమ్ములార!
మాదారి.

౧౧

మాయిష్టదైవమ్ము మాకృతీశ్వరుఁడు
మాగుణాలంకారమహనీయమూర్తి
మాయపాపదుర్ధర్త మారామవిభుఁడు
మాకేమగడయునై మముఁ బ్రోవఁగలఁడు
ఆమ్నాశ్రితావనుండా భక్తవరదుఁ
డా దుష్టశాసనుండా జగత్ప్రభువు
పాయక ప్రార్థనను భక్తలోకమును
బాధించుఖలుల నైజముండంచు వినరో.

సద్దుసేయక దవ్వు సనుఁడయ్యా మీరు
బుద్ధిమాలిన విఘ్నభూతమ్ములార!
మాదారి.

# సంస్కృత ప్రాకృతములు

(అనువృత్తము)

శ్రీ పరవస్తు వెంకటరామానుజస్వామి

౭. ఇంక బతంజలికాలమున సంస్కృతభాషాస్థితి యెట్లుండినదో విచారింతము. ఇతనికాలమున నీభాష సర్వజనవ్యవహృతముగా లేదు. శిష్టులుమాత్రము సంస్కృతవ్యవహారమును మానలేదు. వారి కుటుంబములలో సంప్రదాయసిద్ధముగా సంస్కృతము వ్యవహారములో నుండినది. ఈ విషయమును "పృషోదరాదీని యథోపదిష్టమ్" (౬-౩-౧౦౯) అనుసూత్రమువిూది భాష్యమున పతంజలి స్పష్టపరచెను.

> అష్టాధ్యాయీ మధీయానోఽన్యం పశ్య త్యనధీయానం యేఽత్ర విహితాః శబ్దా స్తాన్ప్రయుఞ్జానమ్. స పశ్యతి. నూన మస్య దైవానుగ్రహః స్వభావో వా యోఽయం నచాష్టాధ్యాయీ మధీతే యే చాత్ర విహితాః శబ్దా స్తాంశ్చ ప్రయుఙ్క్తే. అయం నూన మన్యానపి జానాతి. (౬-౩-౩).

శిష్టులు వ్యాకరణమును జదువకయే సంస్కృతమును వ్యవహరించుచుండిరి. మఱికొందఱు శాస్త్రజ్ఞానమువలన సంస్కృతమును మాటలాడగలిగియుండిరి. శాస్త్రసంస్కారములేని మిగిలినవారందఱును 'అపభ్రంశము'ను వ్యవహరించుచుండిరి. కాత్యాయనుని కాలమువఱకు సంస్కృతభాషలో వర్ణవిపరిణామము లేమియు గలుగలేదు. పదజాలమున బ్రత్యయములలోను మార్పు కలుగుచుండెను. కొన్నిపదములు వ్యవహారములోనుండి తొలగి క్రొత్తపదములు వాడుకలోనికి వచ్చినవి. కొన్ని ప్రత్యయములు లోపించి కొన్నిశబ్దములకు నూతనప్రత్యయప్రయోగము సంభవించినది. కాత్యాయనుని కాలమునకు దరువాతను వర్ణవిపరిణామములు విశేషముగా సంభవించినవి. పదము లపభ్రష్టము లైనవి. కొన్నిపదము లనేకవిధములుగా నపభ్రష్టము లైనవి. ఈయంశములను పతంజలి మహాభాష్యమున నీక్రిందివిధముగా దెలియపఱచెను.

> యే పున రాణపయత్యాదయః. ఆణపయతి వట్టతి వడ్ఢతీతి.....శిష్టప్రయోగా దాణపయత్యాదీనాం నివృత్తి ర్భవిష్యతి. సదావశ్యం శిష్టప్రయోగ ఉపాస్యో యేఽపి హ్యేతే తేషామపి విపర్యాసే నివృత్తిః. లోకే హి కృష్యర్థే కసిం ప్రయుఞ్జతే వృత్యర్థేన దశిమ్. (౧-౩-౧)

> భూయాంసోఽపశబ్దా అల్పీయాంసః శబ్దాః. ఏకైకస్య శబ్దస్య బహవోఽపభ్రంశాః. తద్యథా. గౌరిత్యస్య గావీ గోణీ గోతా గోపోతలికేత్యేవ మాదయోఽపభ్రంశాః. (౧-౧-౧)

ఈవిధమైన వర్ణవిపరిణామములను బొందిన సంస్కృతజన్యమగు భాషకే యిటీవల పాళీభాషయని వ్యవహారము కలిగినది. ఈభాషాపదములను బతంజలి సంస్కృతభాషాపదములుగా నంగీకరింపలేదు. వీని నపభ్రంశము లనెను; మ్లేచ్ఛములనెను.

> మ్లేచ్ఛో హ వా ఏష యదపశబ్దః. మ్లేచ్ఛా మా భూమే త్యధ్యేయం వ్యాకరణమ్. (౧-౧-౧)

ధర్మమును బొందదలంచినవారు వీని నుపయోగింపగూడదనెను. వ్యవహారమున నపశబ్దములనైన నుపయోగింపవచ్చును.

> సమానాయా మర్థగతౌ శబ్దేన చాపశబ్దేన చ ధర్మనియమః క్రియతే. శబ్దేనైవార్థోఽభిధేయో నాపశబ్దేనేత్యేవం క్రియమాణ మభ్యుదయకారి భవతీతి. (౧-౧-౧)

కాత్యాయనుడు భాషలో నూతనముగా బ్రవేశించిన పదములను సంగ్రహించునట్లుగా వార్తికములను వ్రాసి వ్యాకరణమును విపులముగ జేసెను. అంతియకాని

నూతనపదములను నపభ్రంశములని, మ్లేచ్ఛములని త్రోసి వేయలేదు. కాన కాత్యాయనుని కాలమునకు సంస్కృతమున వర్ణవిపరిణామములు కలుగలేదనియు పూర్వకాలమునందుండిన రూపమునసే వ్యవహారమునందుండినదనియు మన మూహింపవలసియున్నది. పతంజలి యట్లుకాక నవీనశబ్దములను గ్రామ్యమనుబడియు గోరునా రుపయోగింపగూడదనెను. పాణినికాత్యాయనులనాటి భాషనే ధర్మార్థ ముపయోగింపవలెననెను. ఇంచుల కతనికాలమునకు భాష వర్ణవిపరిణామములను బొంది రూపాంతరమును స్వీకరించుటయే కారణము కావలయును. అస్పష్టఫలమును జెప్పియుండుటచే పతంజలికాలమున సంస్కృతము సామాన్యజనవ్యవహారమున లేదని మనము నిశ్చయింపవచ్చును. అందఱును నీనూతనపదములనే యుపయోగించుచుండినయెడల పతంజలి యిట్లు వ్రాసియుండడు. శిష్టులును, విద్వాంసులును సంస్కృతమునే వాడుచుండిరి కాని యీ యపభ్రంశభాష నుపయోగింపకుండిరి. అంతమాత్రమున నవి ప్రయోగమునుండి మఱలిపోనుండుటచేతను, శిష్టులుకూడ నప్పుడప్పుడు వాని నుపయోగించుటచేతను పతంజలిప్రయోగము నడ్డలేక యట్టివానిని బ్రయోగించుటచే నధర్మము లభింపదనిమాత్రము చెప్పెను. ఈసమ్మకమే మనవారి కిప్పటికిని గలదు. వారు వైదికకర్మలలో సంస్కృతము నుపయోగించినగాని పుణ్యము లేదని దానినే వాడుదురు. మఱియు నిప్పటికిని శాస్త్రము నభ్యసించి సంస్కృతమును వ్యవహరించువారు కలరు. కొందఱు పండితులు శాస్త్రీయవిషయములను సంస్కృతమున జర్చించుట కలదు. ఈరీతిగా నిప్పటికిని సంస్కృతము వ్యవహారములో నున్నది. ఇంతమాత్రమున సంస్కృత మిప్పుడు సజీవమగు భాషయని చెప్పుటకు వీలులేదుకదా! పతంజలికాలమునగూడ నిట్లే యుండెను.

పతంజలికాలమున శిష్టులగు బ్రాహ్మణులేకాక మఱికొందఱుకూడ సంస్కృతభాషను నేర్చి దానితో మాటలాడగలిగియుండి రనుటకు మహాభాష్యములోని యీక్రింది సూతవైయాకరణసంవాదమును నిదర్శనముగా జూపెదరు.

> తత్రాయమప్యర్థ ఇష్టమపి సిద్ధం భవతి ప్రాజితేతి. కించ భో ఇష్యత ఏతద్రూపమ్. బాఢమిష్యతే. ఏవం హి కశ్చిద్వైయాకరణ ఆహ కోఽస్య రథస్య ప్రవేతేతి. సూత ఆహ ఆయుష్మన్నహం ప్రాజితేతి. వైయాకరణ ఆహ అపశబ్ద ఇతి. సూత ఆహ ప్రాప్తిజ్ఞో దేవానాంప్రియో న త్విష్టిజ్ఞ ఇష్యత ఏతద్రూపమితి. వైయాకరణ ఆహ అహో ఖల్వనేన దురుతేన బాధ్యామహ ఇతి. సూత ఆహ న ఖలు వేఞః సూతః. సువతేరేవ సూతో యది సువతేః కుత్సా ప్రయోక్తవ్యా దుఃసూతేనేతి వక్తవ్యమ్. (౨-౪-౧)

బ్రాహ్మణులేకాక మఱికొందఱుకూడ సంస్కృతమును వ్యవహరింపగలిగియుండిరనియు, వారిలో గొందఱు పదముల వ్యుత్పత్తినిగుఱించి విచారింపగలిగి శాస్త్రజ్ఞానమునుగూడ గలిగియుండిరనియు పై మహాభాష్యవచనములు సూచించుచున్నవి. మిగిలినవా (అనగా స్త్రీలును, పురుషులలో నసంస్కారులును) రపభ్రష్టభాష (అనగా పాళీభాష) నుపయోగించుచుండిరి. కాని వారు పరస్పర మొకరిభాష నొకరర్థము చేసికొనగలిగియుండిరి. ప్రతిదేశమునందును విద్వాంసుల భాషకును, నవిద్వాంసుల భాషకును భేద ముండక తప్పదు. బ్రాహ్మణుల తెలుగునకును శూద్రుల తెలుగునకును భేదము కలదుకదా! కాని బ్రాహ్మణులు శూద్రుల భాషను, శూద్రులు బ్రాహ్మణుల భాషను సులభముగా గ్రహింపగలరు. ఇట్లే పతంజలికాలమున సంస్కృతపాళీభాషలు భిన్నవ్యక్తులచే నేకస్థలముననే వ్యవహరింపబడుచుండినవి. సంస్కృతపాళీభాషలకు విశేషభేదము లేదనియు, నం దొకభాష నెఱింగినవారికి రెండవభాష సులభముగా నర్థమగుననియు జూపుటకై క్రింద బాళీవాక్యములను గొన్నిటిని నుదాహరించుచున్నాను.

> అతీతే బారాణసియం బ్రహ్మదత్తే రజ్జం కారేన్తే బోధిసత్తో హిమవన్తపదేసే రుక్ఖకోట్టక సకుణో

హంత్వా నిబ్బత్తి. అథేకస్స సీహస్స మంసం ఖాదన్తస్స అట్ఠి గలే లగ్గి. గలో ఉద్ధుమాయి. గోచరం గణ్హితుం న సక్కోతి. ఖరా వేదనా వత్తన్తి. అథ నం సో సకుణో గోచరపసుతో దిస్వా సాఖాయ నిలీనో కిం తే సమ్మ దుక్ఖన్తి పుచ్ఛి. సో తం అత్థం ఆచిక్ఖి. అహం తే సమ్మ ఏతం అట్ఠిం అపనేయ్యం భయేన పన తే ముఖం పవిసితుం న విసహామి ఖాదేయ్యాసి పి మన్తి. మా భాయి సమ్మ నాహం తం ఖాదామి జీవితం మే దేహీతి. సో సాధూతి తం పస్సేన నిపజ్జాపేత్వా కో జానాతి కిం పేస కరిస్సతీతి చిన్తేత్వా యథా ముఖం పిదహితుం న సక్కోతి తథా తస్స అధరోట్ఠే చ ఉత్తరోట్ఠే చ దణ్డకం ఠపేత్వా ముఖం పవిసిత్వా అట్ఠికోటిం తుణ్డేన పహరి. అట్ఠి పతిత్వా గతం. సో అట్ఠిం పాతేత్వా సీహస్స ముఖతో నిక్ఖమన్తో దణ్డకం తుణ్డేన పహరిత్వా పాతేన్తో నిక్ఖమిత్వా సాఖగ్గే నిలీయి.

ఇట్టి లౌకికవ్యవహారము ననుసరించియే యాకాలమున సృష్టించిన నాటకశాస్త్రమున నీచమధ్యమపాత్రలకు ప్రాకృతమును, నుత్తమపాత్రలకు సంస్కృతమును నుపయోగించు పద్ధతి యేర్పడినది. దృశ్యకావ్యములు ప్రపంచమును యథాస్థితిగ ప్రతిఫలింపజేయు గ్రంథములుకదా! కావున నందలి భాషానియమముకూడ కవిబుద్ధికల్పితము కానేరదు. వ్యవహారమునందు గల భాషలే యందు ప్రస్తుతమున నుపయోగింపబడినవి. ఆకారణమును బట్టియే ప్రాచీననాటకముల ప్రాకృతములకు భేద మగపడుచుండును. ప్రాకృత మెట్లు మారుచు వచ్చెనో యట్లే నాటకములలో నుపయోగింపబడుచు వచ్చినది. అశ్వఘోషభాసకాళిదాసకృత నాటకములలోని ప్రాకృతములకు భేదము కలదనువిషయ మాగ్రంథములను జదివినవారికందఱకును విశదమే. ఇటీవల ప్రాకృతముకూడ వ్యవహారములోనుండి జాఱినపిదప నాటకములలోని ప్రాకృత మేకరీతిని దాల్చినది. కాబట్టి ప్రాచీననాటకములలోని భాషావిన్యాసము పతంజలి నాటి భాషాస్థితిని దెలియజేయుచున్నది.

౮. వైదికభాష వ్యావహారికభాషయై యుండి యది క్రమముగా సంస్కృతభాషలోనికి మారి కాత్యాయనునికాలమువఱకును సర్వజన వ్యవహారమున నుండినదని పాణినికాత్యాయనుల గ్రంథములవలన మనకు తెలియుచున్నది. సంస్కృతము వ్యావహారికభాషయై యుండ దానినుండి పాళీప్రాకృతభాష లుద్భవించిన వనుట కేమియు నాక్షేపములేదు. పతంజలికూడ నపభ్రంశములు సంస్కృతజన్యములని చెప్పియున్నారు. "ఏకైకస్య శబ్దస్య బహవో౽పభ్రంశాః. తద్యథా. గౌరిత్యస్య గావీ గోణీ గోతా గోపోతలికేత్యేవమాదయో౽పభ్రంశాః. లోకే హి కృష్యర్థే కసిం ప్రయుఞ్జతే దృశ్యర్థేచ దిశిమ్" అని పైనుదాహరించిన వాక్యములనుబట్టి గోశబ్దమునుండి గావీ, గోణీ మొదలగుశబ్దములును, కృషిధాతువునుండి కసియనురూపమును, దృశిధాతువునుండి దిశిధాతువును జన్మించినవని పతంజలి స్పష్టముగ జెప్పుచున్నారు. పతంజలి భాషావిపరిణామము జరుగుచుండినకాలమున నుండినవారు. పతంజలి యుదాహరించిన ఆణపయతి, వట్టతి, వడ్ఢతి అనుమొదలగు శబ్దములు ప్రాకృతనిఘంటువులలో గలవు. మఱియు వైదికయుగమునందే యీ విపరిణామములు స్వల్పముగా ప్రారంభమైనవి. డకారఢకారములు ళకారములలోని కప్పబడుచుండినవి. ఇది పాళీభాషాసంప్రదాయము. కృ — కు, కృత — కట, జ్యోతి — జోతి, బృహ — బుహ మొదలగు విపరిణామములు కూడ పాళీప్రాకృతభాషలలో గలవు. ఇట్టివిషయములు స్వల్పముగా నున్నకాలమున నవి సంస్కృతముగా నంగీకరింపబడినవి. పతంజలినాటి కివి యత్యధికమైనవి. భాష రూపాంతరమును పొందినట్లు కనబడినది. కాబట్టి యాభాష యపభ్రంశముగా పిలువబడినది. ఈవిధముగా పాళీప్రాకృతభాషలు సంస్కృతమునుండియే జన్మించినవి. అట్లు తలంచుటకు విప్రతిపత్తి యేమియును లేదు.

౯. మన ప్రాకృతవ్యాకరణకర్తలు పైవిషయములను విమర్శించియే ప్రాకృతభాషలన్నియు సంస్కృతజన్యములని వక్కాణించియున్నారు. ప్రాకృతవ్యాక

రణములలోనెల్ల బ్రాచీనతమమగు ప్రాకృతప్రకాశయందు వరరుచి ప్రాకృతభాషలన్నియు సాక్షాత్తుగాగాని, పరంపరగాగాని సంస్కృతజన్యములని చెప్పియున్నాడు. ఈగ్రంథమున వరరుచి మాహారాష్ట్రి, శౌరసేని, మాగధి, పైశాచి అను నాలుగుభాషలకు వ్యాకరణమును వ్రాసెను. మాహారాష్ట్రిభాషానుశాసనము తుదను "శేషః సంస్కృతాత్"అను సూత్రమును వ్రాసియున్నాడు. దీనికి భామహుఁడీక్రిందివిధముగా వృత్తిని వ్రాసియున్నాఁడు. "ఉక్తా దన్యః శేషః. ప్రత్యయసమాసతద్ధితలిఙ్గవర్ణకాదివిధిః శేషః సంస్కృతా దవగంతవ్యః" శౌరసేనీపరిచ్ఛేదప్రారంభమున "శౌరసేనీ. ప్రకృతిః సంస్కృతమ్"అను రెండుసూత్రములను వరరుచి వ్రాసియున్నాడు. మాగధీపైశాచీభాషలను వర్ణించు పరిచ్ఛేదములను రెంటిని "ప్రకృతిః శౌరసేనీ"అనుసూత్రముతో బ్రారంభించియున్నాడు. ప్రాకృతవ్యాకరణ కర్తలలోనెల్ల హేమచంద్రుఁడు ముఖ్యుఁడు. అతని వ్యాకరణమతివ్యాపకమైనది. హేమచంద్రుఁడుకూడ నిట్టి యభిప్రాయమునే కలిగియున్నాడు. స్వశబ్దానుశాసనప్రారంభమున నతఁడు "ప్రకృతిః సంస్కృతమ్, తత్రభవం తత ఆగతం వా ప్రాకృతమ్"అని వ్రాసియున్నాడు. ఇట్లే మిగిలిన ప్రాకృతవ్యాకరణకర్తలుకూడ బ్రాకృతము సంస్కృతజన్యమని చెప్పియున్నారు. భరతమునికూడ నిట్లే చెప్పియున్నాడు.

> ఏతదేవ(సంస్కృతమేవ)విపర్యస్తం సంస్కారగుణవర్జితమ్, విజ్ఞేయం ప్రాకృతం పాఠ్యం నానావస్థాన్తరాత్మకమ్.
>
> నాట్యశాస్త్రము, ౧౭ అధ్యా. ౨ శ్లో.

౧౦. మన హిందూదేశములోని యార్యులనేక సహస్రసంవత్సరములకు బూర్వము పైదేశములనుండి యీదేశమును బశ్చిమోత్తరపర్వతముల కనుమలద్వారమున బ్రవేశించిరని మనదేశభాషలకును బాశ్చాత్యదేశభాషలకును నుండు సంబంధమునుబట్టి యూహింపబడినది. మనదేశమును ప్రవేశింపగనే వారిందలి పశ్చిమోత్తరభాగమగునట్టియు, సింధునది కిరుప్రక్కలనున్నట్టియు పంజాబుదేశమున నివాసమేర్పఱచుకొనిరి. హిందూదేశమును ప్రవేశించుటకుబూర్వము వారెచ్చటను స్థిరమైనవాసము జేయక యెల్లప్పుడును దిరుగుచుండెడివారట. వారి పూర్వనివాసములగు దేశములు ఫలవంతములైనవి కాకపోవుటచే యభ్యవహారమునకై వారట్లు తిరుగుచుండిరట. ఫలవంతమగు మనదేశమును బ్రవేశింపగనే వారు స్థిరనివాసులైరట. ఋగ్వేదమంత్రరచనాకాలమున వారు పంజాబుదేశమునందే నివసించియుండిరి. ఇతర వేదమంత్రములను రచించినకాలమున సింధునది మొదలుకొని గంగానదివఱకుండు దేశమునంతటను వ్యాపించిన ట్లాయాగ్రంథములవలననే తెలియుచున్నది. ఋగ్వేదమున సింధునదియు, దాని యుపనదులును బశ్చిమోత్తరదేశములగు సృంజయకేకయాదులును బేర్కొనబడియున్నవి. యజుర్వేదమున సరస్వతీయమునా గంగాదినదులును, కురుపాంచాల కోసలవిదేహాదిపూర్వదేశములును బేర్కొనబడియున్నవి. బ్రాహ్మణారణ్యకోపనిషత్తుల రచనాకాలమునాటికి వారుత్తరహిందూస్థానమునంతటను వ్యాపించియుండిరి. ఫలవంతమగు నీదేశమునకు వచ్చినతరువాత స్థలమపర్యాప్తమగుటచేతనే వారు నివాసస్థానమును వ్యాపింపజేసియుండవలయును.

విశాలమగుదేశమును వ్యాపించియున్న జనులలో వివిధప్రాంతములయందు నివసించు సంఘములకు బరస్పరసంబంధము క్రమముగా తగ్గును. ప్రయాణ సౌకర్యములు లేని ప్రాచీనకాలమున నట్టి సంబంధము శీఘ్రముగా బోవునని చెప్పవచ్చును. అప్పుడు పూర్వమేకరీతిగా నుండిన వారి భాషలలో భేదములు ప్రారంభమగును. కాలక్రమమున నీభేదము లధికమై పూర్వమేకరీతిగా నున్న భాష యనేకరీతులుగా పరిణమించును. సన్నిహితసంఘముల భాషలకంటె విప్రకృష్ట సంఘముల భాషలకు భేద మధికముగా నుండును. కొంతకాలమువఱకును భేదము తక్కువగా నుండుటచే నొకభాషను వ్యవహరించువారికి మిగిలినభాష లర్థమగుచుండును. మఱికొంతకాలమున నొకరిభాష మఱియొకరికి అర్థముకాని స్థితి యేర్పడును. దేశమునందు నదు

లును, పర్వతములును విశేషముగా నున్నయెడల వాని వ్యవధానమున వాని కిరుప్రక్కల నుండువారికి సంబంధము శీఘ్రముగా దగ్గుటచే భాషాభేదము శీఘ్రముగా నుత్పన్నమగును. పరస్పర గ్రాహ్యము లగుచున్నంతవఱకును వాని నేకభాషాభేదములనియు (Dialects), పరస్పరగ్రాహ్యములు కాకపోయినప్పటినుండియు వానిని ప్రత్యేకభాషలనియు (Languages) భాషా శాస్త్రజ్ఞులు వ్యవహరింతురు. ఇట్లు 'ఇండో-యూరపియన్' మాతృభాషను వ్యవహరించు జనులు వివిధదేశములకు వ్యాపించుటచే నాభాష యనేకభాషలుగా పరిణమించినది. ప్రపంచమునందలి మిగిలిన భాషలు కూడ నిట్లే వ్యాపించినవి. తరువాత నానాదేశముల ననుసరించి యానాభాషల కానానామములు సంభవించినవి. ఉ: పెర్షియన్, అరబిక్, గ్రీక్, ఇటాలిక్, స్పానిష్, ఫ్రెంచ్, మాంక్స్, ఐస్‌లెండిక్, మెక్సికన్, జపనీస్, బర్మీస్ ఇత్యాదులు.

మనదేశమును ప్రవేశించిన యార్యులభాష కూడ నిట్లే మాఱుచువచ్చినది. ఋగ్వేదభాషలోనే యిట్టి మాండలికభేదము లగపడుచున్నవి. లకార డకారయుక్త పదములను రేఫళకారయుక్తములుగా నుచ్చరించుట దేశభేదము ననుసరించి సంభవించిన దని తలంచుట కవకాశము కలదు. యజుర్వేదమున నిట్టివి మఱికొన్ని విపరిణామము లగపడుచున్నవి. యకార వకారములకు ఇయువాదేశము లిట్టివే యని మనము తలంపవచ్చును. బ్రాహ్మణారణ్యకోపనిషద్భాషలో విశేష విపరిణామ మగపడుచున్న దని ముందే చెప్పబడినది. వీనిలో వైకల్పికపు విపరిణామములన్నియు దేశభేదముననే యుపపన్నము లగును. గ్రంథములలో ద్వితీయాబహువచన మొకచో నైసంతముగా నుండి మఱియొకచో భిస్సంతముగా నుండినచో నీరెండును దేశభేదమున నేకకాలముననే వ్యవహరింపబడుచుండినవని తలంపవలయును. ఇట్లే తుమ్‌ప్రత్యయార్థము తవేప్రత్యయముచే గూడ బోధింపబడినయెడల నీరెండుప్రత్యయములును నాయర్థమున దేశభేదమున నేకకాలముననే ప్రయోగింపబడుచుండినవని యూహింపవలసియున్నది. భాషావిపరిణామ మేభాషలోనైనను సర్వవ్యాపిగా నుండును గాని యదృచ్ఛికమైనట్లుగా నుండదు. ఎకారౌకారము (ఎ. ఒ) లకారములోనికి నొకభాషలో మాఱవచ్చును, మఱియొకభాషలో మాఱకపోవచ్చునుగాని యొకభాషయందే కొన్నిపదములలో మాఱుటయు, మఱికొన్నిపదములలో మాఱకపోవుటయు సంభవింపదు. తరువాత నిట్టిభాషలకు సంబంధము కలిగి రూపసాంకర్యము సంభవింపవచ్చునుకాని ప్రథమమున భాషావిపరిణామములు భాషసంతతను వ్యాపించియుండును. దేశభేదములను బురస్కరించికొని కలిగిన యిట్టివిపరిణామములను సూచింపవలసివచ్చినప్పుడు దేశనామములతో నిర్దేశించుటయే యుచితముకదా! కావుననే పాణిన్యాదులు సంస్కృతములోని యిట్టిభేదములను దేశనామములతో కలిపి బోధించియున్నారు. ఉ. ప్రాచాం దేశే, ఉదీచాం ఉశీనరేషు, ప్రాచ్యభరతేషు, త్రైగర్తే, కాంబోజేషు, సురాష్ట్రేషు, ప్రాచ్యమగధేషు, ప్రాచ్యేషు, ఉదీచ్యేషు. ఆర్యుల వ్యవహారము వీనికన్న భిన్నముగా నున్న దనికూడ పతంజలి చెప్పియున్నారు. శబ్దాత్మకమును బాహ్యస్వరూపమున భేదము లేకుండుటచే వీనినన్నిటిని సంస్కృతభాషాభేదములని వీరు చెప్పియున్నారు. వర్ణవిపరిణామములు విశేషముగా గలుగగా వీని నానాదేశనామములచే ప్రత్యేకభాషలుగా వ్యవహరించుట కంటె సహజమైన విషయ మేమియున్నది. ఇట్లే ప్రాకృతభాషలు సంస్కృతభిన్నములుగా పేర్కొనబడుచున్నవి.

......ప్రాకృతంనామ మహారాష్ట్రోద్భవం విదుః,
శూరసేనోద్భవా భాషా శౌరసేనీతి గీయతే.

మగధోత్పన్నభాషాం తాం మాగధీం సంప్రచక్షతే,
పిశాచదేశనియతం పైశాచీద్వితయం భవేత్.

భరతమునికూడ ప్రాకృతములను దేశభాషలని వ్యవహరించియున్నాడు. దేశవ్యవహారజన్యములగుట చేతనే క్రమముగా ప్రాకృతభాషల సంఖ్య హెచ్చినది. క్రమముగా దేశమున భేదము లేర్పడ భాష లభివృద్ధిజెందినవి. ఒక్కొక్కప్రాకృతమునుండి యనేక దేశభాషలు తిరుగ నుత్పన్నములైనవి. ముఖ్యమైన ప్రా

కృతభాషలు నాలుగే యైయుండ దేశభాష. లేదనిమిది కలవు. వీనిలో మరలగూడ స్వల్పభేదములు కలవిభాగములు కలవు. ఉ. తూర్పుహిందీ, పశ్చిమహిందీ; మహారాష్ట్రీ, కొంకణి; ము. పైరీతిని వేదకాలమున ప్రారంభమైన భాషావిభజనము మనభాషలలో నిప్పటికిని జరుగుచునేయున్నది. ఇదియంతయు నొకటేభాషాప్రవాహము.

౧౧. ప్రాకృతపదములు తత్సమములు (సంస్కృతసమములు), తద్భవములు (సంస్కృతభవములు), దేశ్యములు నని మూడుజాతులుగా నున్నవి.

త్రివిధా ప్రాకృతీభాషా భవేద్దేశ్యా చ తత్సమా,
తద్భవా చ భవేద్దేశ్యా తత్ర లక్షణముచ్యతే, [నా,
తత్సమా సంస్కృతసమా నేయా సంస్కృతవర్త్మ
తద్భవా సంస్కృతభవా సిద్ధా సాధ్యేతి సా ద్విధా,
ద్విధిధా యాశ్చ సిద్ధార్థం ప్రాకృతం లక్షణం మతమ్.

ఈమూడువిధములగు పదములలో తద్భవపదముల చరిత్రమే ప్రాకృతవ్యాకరణములలో వివరింపబడియున్నది. తత్సమపదముల స్వరూపము సంస్కృతభాషానుశాసనమువలన స్పష్టము కాగలదు. దేశ్యపదములు దేశవ్యవహారసిద్ధము లగుటవలన వాని కానామము కలిగెను.

దేశేదేశే నరేంద్రాణాం జనానాంచ స్వకే స్వకే,
భంగ్యా ప్రవర్తతే యస్మిన్ తద్దేశ్యం నిగద్యతే.

వీనికి లక్షణములేదు. ఈదేశ్యపదముల సంఖ్య యింతయని స్పష్టముగా జెప్పజాలము. సంస్కృతసంబంధము లేని పదము దేశ్యము కనుక నట్టిసంబంధమును నిరూపించుటకు బూనుకొనినవారిజ్ఞానము ననుసరించి దేశ్యపదములసంఖ్య మారుచుండును. ప్రాకృతకోశములతిస్వల్పముగా నున్నవి. సుమారేబదిసంవత్సరములకు ముందు వానిని మన కొక్కటైనను దొరకలేదు. క్రీ. శ. ౧౮౭౩ సంవత్సరమున రెండుప్రాకృతకోశములు లభించినవి. ధనపాలుని "పాఇఅలచ్ఛీ" అనునది వానిలో ప్రాచీనతరము. ఇది దేశికోశమని గ్రంథకర్త యిందు చెప్పియున్నాడు. కాని ఇం దనేక తత్సమతద్భవపదములు కలవు. హేమచంద్రుని "రయణావలీ" యను దేశీశబ్దసంగ్రహము రెండవది. ఇదికూడ దేశీకోశమనియే యిందు జెప్పబడియున్నది.

ణీసేస దేసి పరిమలపల్లవిఅకుఊహలాఉల త్తేణ,
విరఇజ్జఇ దేసీసద్దసంగహో వణ్ణకమసుహఓ.

సం. నిఃశేష దేశీ పరిమలపల్లవిత కుతూహలా కుల త్వేన, విరచ్యతే దేశీశబ్దసంగ్రహో వర్ణక్రమ సుఖదః (సుభగః).

హేమచంద్రుడు తన యపారమగు సంస్కృతవాఙ్మయజ్ఞానముచే దన గ్రంథమునుండి విశేషముగా తత్సమతద్భవపదములను తొలగించెను. కాని యతడవలంబించిన నియమముల ననుసరించి కొన్ని చేర్పవలసి వచ్చెను. ఆనియమములను విడిచిన త్రివిక్రముడు తన శబ్దానుశాసనమున హేమచంద్రుని గ్రంథములోని యనేకపదములకు సంస్కృతజన్యత్వము నిరూపించియున్నాడు. హేమచంద్రుడు తన దేశికోశమునందు ౩౭౮౪ పదములను బరిగణించియున్నాడు. వీనిలో ౬౩౪ పదములకు త్రివిక్రముడు సంస్కృత జన్యత్వమును నిరూపించియున్నాడు. ౪౩౬ పదములనే నిజమగు దేశ్యములుగ త్రివిక్రము డంగీకరించి తన శబ్దానుశాసనముతుదను జేర్చియున్నాడు. హేమచంద్రుని కోశములోని మిగిలినపదములను త్రివిక్రము డంగీకరించిన ట్లగపడదు. హేమచంద్రునికోశములోని యనేకపదములకు వాఙ్మయమున ప్రయోగ మగపడదు. అవి హేమచంద్రుని దేశమున మాత్రము వాడుకలో నున్నవి కావచ్చును. అట్టి దేశవిశేష మాత్ర ప్రయుక్త పదములు హేమచంద్రుని గ్రంథమున గలవని యీ క్రింది యుదాహరణమునుబట్టి మనము రూఢిగా జెప్పవచ్చును. పతంజలి తన మహాభాష్యమున హమ్మ్ధాతువు గత్యర్థమున సురాష్ట్రదేశమున వ్యవహరింపబడుచున్నదని చెప్పియున్నాడు.

హమ్మతిః సురాష్ట్రేషు రంహతిః ప్రాచ్యమధ్యేషు
గమిమేవ త్వార్యాః ప్రయుఞ్జతే.

ప్రాచ్యదేశములలో వ్యవహరింపబడకపోవుటచే దద్దేశీయుడగు మార్కండేయుడు తన ప్రాకృతవ్యాకరణ

మున హమ్మ్రధాతువును దేశ్యముగా భావించి ధాత్వా దేశములలో జేర్చియున్నాడు.

ఆగమ ఆహమ్మ్రజత్థో, ఆహమ్మ్రఇ, ఆజత్థఇ, ఆఅచ్ఛ ఇ ఇతి సంస్కృతాత్.

సురాష్ట్రదేశస్థుడగు హేమచంద్రుడు హమ్మ్ర ధాతువు సంస్కృతమునందే కలదనియు గాన నది యాదేశము కానేరదనియు జెప్పియున్నాడు.

హమ్మ్రఇ, ణిహమ్మ్రఇ, ణీహమ్మ్రఇ, ఆహమ్మ్రఇ, పహమ్మ్రఇ ఇత్యేతేతు హమ్మ్రగతా విత్యస్యైవ భవిష్యంతి.

ఈరీతిగా దేశపదములలోఁగూడ సురాష్ట్రాది పశ్చిమదేశమాత్ర వ్యవహృతపదములను హేమచంద్రుడు తన నిఘంటువునందు జేర్చియుండవలయును. అన్య దేశ్యము హేమచంద్రుని నిఘంటువునంగు జేరియున్న క్రింది యుదాహరణములు స్పష్టపఱుపగలవు.

అంగుత్థలం (అంగులీయం), పారసీకము. అంగుస్త్; తత్థగో (హస్తశాటకః), పారసీ, దస్తాక్; బంధో (భృత్యః), పారసీ, బంధక్; జయసః (హయసన్నాహః), పారసీ. జీన్; సరకస్రం (అల్పస్రోతః), పారసీ. సరక్; కరాలీ (దన్తపవనకాష్ఠం), అరబీ. ఖిలాల్.

వీనిని త్రివిక్రముడు దేశ్యములుగా నంగీకరింప లేదు. ఇట్టిపదములను విడిచి యంపెఱును దేశ్యములుగా నంగీకరించినపదములను విమర్శించినచో వానిలో ననేక ములు ద్రావిడకుటుంబమునకు జెందన తెలుగు, అర వము, కన్నడము మొదలగుభాషలలోని పదములవలె గనబడుచున్నవి. వీనిని ద్రావిడభవములని చెప్ప వచ్చును.

పుల్లీ (వ్యాఘ్రః), ఒప్పా (శాణాదినామణ్యాదే ర్మార్జనమ్), అద్దాఁ (దర్పణః), అక్కా (భగినీ), ఊరో (గ్రామః), తలారో (నగరరక్షకః), పామో (సర్పః), పొట్టం (ఉదరం), మడో (కంఠః), ముద్దీ (చుంబనం).

ఇట్లే మిగిలిన దేశ్యపదములుకూడ మనదేశము నందలి యాదిమనివాసుల భాషలలోని పదములు కావచ్చును. ఆర్యులు హిందూదేశమును బ్రవేశించి యందలి యాదిమనివాసుల నోడించి వారిని నడవుల లోనికిని పర్వతప్రాంతములకును వెడలిచి దేశము నాక్ర మించి యుండవలయును. చాలకాలమువఱకు నార్యుల కును ననార్యులకును సంబంధము కలిగెన ట్లగపడదు. ప్రాకృత భాషోత్పత్తికాలమున వారిరువురును గలిసి మెలిసి యుండిన ట్లూహింపవలసియున్నది. ఈ రీతిగనే ప్రాకృతభాషోత్పత్తియు, సంస్కృతములో లేని దేశీ పదములు ప్రాకృతములో నగపడుటయును నుపపన్నము లగుచున్నవి.

౧౨. ప్రత్యయసామ్యమును, పద సామ్యమును, భాషాసంబంధమును నిర్ణయించుటకు ముఖ్యమైన యాధారములు. భాషలకు సహజసిద్ధము లగు పదము లలో సామ్య మగపడిననే భాషలకు సంబంధమును నిర్ణయింపవలయును గాని భాషాంతరాగత పదములను బట్టి సంబంధమును నిశ్చయింపరాదు. దేశ్య పదములు ప్రాకృతభాషలకు భాషాంతరానీతములగుటచే నవి ప్రాకృతభాషలకు భాషాంతరసంబంధనిర్ణయ మున సహాయము చేయజాలవు. తత్సమతద్భవ పదములనుబట్టి ప్రాకృతభాషలకు సంస్కృతముతో సంబంధము కల దని మనము స్పష్టముగా జెప్పవచ్చును. ప్రత్యయములలో గూడ ప్రాకృతభాషలకు సంస్కృతభాషతో విశేష సామ్యము కలదు. కాన నివికూడ ప్రాకృతమునకు సం స్కృతముతోడనే సంబంధమును నిర్ణయించుచున్నవి. సంస్కృతము ప్రాచీనమైనదియు, ప్రాకృతము నవీన మైనదియు నగుటచే బ్రాకృతము సంస్కృతజన్యము కావ లయునుగాని సంస్కృతము ప్రాకృతజన్యము కానేరదు. సంస్కృతము వ్యావహారికభాషగనై యుండెననుటకు నిదర్శనములు కలవు. కనుక సంస్కృతము భాషాంతర జనకమనుట కేవిధమైన యనుపపత్తియు లేదు.

సంస్కృతము గ్రాంథికభాషయనియు, దానికి మూలమగు వ్యావహారికభాష యొకటి కలదనియు దానిని "ప్రాకృత" మనుదమనియు, సంస్కృతము "ప్రాకృత"జన్యమనియు జెప్పుటకు వలనుపడదు. సం స్కృతము వ్యావహారికభాషగానుండినదనుట కుపపత్తులు

చూపబడినవి. అవి గ్రాంథికభాషయని యంగీకరించి నను దన్కాలమున వ్యావహారికభాష దానికి జనకము కానేరదు. గ్రాంథికవ్యావహారికభాషలకు జన్యజనక భావసంబంధ ముండనేరదు. గ్రాంథికవ్యావహారికము లొకేభాషయొక్క రూపాంతరములు. మఱియు నప్పు డు ప్రాకృతములు సంస్కృతాపరపర్యాయమగు నా "మూలప్రాకృతము" నుండి పుట్టినవగునుగాని సంస్కృత జనకములు గానేరవు. ఏతీరున నైనను సంస్కృతము ప్రాకృతజన్యమనుట కుపపత్తి యగపడదు.

ప్రాకృతమున సంస్కృతి జన్యరూపములేకాక వైదికజన్యరూపములును విగుభ దుభాషానిలక్షణరూప ములును స్వల్పముగా గలవు. దీనినిబట్టి ప్రాకృతము సంస్కృతజన్యము కాని, వైదికజన్యముకాని కాదనియు విగుభ రూపిలక్షణభాషాజన్యమనియు జెప్పవలసినయవస రము లేదు. ఇట్టిరూపము లతిస్వల్పముగా నున్నవి. అవి యప్పటివ్యావహారికభాషలో నుండియుండవచ్చు ను. ఒకకాలమున విరివిగా బ్రయోగింపబడు శబ్దములు మఱియొకకాలమున విరళముగా బ్రయోగింపబడవచ్చును; ఒకకాలమున విరళముగా బ్రయోగింపబడు శబ్దములు మఱియొకకాలమున విరివిగా బ్రయోగింపబడవచ్చును. మఱియు వ్యావహారికభాషలకును గ్రాంథికభాషలకును భేద ముండును. వ్యావహారికభాషయందు గ్రాంథిక భాషలో నగపడని ప్రాచీనరూపము లనేకము లుండ వచ్చును. మన కుపలభ్యమానములగు ప్రాచీనభాషలు గ్రాంథికము లగునుగాని వ్యావహారికములు కానేరవు. మఱియు నొకకాలపువ్యావహారికభాషలో దత్పూర్వ కాలపు గ్రాంథికవ్యావహారికశబ్దములు రెండును గలిసి యుండును. ఇట్టికారణములచే సంస్కృతమున నగపడని యేవోకొన్ని శబ్దములు ప్రాకృతములో నుండవచ్చును. ఇట్టిశబ్దము లన్నిజన్యభాషలలోను నుండును. ఇట్లు స్వల్పశబ్దముల నాధారముగా జేసికొని ప్రాకృతము సం స్కృతజన్యము కాదనుట సమంజసముకాదు. ప్రాకృత మునకు సంస్కృతభిన్నమగు మఱియొక జన్యభాష కల దని యంగీకరించినను, నట్టిభాషకును సంస్కృతమున కును నయిదాఱుపదములలోనే భేదము కలదని యంగీ కరింపవలసియున్నది. సంస్కృతమునకంటె నైదాఱు పదములలోమాత్రము భిన్నమగుభాష సంస్కృతమే యగునుకాని భాషాంతర మెట్లగును?

సంస్కృతశబ్దములను దద్భవములగు ప్రాకృత శబ్దములను బరిశీలించినయెడల వానియందు సామాన్య ముగా జన్యభాషాపదములలో నెట్టివర్ణవిపరిణామము లుండునో యట్టివే యగపడుచున్నవి. ప్రాకృతతద్భవ ములలో వర్ణసమీకరణము (Assimilation), వర్ణలో పము(Loss)తన్నిమిత్తకదీర్ఘభావము(Compensatory lengthening),వర్ణాగమము (Intrusion) ప్రత్యయక్ష యము (Decay of affixes) ఈమొదలుగాగల విపరి ణామములే యగపడుచున్నవి. ఇట్టి విపరిణామములను జూపుచున్న భాషాంతరములకు జన్యజనకభావసంబంధ మంగీకరింతుమంటె సంస్కృతప్రాకృతముల కంగీకరిం పకపోవుటకు గారణ మగపడదు.

అసంయుక్తములగు పదమధ్యహల్లులు సాధారణ ముగా ప్రాకృతభాషలలో లోపించుటచే నివి వ్యవ హారానర్హములగు భాషలని యొకయాక్షేపము కలదు. కాని వ్యావహారికావస్థలోనున్న యప్పుడీభాషలలో నట్టి హల్లోపము జరిగెనట్లగపడదు. పాళీభాషలో నవి లోపింపవను విషయము పైనుదాహరింపబడిన పాళీ వాక్యములవలన స్పష్టపడగలదు. ప్రాకృతభాషలలో నైనను నొక్క(మహారాష్ట్రీ) భాషలోనే హల్లోపము విధింపబడియున్నది. అందును నావిధి ప్రాయికమే. ప్రాకృతవ్యాకరణకర్తలందఱును శ్రుతిసుఖము నశించు స్థలములలో లోపము చేయనవసరములేదని చెప్పియే యున్నారు.

ప్రాయో గ్రహణత శ్చాత్ర కైశ్చిత్ప్రాకృతకోవిదైః;
యత్ర నశ్యతి సౌభాగ్యం తత్ర లోపో నమన్యతే.

అని మార్కండేయుడును,

ప్రాయః శబ్దః కగాదీనాం లోపాతివ్యాప్తిబాధకః

అని వసంతరాజసదానందులును,

శ్రుతిస్వారస్యవైరస్యే లోపాలోపనియామకే,

అని కాత్యాయనుడును ప్రాయఃశబ్దార్థమును వివరించి యున్నారు. ప్రాకృతభాష వ్యవహారములో నుండు కాలమున నర్థసందేహములేని స్థలములలో (వినుట కింపుగా నుండు స్థలములలో) హల్లులు లోపించుచుండెను. ఉచ్చారణమున హల్లులకంటె నచ్చులు సులభమైనవియును, వినుట కింపునవియును కదా! అనార్య జనులసంసర్గముగూడ వ్యంజనలోపమునకు గారణమై యుండవచ్చును. కొన్ని హల్లులు వ్యవహారమున లోపింపగా గవులు గ్రంథములలో మఱికొన్నిటిని లోపింపజేసి యుండవచ్చును. కావుననే వర్ణలోపము విశేషముగాగల మహారాష్ట్రిభాషను శ్లోకములందే గాని గద్యమం దుపయోగింపరాదని మన విమర్శకులు చెప్పియున్నారు. కాబట్టి ప్రాకృత భాషోత్పత్తిని గుఱించి విమర్శించునప్పుడు వ్యంజనలోప విషయము ప్రసక్తము కానేరదు. భాషల యుత్పత్తిని గుఱించి విమర్శించునప్పుడు వ్యావహారికభాషలనే మన మాధారముగా జేసికొనవలయును.

౧౩. ఇంక ప్రాకృత భాషోత్పత్తిని గుఱించి కొంచెము విచారించి యీ వ్యాసమును బూర్తి చేయుదును.

సంస్కృతమునకును ప్రాకృతమునకును ముఖ్యమైనభేదము వర్ణోచ్చారణమున నగపడుచున్నది. సంస్కృతవర్ణము లనేకవిధము లగు విపరిణామములను బొందినవి. వానిలో ముఖ్యమైన వానిని గొన్నిటిని జేర్కొనెదను. అచ్చులలో ఋకారమును నైజౌలును వర్ణాంతరములలోనికి మాఱినవి. హల్లులలో గొన్ని పరుషములు సరళములలోనికి మాఱినవి. ఘోషము లగు మహాప్రాణవర్ణములు హకారములోనికి మాఱినవి. దంత్యములు విశేషముగా మూర్ధన్యములలోనికి మాఱినవి. షకారశవర్ణములు సకారములోనికి మాఱినవి. సంయుక్తాక్షరములు ద్విత్వాక్షరములలోనికి మాఱినవి. ద్విత్వాక్షరమునకు ముందుండు దీర్ఘాచ్చు హ్రస్వమైనది. పై విపరిణామము లన్నియు పాళీప్రాకృతభాషలకు సమానములు. ప్రాకృతభాషలలో మఱియొక విశేషము కూడ గలదు. అజ్మధ్యస్థమగు వర్గప్రథమ తృతీయ వర్ణములు లోపించినవి. ఇట్టివర్ణవిపరిణామము లింకను మఱి కొన్ని కలవు. కాని పైని జేర్కొనినవే ముఖ్యములైనవి. శబ్దములలో హలంతశబ్దము లజంతములుగా మాఱినవి. ధాతువు లన్నియు గూడ నజంతము లైనవి. భూతభవిష్యద్వర్తమానకాలములకు మాఱికిని మూడు తింతరూపములే మిగిలినవి. ఇట్లు సంస్కృతభాష విశేషముగ పరివర్తనమును బొంది మొదట పాళీభాషగను, నవంతరము ప్రాకృతముగను బరిణమించినది.

భాష యెల్లప్పుడును మాఱుచుండును. మాఱుచుండుటయే దాని స్వభావము. కాని యది యతిమందముగా మాఱుచుండును. సంస్కృత ప్రాకృత భాషల కింతభేద మగపడుచున్నచో యంతభేదము సంభవించుట కత్యధికకాలము పట్టును. అనేక శతాబ్దములు పట్టును. అబ్దసహస్రములుకూడ బట్టవచ్చును. ఆర్యులు హిందూదేశమును బ్రవేశించుటకు బూర్వమే వారినుండి విడి యిరోపాఖండమున బశ్చిమాంతమునకు బోయిన జర్మానిక్ శాఖవారి భాషలో నిప్పటికిని గూడ మూల భాషలో నింత విపరివర్తనము జరిగిన ట్లగపడదు. అందును ముఖ్యముగా ప్రాకృత భాషలలో నగపడు యజ్మధ్యస్థహల్లోప మాభాషలలో నిప్పటికిని నగపడదు. చూ. సం. మాతృ (మాతర్), ఇంగ్లీషు. mother, ప్రాకృతము. మాఅ, మాఇ, మాఉ, హిందీ. మాఈ, మా; సం. పాద్ (పాదు), ఇం. foot, ప్రా. పాఅ, హింది. పాయ, ఇ. పైయుదాహరణములనుబట్టి చూడగా పాశ్చాత్యభాషలలో నేటివఱకును లోపింపని హల్లులు హిందూదేశభాషలలో ననేకములను నబ్దసహస్రములకుబూర్వమే లోపించినట్లు తెలియుచున్నది. పాశ్చాత్యభాషలలో నిప్పటివఱకును మాఱక యున్న దంత్యము లట్లే యనేకాబ్దశతములకుబూర్వమే హిందూదేశపు భాషలలో మూర్ధన్యములలోనికి మాఱినవి. మఱియొకవిశేషముకూడ గలదు. పైవిపరిణామములు ప్రాకృతభాషోత్పత్తియగుటకు బూర్వము భాషలో గ్రమముగా జరిగిన ట్లగపడదు. ఆర్యులు హిందూదేశమున బ్రవేశించినతరువాత ననేకశతాబ్దములవఱకును వారిభాషలో వర్ణవిపరిణామములు విశేషముగా జరిగిన

ట్లగపడదు. కొన్ని పదములును ప్రత్యయములును లోపించినవికాని వర్ణములు వేదభాషయం దుండినట్లే సంస్కృతమునగూడ గలవు. కాత్యాయనునికాలమునకు దరువాతను పైనివివరింపబడిన వర్ణవిపరిణామము లతి శీఘ్రముగా జరిగిన ట్లగపడుచున్నది. మూడు నాలుగు శతాబ్దములకాలమున జరిగిన ట్లగపడుచున్నది. అటు తరువాతను దిరుగను నిప్పటివఱకును నంతవిపరిణామము జరిగిన ట్లగపడదు. వైదికసంస్కృతభాషల కుండునట్టి స్వల్పవిపరిణామము జరుగుట కనేకశతాబ్దములు పట్టినది. ప్రాకృతభాషలకును ప్రస్తుత ముత్తరహిందూదేశమున వ్యవహారములో నున్న భాషలకును నుండునట్టి స్వల్ప విపరిణామము జరుగుటకు దిరుగను ననేకశతాబ్దములు పట్టినది. కాని సంస్కృతప్రాకృతముల కగపడు విశేష భేదము స్వల్పకాలములో జరిగిన ట్లగపడుచున్నది. ఇది భాషాచరిత్రలో నొకవిశేషము. సామాన్యముగా భాషల కిట్టి యసమాభివృద్ధి జరుగదు. ఈకారణముచేతనే కొందఱు భాషాశాస్త్రజ్ఞులు పాళీప్రాకృతములు సంస్కృత జన్యములు కావని వక్కాణించియున్నారు. ఇంత యధిక మగు విపరిణామ మంతస్వల్పకాలములో జరుగనేరదని యు, దాన దత్పూర్వ మీభాషలలో నావిపరిణామములు క్రమముగా జరుగుచుండినవనియు సంస్కృతమునకంటె ప్రాచీనమగు వైదికభాషనుండియో, తద్భిన్నమగు నా కాలపు భాషాంతరము నుండియో ప్రాకృతభాష లుద్భవించినవనియు, గాన నివి సంస్కృతమునకు సమకాలికములో ప్రాచీనములో యగు సోదరీభాషల నియు, సంస్కృతమునకంటె నవీనములై తజ్జన్యములు కానేరవనియు వీరి యాశయము. ఇంతియ కాక సంస్కృతము వ్యావహారికభాష కాదనియు, బ్రాహ్మణులు వైదికకర్మలకొఱకు వేదభాషను సంస్కరించి కల్పించిన భాషయనియు, గాన నిప్పటికిని నది శ్రౌతస్మార్తకర్మలలో బ్రాహ్మణులచే నుపయోగింపబడుచున్నదనియు, భాషాంతరజనకము కానేరదనియుగూడ వీరు చెప్పుచున్నారు. భాషలకు నసమాభివృద్ధి సామాన్యముగా నుండదను విషయము నిజమేకాని యప్పుడప్పు డది కనబడుచుండును. స్వభావసిద్ధమగు నాంతరంగికకారణములవలన మాఱుచుండినంతకాలము దాని యభివృద్ధి సమముగా నుండును, మందముగాను జరుగుచుండును. బాహ్యకారణము లేవియేని సంభవించినచో శీఘ్రమగు విపరిణామమును బొందుటచే నసమాభివృద్ధి కలుగవచ్చును. ఇట్లుండ సంస్కృతప్రాకృత సంబంధము కుదురదని చెప్పి ప్రాకృతమును వైదిక భాషతోగాని, తద్భిన్నమగు మఱియొకబుద్ధిస్థమగు భాషతోగాని సంబంధింపజేయుట సమంజసముకాదు. సంస్కృతము వ్యావహారికభాషగా నుండెననుట కనేక యుక్తులు చూపబడినవి.

ఆర్యులు హిందూదేశమును బ్రవేశించినదిమొదలుకొని యీదేశములో స్థిరనివాస మేర్పఱచుకొనువఱకును నేకసంఘముగా నుండి యుండవలయును. ఈదేశమును వశపఱచుకొనుటకు దత్పూర్వనివాసులతో బోరాడవలసి యుండుటచే వారి కట్లేకసంఘముగా నుండవలసిన యవసరము కలదు. దేశమును వశపఱచుకొని యార్యావర్తమునం దుంతటను దాము స్థిరపడువఱకును ననార్యులతో బోరాడుచుండిరి కాని వారితో సహవాసము చేసియుండరు. స్థిరపడినతరువాతను సహవాస మారంభించియుందురు. సహవాసానంతర మనార్యు లార్య భాషయగు సంస్కృతమును నేర్చుకొన నారంభించి యుందురు. అట్లయినచో బ్రాహ్మణారణ్యకోపనిషత్కాలానంతర మనార్యులు సంస్కృతభాషను నేర్చుకొన నారంభించియుందురు. అప్పుడు వారు తమ వాగింద్రియము సంస్కృతభాషాసంస్కారము కలది కాకపోవుటచే సంస్కృతశబ్దముల నపభ్రష్టముల జేసి యుందురు. వా రుచ్చరింపలేని వర్ణములను విడుచుట కాని వారి కలవాటగు వర్ణములవలె వాని నుచ్చరించుట కాని చేసియుందురు. ఇట్లనార్యుల నోటబడి సంస్కృతము కొలదికాలములో నత్యధికమగు విపరిణామమునకు బాలైనది. విజాతీయుల నోటబడి స్వల్పకాలములో విశేషవిపరిణామములను బొందిన భాషలు మఱికొన్ని కలవు. ఇటలీదేశమును ననాగరికు లగు దేశాంతరస్థులు జయించి యాదేశపు లాటిన్‌భాష నిట్లే యపభ్రష్టముం జేయగా ఇటాలియన్‌భాషగా

స్వల్పకాలములో బరిణమించినది. ఆర్యులు కొలది కాలమువఱకును దమభాషను స్వచ్ఛముగా నుచ్చరించుచుండిరి. కాలక్రమమున వారుకూడ ననార్యుల యలవాటునకు లోబడిరి. బ్రాహ్మణులు వేదవేదాంగాధ్యయనము విడువక చేయుచుండుటచే వారి భాష చాల కాలమువఱకును మాఱకయుండెను. తుద కందలి భాషయును మాఱినది. చదువుకొనినవారుమాత్రము సంస్కృతము నెఱిగియుండిరి. కాని లోకవ్యవహారమున కపభ్రష్టభాషనే యుపయోగించుచుండిరి. సంధికాలమున సంస్కృతమును వ్యవహరించు శిష్టులు తదితరుల భాషనపభ్రంశమని చెప్పుచు నట్లు మాటలాడుట హేయముగా దలంచుచుండిరి. పతంజలికాలమున భాషాస్థితి యీతీరుననే యుండినది. కావుననే యత డపశబ్దములను మ్లేచ్ఛమనియు, నపశబ్దములను వ్యవహరించువారు మ్లేచ్ఛులతో సమాను లనియు, నసురు లపశబ్దముల వాడుకగురనియు, నని సంస్కృతశబ్దముల యపభ్రంశము లనియు జెప్పియున్నాడు.

ఏకైకస్య శబ్దస్య బహవోఽపభ్రంశాః.

సరిగ నుచ్చరింపలేనియప్పు డొక్కొక్క డొక్కొక్క విధముగా నుచ్చరించునుగదా! విపరిణామప్రారంభమున నది నియమరహితముగా నుండును. క్రమముగా వ్యవహారమున నియమ మేర్పడును.

తేఽసురాః హేలయో హేలయ ఇతి కుర్వంతః
పరాబభూవుః, తస్మాద్బ్రాహ్మణేన మ్లేచ్ఛితవై
నాపభాషితవై మ్లేచ్ఛోహవా ఎష యదపశబ్దః.

అనార్యులనోటబడుటచే సంస్కృతభాష శీఘ్రకాలములో బ్రాకృతభాషలుగా మాఱినది. ఇట్లు సంస్కృతమునుండి ప్రాకృతభాషోత్పత్తి యుపపన్నముగు చున్నది.

౧౪. సంస్కృతమును [illegible] చ్చరింపలేక యపభ్రష్టముజేసి ప్రాకృతభాషగా మార్చినవారెవరై యుందురో విచారింపవలసియున్నది. సంస్కృతమును సరిగా నుచ్చరింపలేక మార్చినవారు తమ యలవాటుల కనుగుణముగా మార్చెదరుగాని యధేచ్ఛముగా మార్చ లేరుకదా! కాన సంస్కృత మేతీరున మాఱినదో యట్టిలక్షణములుగల భాష నుపయోగించువారు దాని నట్లు మార్చియుండవలయును. అట్టిలక్షణములు చాల వఱకు ద్రావిడభాషలలో నగపడుచున్నవి. ద్రావిడభాషలలో ఋ, ౠ, ఌ, ౡ అనునచ్చులు లేవు. మహాప్రాణవర్ణములు లేవు. జ్ఞ షలు లేవు. శషలు లేవు. ప్రాకృతభాషలో (పాళీలోగూడ) సంస్కృతములో లేని హ్రస్వములగు ఎ, ఒ లు కలవు. ద్రావిడభాషలలో గూడ నివి కలవు. సంస్కృతేతరమగు నిండోయూరపియన్ భాషలలో లేని మూర్ధన్యవర్ణములు ద్రావిడభాషలలో కలవు. ఈవర్ణములు ప్రాకృతమునకేకాక సంస్కృతమునను ప్రవేశించినవి.

తెనుగునకు వర్ణములు ముప్పదిరెండు. ఋ ౠ ఌ ౡ విసర్గ ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ జ్ఞ ష శషలు సంస్కృతసమంబులనుగూడి తెలుగున వ్యవహరింపంబడును. (బాలవ్యాకరణము. 3, 4 సూ.) మహాప్రాణాక్షరగళా, ఋ, ౠ, ఌ, ౡ, శ, ష, విసర్గ, విజాతీయ సంయుక్తాక్షరగళూ ఉళ్ళ శబ్దగళెల్ల ప్రాయశః సంస్కృతశబ్దగళెందు తిళియ తక్కద్దు.(శబ్దమణిదర్పణ. 21 పేజీ)

అ ఇ ఉ ఎ, ఒ ఇవై ఐన్దు కుఱిల్ ఆమ్; ఆ ఈ ఊ ఏ, ఐ, ఓ, ఔ ఇవ్వేழుమ్ నెడిల్ ఆమ్; క చ ట త ప ఱ ఎన్ఱ ఇవ్వాఱుమ్ వల్లినమ్ ఆమ్; ఙ, ఞ, ణ, న, మన ఎన్ఱ ఇవ్వాఱుమ్ మెల్లినమ్ ఆమ్; య ర ల వ ழ ళ ఎన్ఱ ఇవ్వాఱుమ్ ఆమ్ ఇడైయినమ్ (ఇలక్కణ చ్చురుక్కమ్, ౬, ౭, ౯, ౧౦, ౧౧ సూ.)

ఇట్టిసామ్యములగపడుటచే ద్రావిడులే సంస్కృతము నుచ్చరింపబోయి దాని నపభ్రష్టము జేసియుండవలయును. వారి యలవాటులనుబట్టి, వారి భాషాసంప్రదాయముల ననుసరించి సంస్కృతభాష [illegible]. కొంతకాలములకాటుపడినతరువాతను సరిగా నుచ్చరింపగలుగుదురు. మొట్టమొదటమాత్రము వారిజాతికి సంస్కృతసంస్కారము లేకపోవుటచే సరిగా నుచ్చరింపగలిగియుండరు. తమ భాష కత్యంతభిన్నమగునట్టియు తా మనేక పురుషాంతరములనుండి యెఱుగనట్టియు భాష నుపయోగించుటకు ప్రయత్నించువా రందును

నవనాగరికులు, భాష నభ్యసించు శిశువుల సామ్యమును బొందుదురు. వారి వర్ణోత్పాదకావయవములు నూతన వర్ణముల కలవాటుపడియుండకుండుటచే క్రొత్తరీతిని బోక వానికలవాటగు రీతినే పోవుచుండును. కాన క్రొత్తభాష యపభ్రష్టమగును. కొంతకాలమునకు వీరికి నూతనసంస్కారము కలిగి క్రొత్తవర్ణములను సరిగా నుచ్చరించు సామర్థ్యము కలుగును. కాన ప్రథమమున సరిగా నుచ్చరింపలేక యపభ్రష్టము చేసిన ద్రావిడులు కొంతకాలమునకు సంస్కృతమును సరిగా నుచ్చరింపగలిగియుండవలయును. కాని యప్పటికి భాషలో సంభవించిన విపరిణామములు స్థిరపడును. అవి నిలువబడెను. పైకారణముచేతనే ప్రాకృతభాషలలో తద్భవతత్సమములు రెండును కలిసియున్నవి.

వర్గప్రథమతృతీయ వర్ణలోపము ద్రావిడభాషలలో లేకపోయినను ప్రాకృతభాషలలో సంభవించినది. పాళీభాషలో లేకపోవుటచే నిది నవీనముగా సంభవించియుండవలయును. ఘకారమును హకారములోనికి మార్చు నలవాటును బురస్కరించుకొని గకారమును అకారములోనికి మార్చు నలవా టేర్పడియుండవచ్చును. భకారమును హకారములోనికి మార్చు నలవాటును బురస్కరించుకొని బకారమును అకారములోనికి మార్చు నలవా టేర్పడియుండవచ్చును. మహాప్రాణవర్ణములు హకారములోనికి మారగా నల్పప్రాణవర్ణము లకారములోనికి మారియుండవచ్చును. ఇట్లు కొన్ని వర్ణములు మార్పును బొందగా మిగిలినవి వాని ననుసరించి యుండవచ్చును.



ప్రకృతి

# రసరాద్ధాంతం

దువ్వూరి సూర్యనారాయణమూర్తి
[శ్రీనవ్యసాహిత్యమండలి]

యువవైశాఖభారతిలో శ్రీ పాటిబండ మాధవ శర్మగారు ప్రకటించిన క్రొత్త రసపరిష్కారమును చూచినాను. ప్రబుద్ధాంధ్రలోని హనుమచ్ఛాస్త్రిగారి ప్రేమతత్వపరామర్శకు ఇది అవమర్శ రూపమైన ఒక వింత వాదము.

దేవగుప్తాపు విశ్వేశ్వరరావుగారు ప్రేమ నిర్వచనమాత్ర సందర్భం తీసుకుని శాస్త్రిగారి విమర్శలేశాలను పొందిగ్గే ఉద్ధరించుకున్నారు.

కాని,— శర్మగారుమాత్రం మల్లాది శాస్త్రులవారి వాదప్రకారము నట్లుంచి వారి సిద్ధాంతౌచిత్య భక్తివల్ల ఒక అపోహకు పాలుపడ్డారు.

అసలు సగంసగం తీసుకుని విశ్వేశ్వరరావుగారు శాస్త్రిగారి విమర్శాంశాల ఉద్ధరిస్తే అసలే వారి 'రివ్యూ' చూడకుండా శర్మగారు శాస్త్రిగారిమీద అవమర్శకు దిగేరు. ఇది పరిష్కర్తల మొట్టమొదటి లోపం.

చూడండి. ఇవి ప్రబుద్ధాంధ్రలోనిశాస్త్రిగారిమాటలు: "ఈప్రేమవలన నవరసములు పుట్టునట. ఈ అనుగమము అప్రసిద్ధము. ప్రేమను స్థాయిగానుంచి రసములను సాధింప చూచినారు. కాని బీభత్స, భయానకాద్భుతములందు ముఖ్యముగా నీ యనుగమము కుదరదు......ఇంతలో ప్రాబంధికపు టనుగమము సిద్ధింపచెయ్యాలని చాలా ఉబలాటపడ్డారు."

పరిష్కర్తలు హనుమచ్ఛాస్త్రి గారు వ్రాసినవిగా భారతిలో నుదాహరించిన మాటలు "ఇది కావ్య మెంత మాత్రము కాజాలదనియు, రసము లన్నియు ప్రేమ మూలకములను శాస్త్రులవారి సిద్ధాంతము కేవల సత్యదూరమనియు వ్రాసినారు."

దీనినిబట్టి శాస్త్రిగారి వాదప్రకారమును పరిష్కర్తలు గుర్తించలేదని స్పష్టంగా తెలుస్తున్నది. అవిచారిత రమణీయమైన పరిష్కర్తల పరిష్కారం పరామర్శించడంద్వారా శాస్త్రిగారి "వాక్యములందలి శుద్ధిని" నిరూపింప దలచి ఈవ్యాసం వ్రాస్తున్నాను.

వాదమర్యాద ననుసరించి పరిష్కర్తల వాదముయొక్క సూక్ష్మశరీరమును ఇక్కడ చూపుతున్నాను.

౧. నిర్గుణరూప (Neutral) శాంతాపరపర్యాయిక, ఏనిశ్చల తత్వపు వికారం ప్రేమ.

౨. దీనికి ప్రవృత్తినివృత్తు లున్నవి.

3. ఆ ప్రవృత్తినుంచి నాలుగురసములు, నివృత్తినుంచి నాలుగురసములు పుట్టును.

"ఇట్లు పరిశీలించుటవల్ల శాంతము మూలరసమనియు, దానినుండి బయలుదేరినవే శృంగారాదు లగు ప్రవృత్తి రసములు, కరుణాదులగు నివృత్తిరసములు ననియు, సర్వరసములకు కారణము ప్రేమ యనియు తేలుచున్నది."

పరిష్కర్తలు మొట్టమొదట అభినవగుప్తపాదాచార్యుని అభినవభారతి ఉదాహరించినదని "స్వంస్వం నిమిత్త మాసాద్య శాంతాద్భావః ప్రవర్తతే" అనేశ్లోకాన్ని ఉదాహరించి, దానికి 'నావ్యాఖ్యానం'గా పైప్రేమ వాదం ఎత్తేరు.

ఐతే ఏసందర్భంలో అభినవభారతి పై శ్లోకాన్ని ఉద్ధరించింది? దానికిచ్చిన పరిష్కర్తల 'నావ్యాఖ్యానా'నికి ప్రమాణం నేమిటి?

శాంతంనుంచి సన్నిహితవ్యవహితభావరూపరససామగ్రి ఉప్పతిల్లుతుందని ఏసంస్కృతసాహిత్యాచార్యులూ చెప్పలేదు. అనుభవానికి దూరంకూడా.

స్త్ర్యాదినిమిత్తములవల్ల సుఖదుఃఖాది భావములు మాత్రమే శాంతాపరపర్యాయిక నిర్గుణతత్వంనించి పుట్టవచ్చు. ఆభావములు భావుకచిత్తంలో బాగాభావింపబడితే అప్పుడు రససామగ్రి ఏర్పడుతుంది. దీనికి ప్రమాణంగా ఈకారికను చూడండి. "సుఖదుఃఖాదిభిర్భావై ర్భావ స్తద్భావభావనమ్." (రత్నాపణోద్ధృతము.)

మల్లినాథసూరిఅంతటివాడుకూడా తన సంజీవిన్యవతరణికలో "నామూలం లిఖ్యతే కించిత్" అన్నాడు. ఇంక ఈరసపరిష్కర్తలుమాత్రం అభినవభారతి ఇచ్చిన శ్లోకానికి అమూలకమైన 'నా వ్యాఖ్యానము' వ్రాశారు.

ఇక ముఖ్యమైన ప్రేమవాదం —

ముందు ప్రేమఅంటే ఏమిటో చూడవలసివుంది.

"అనురాగః ప్రకృష్టశ్చే దుచ్యతే ప్రేమశబ్దతః,
ప్రేమప్రకర్షం నీతంచే త్సఏవ ప్రణయః స్మృతః"

ఒకవ్యక్తిపై మరియొకవ్యక్తికి కలిగే ఇష్టం అనురాగం. ఇది ఉన్నతమైతే ప్రేమ అని చెప్పబడుతుంది. దీని ప్రకర్షస్థితి ప్రణయం. కాగా మనకు వస్తుమాత్రంమీద కలిగే కోరిక కామం ఔతుందిగాని ప్రేమకాదు. దీనికి పర్యాయంగా వాంఛ, ఇచ్ఛ మొదలైనమాటలు వాడవచ్చు. అంతేగాని కామమాత్రమునకు ప్రేమఅని వాడడం తప్పు. 'నాకు గేదెపెరుగుమీదా, కొత్తావకాయమీదా చాలాప్రేమండీ' అని యెవరేనా అంటే నవ్వుతాంకదూ? కాబట్టి సామాన్యమైన కోరికకు కామమనీ, వ్యక్తిగతమైన ఇష్టమునకు — అనురాగము (రతి)-ప్రేమ అనీ, వస్తుగతమైన ఇష్టమునకు — వాంఛ-ఇచ్ఛ అనీ వ్యపదేశం.

శాంతమనే నిర్గుణతత్వపు వికారంగా మొదటపుట్టేది కామమనే సామాన్యభావం గాని ప్రేమఅనే విశిష్టభావం కాదు. ఎప్పుడూ సామాన్యం ముందు, విశిష్టం తరువాతా పుట్టడం సంప్రదాయం. అది కాక — విశ్వసన్నివేశాలను చూచేసరదానూ (హాస్యము) గొప్పగొప్పపనులు చేద్దామనే కోరికనూ (వీరము) అపూర్వార్థములను చూడడంవల్లకలిగే యిష్టమునూ (అద్భుతము) ప్రేమే అనడం యెంతవరకు ఉచితమో అభిజ్ఞులూహించండి. కాగా శాంతవికారం కామంగనక రసములు కామమూలకములైనవలెనేమోకాని ప్రేమమూలకములు కానేరవు. పోనీ ఆకామమునే వాసనమునకు ప్రేమ అనుకొని రసములన్నింటికీ ప్రేమ మూలం ఔతుందేమో చూద్దాం.

ప్రేమప్రవృత్తివల్ల—అంటే తత్తద్విషయాలమీద కోరికకలుగడంవల్ల శృంగారం, హాస్యం, వీరం, అద్భుతం ఉత్పత్తిల్లిన వంటే అనవచ్చు. కాని,

ప్రేమ నివృత్తివల్ల— అనగా ఆయా విషయాలమీద ఇష్టరూపమైన ప్రేమ లేకపోవడంవల్ల ఏర్పడే కరుణ, బీభత్స, రౌద్ర, భయానకములకుకూడా ప్రేమే ఎట్లామూలమౌతుంది? ప్రేమాభావంవల్ల కలిగే రసాలకు ఇంకేదో మూలమవాలి. అంతేకాని తద్భావం తత్కారణమనడం అవిచారమూలకము. అసాంప్రదాయమునుమాత్రమే.

“ఇట్లు పరిశీలించుటవల్ల శాంతము మూలరసము ”అన్నారు పరిష్కర్తలు. వారు ముందు చెప్పిన నిర్గుణ రూపశాంతము రసమౌతుందా? ఏవికారమూ లేని నిర్గుణమునకు రసత్వం ఎట్లా వస్తుంది? తొమ్మిదవ రసం కూడా సాధించడానికి దుర్బలమైన ఈమాట వ్రాయబడింది.

దేనినైనా తీసుకొని దాని ప్రవృత్తినివృత్తులవల్ల రసాలు పుట్టించవచ్చు. చూడండి. కరుణతీసుకుందాం — ఇది శాంతవికారమే. దీని ప్రవృత్తివల్ల కరుణాదిరసములు, నివృత్తివల్ల శృంగారాదిరసములు పుట్టినవి. కరుణరసస్థాయి శోకము — అనగా కాంక్షితాప్రాప్తిజన్య చిత్తక్షోభ. ఇది భయ, మనఃప్రజ్వలన, జుగుప్సాదులను భాసించుట స్పష్టమేగదా?

ఇక దీని నివృత్తి కాంక్షితప్రాప్తి.

అందువల్ల రతి, హాస, ఉత్సాహ, చిత్తవిస్తారాదులు పుట్టినవనడంలో విప్రతిపత్తి ఉండదుకదా?

కనుక రసములు కరుణమూలకములంటాం. ఇందుకు ప్రమాణంకూడా ఉన్నది. “ఏకో రసః కరుణఏవ నిమిత్తభేదాత్ భిన్నః పృథక్పృథగివ శ్రయతే వికారాన్”— భవభూతి.

కొన్ని శతాబ్దాల వెనుకనే సంస్కృత సాహిత్యవేత్తలు అపారమైన సాహిత్యచర్చలు చేసి మానవ మనస్తత్వమును

(Psychology) తరచితరచి కావ్యము, రసము మొదలైన అగాధ విషయములను నిర్వచించేరు. అప్పుడు పైకరుణవాదమువంటి ఎన్నో చర్చలుచేసి సామాన్యమైన ఒకనిర్ణయానికి వచ్చేరు. వాటిని చక్కగా చదువుకుని అవగతంచేసుకొని వాటిపై వికాసంగా (Development) పరిష్కారములు చేసినా అభిజ్ఞులు హర్షిస్తారు. కాని మన మేదో అనుకుని ఇది సనాతనరసజ్ఞులకు సమ్మతమనడం వట్టి దుర్బలవాదము.

సంస్కృతసాహిత్యం కోటీరంగా ధరించే ఆచార్యాభినవగుప్తాదుల రసోద్దేశక్రమోపపత్తిని శ్రీపరిష్కర్తలు చిత్తగించవలసివుంది.

"అత్ర చతుర్వర్గమధ్యే సర్వప్రాణిసులభస్య కామస్య సర్వస్యాస్వాద్యాంగత్వాత్ ప్రథమం శృంగారః. తత స్తజ్జన్యత్వేన హాస్యః. తత స్తద్విరోధిత్వాత్ కరుణః. తత స్తన్నిమిత్తభూతోఽర్థప్రధానో రౌద్రః. తతోఽర్థకామయోః ధర్మమూలత్వాత్ ధర్మప్రధానో వీరః. తస్య భీతాభయప్రదానసారత్వా త్తదనంతరం భయానకః. తత స్తత్కారణభూతో బీభత్సః. వీరాక్షిప్తభయానకాద్యనంతరం వీరరసఫలభూతో అద్భుతః. త్రివర్గఫలకరసానంతరం మోక్షఫలక శ్శాంతరసః. ఇత్యేవ ముద్దేశక్రమోపపత్తిః."

పైకారణకలాపమువల్ల రసములు ప్రేమమూలకములు అనే అనుగమం అప్రసిద్ధమని శ్రీ హనుమచ్ఛాస్త్రిగారు ప్రబుద్ధాంధ్రలో వ్రాసిన వాక్యములు శాస్త్రసిద్ధములు, పండితైకవేద్యములు, సంప్రదాయబద్ధములు అనవలసియున్నది.

పరిష్కర్తలు అనుద్విగ్నమనస్కులై ఈ వాదౌచిత్యమును గమనించకోరుచున్నాను.



# ఆంధ్రచ్ఛందోవిశేషములు

టి. రామచంద్రాచార్యులు

## ౧

బ్రహ్మశ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రులుగారు క్రొత్తగా నీనడుమ 'వీరసింహుఁడు' అని స్వయంకృతమును మంజరీరచనము నొక దానిని బ్రకటించిరి. దానిలో ద్విపదరచనమును గూర్చి చర్చను గల్పించుకొని యీక్రిందివ్రాఁత వ్రాసిరి:

"చిన్నన్నగారి యష్టమహిషీకల్యాణములోని ద్విపదలక్షణమును విశ్వసించుచు నేఁటి లాక్షణికు లీక్రిందిరీతి నభిప్రాయపడుచున్నారు. "ద్విపదమున నితరు లెవ్వరును బాటింపని ప్రాసయతి నీతఁడు చేర్చెను. రంగనాథరామాయణమునఁగాని, గౌరన హరిశ్చంద్రచరితమునఁగాని ప్రాసయతి యొక్కటైనను గానరాదు. ఈతఁడును, నీతని కనుయాయులగు శివకవులు మఱికొందరు మాత్రమే యాద్విపదప్రాసయతిని గూర్చిరి."

—బసవపురాణపీఠిక ౫౭-వ పుట.

సరిగాఁ బరిశీలింపకయే పీఠికాకర్త లిట్లు వ్రాసిరి గాని రంగనాథరామాయణమునఁ బ్రాసయతి ప్రయోగములును పదమధ్యపద్యావసాన ప్రయోగములును ననేకస్థలములం దగపడుచున్నవి.

౧. ప్రాసయతి.
ఎనసి గోహత్య చేసినవాని గతికి
౨. శరణార్థి బోవని దురితాత్ము గతికి
(రంగనాథరామాయణము ౧౩౧ వ పుట.)
౩. రసరసాన్నములను మెసపెడువాడు
(రంగ. రా. ౧౩౪-వ పుట)
౪. నిలువగాకుండ నిచ్చలు నొసంగుదువ
(రంగ. రా. ౧౩౭-వ పుట)
౫. అని తన పెండ్లివార్తను వంతదాను.
(రంగ. రా. ౧౪౬ వ పుట)"

ఇది యెల్ల 'వీరసింహుఁడు' అను శ్రీసీతారామస్వామిశాస్త్రిగారి గ్రంథపుఁబీఠిక. ౨౦ వ పుట.

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు బసవపురాణపీఠికలో ద్విపదరచనమునందు పాల్కురికి సోమనాథాదులగు శివకవులయు, రంగనాథాదులగు తదితర కవులయు మార్గములు వేఱుతీరుగలవి యని వ్రాసిన పీఠికాభాగమునకు శ్రీ సీతారామస్వామి శాస్త్రిగారు నిక్షేపించిన యాక్షేపగ్రంథభాగమే మీఁద నే నుదాహరించినది.

ఇందు శ్రీ సీతారామస్వామిశాస్త్రిగారు రంగనాథరామాయణమునుండియే ప్రాసయతి ప్రయోగముల నెత్తి చూపిరి గాని, గౌరన హరిశ్చంద్ర చరిత్రమునుండి చూపరయిరి. సమ్యక్పరిష్కృతితో ముద్రితమయిన హరిశ్చంద్ర ద్విపదలో నవి యగపడమి కారణము కాఁబోలును. ఇంచుమించుగా నేఁడువేలద్విపదలు గల సోమనాథుని గ్రంథమున ప్రాసయతులు వేలకొలఁదిగా నగపడుచుండఁగా నించుమించుగా పదునాఱువేల ద్విపదలు గల రంగనాథరామాయణమును, ప్రతి ద్విపదకు రెండు చోటులందుఁ గానరావలసిన యతులలో పదునైదువేల తొమ్మిదివందలపైఁ గొన్ని పదులకుఁబై చిలుకు ద్విపదలందుఁ గాన రాక వ్రేళ్ల సంఖ్యతో లెక్కింపఁదగిన ద్విపదపాదములందే కానవచ్చిన ప్రాసయతి కవిప్రయుక్తము గాక లేఖకాది ప్రమాదపతిత మగునేమో యని సందేహించుటయు, చక్కఁగాఁ బరిశీలించి తత్త్వము నిర్ణయించుకొనుటయు సహృదయ నీతి యగును. అందును రంగనాథరామాయణ మింతదాఁక సమ్యక్పరిష్కారముతో ముద్రితము గాకయుండెను. సరిగాఁ బరిశీలింపకయే యట్లు వ్రాసినారని ప్రభాకరశాస్త్రిగారి నాక్షేపించునపుడు సీతారామస్వామిశాస్త్రిగారు సరిగాఁ బరిశీలించియే వ్రాసినారని గదా సహృదయ సామాన్యదృష్టికిఁ దోఁచును! ప్రభాకరశాస్త్రిగారే ప్రమాదముపాలయి

రని నమ్మి నేను వారి నడుగఁగా వారిట్లు నాకు బదులు చెప్పిరి.

"ఇట్టి యాక్షేపము నింతకుముందే శ్రీ బండారు తమ్మయ్యగారాంధ్ర సాహిత్యపరిషత్ పత్రికలోఁ గాఁబోలును ప్రకటించిరి. వాఙ్మయవివాదరంగమునుండి పెక్కేండ్లకుముందే యొడదొలఁగిన నేనేమియు బదులు వ్రాయనయితిని. తత్త్వమెఱుఁగఁగోరెదవేని నీవే చక్కఁగాఁ బరిశీలనము జరపుదువుగాక" యనిరి. వారి తోడ్పాటుతోనే నేను కడుఁ గుతూహలినై ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమునఁ గల రంగనాథరామాయణపు వ్రాఁతప్రతులఁ బరిశీలించితిని. అట్లు పరిశీలింపఁగా శ్రీ సీతారామస్వామిశాస్త్రి గారి యాక్షేపము నిరాధారమయినదిగాను, పరిశీలింపకయే వ్రాసినదిగాను స్పష్టపడినది. ఎట్లనఁగా క్రీ. ౧౮౩౯-వ సంవత్సరమున బ్రౌనుదొరగారు పదునైదు తాళపత్రప్రతులలోని పాఠములను బండితుల సాహాయ్యమున సేకరించి, కాగితమున నొక్క ప్రక్క మాత్రమే వ్రాయించి ఎదిరిపుటమీఁద పాఠభేదములనెల్లఁ జేర్పించి బైండుచేయించిన రంగనాథరామాయణప్రతిలో (నెం. ౧౧-౧౨-౧౪) నీక్రిందిపాఠము లున్నవి.

౧. 'ఎనసి గోహత్యచేసిన వానిగతికి'

సీ. శా. ఇచ్చిన పాఠము.

'చెనసి గోహత్యచేసిన వానిగతికి'

బ్రౌను వ్రాయించిన పాఠము.

'ఎనసి' కంటె 'చెనసి' సమున్నతార్థ సందర్భముగలది గదా!

౨. 'శరణార్థి బోవని దురితాత్ము గతికి' సీ. శా. పా.

'శరణార్థి బోవని చపలాత్ము గతికి' బ్రౌ. పా.

'దురితాత్ముగతికి' అన్నపాఠము సరియైనది కాదనుటకు తర్వాతి ద్విపద మిదిగూడ సాధకము.

'పరులసొమ్ముల కాసపడువాని గతికి
పరసతిఁ గోరిన పాపాత్ముగతికి'

'పాపాత్ముగతికి' యనియు 'దురితాత్ముగతికి' యనియు రెండు ద్విపదలలో నేకార్థకపదములఁ జెప్పుట చతుర రచనము గాదుగదా!

౩. 'రసగసాన్నములను మెసవెడువాఁడు.' సీ. శా. పా.

'పానక దివ్యాంబరంబులు గట్టువాఁడు
మునివృత్తి వల్కలంబులు గట్టినాఁడు
పాసగ రసాన్నముల్ భుజియించువాఁడు
కసరుగాయలఁ బ్రొద్దు గడపుచున్నాఁడు.'

బ్రౌ. పా.

'పానక దివ్యాంబరంబులు' 'పాసగ రసాన్నముల్' అనియున్న బ్రౌను పాఠములో రచనాసౌందర్యము గలదుగదా!

౪. 'నిలువగాకుండ నివ్వలు నోసంగుదువె.'

సీ. శా. పాఠము.

'కొలిచినవారికిఁ గోరి జీతములు
నిలువగాకుండ సన్నిధి నోసంగుదువె.'

బ్రౌను పాఠము.

జీతములిచ్చు క్రిందివారికరులు మోసగింపకుండుటకు (తనసన్నిధి.) కావున 'నివ్వలు' కంటె 'సన్నిధి' పాఠము సమంజసముగదా!

౫. 'అని తన పెండ్లి గ్గను నంతదాను.'

సీ. శా. పాఠము.

'అని తన పెండ్లివృత్తాంత మంతయును.'

బ్రౌను పాఠము.

ఈ రెంటిలో నేది రచన మనిపించు కొనునో యెఱుఁగఁ జెప్ప నక్కఱలేదుగదా!

పయివ్రాఁత ప్రతులలో శ్రీ సీతారామస్వామి శాస్త్రులుగా రిచ్చిన పాఠమేదిగాని, యెందునుగాని కానరాలేదు. మఱియు ముద్రితగ్రంథముననుండి శ్రీ సీతారామస్వామిశాస్త్రిగారు దాహరింపని పాఠము నొకదానిఁ గూడఁ జూపుచున్నాఁడను.

'కడవఁజేసెడు పాపకర్మరాలైతి
నడురేయి నిట్ గడువడినిఁ బొమ్మంటి'

(అచ్చుప్రతి, అయోధ్యాకాండము, దశరథహతుఁడగు మునిబాలుని వృత్తాంతము.)

ఈ [illegible] ప్రతిలో నిట్లున్నది:

'సతిశేయి నిన్ను నే నదికిఁ బొమ్మంటి.'
ఇట్టి పద్యోక్తి కలవు.

ఇట్లు పరిశీలింపఁగా రంగనాథ రామాయణ మునఁ బ్రాసయతి గలదని తెలుఁచుట సరిగాదనిరోర్పవలసి యున్నది గదా!

మరియును బసవపురాణ పీఠికలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారిట్లు వ్రాసిరి:

"మఱియు ద్విపదయు ద్విపదయుఁ గలయునప్పు డొక్కపదమే యిటు గొంతయు, నటు గొంతయు నై యుండునట్లు రంగనాథాదు లెక్కుడుగ గూర్చిరయిరి. 'ద్విపదతో ద్విపద సంధిల నేకశబ్ద, మపుడు ప్రయోగింప నదియయుక్తంబు' అని చిన్నన్న స్పష్టముగా నిర్వచించినాఁడు. అయినను మన సోమనాథుఁ డీ నిర్ణయముం బాటింపలేదు.

౧. జాతులు మాత్రానుసంధానగణవి-
నీతులు గాన యనియత గణైక
నియమఁ బ్రాసోపా యనియు యతిర్వా పు...

౨. అతిశయప్రీతి బ్రహ్మాండపురాణ
మతి'మహో మోహస్య మాహాత్మ్య'మన మొ
దలఁ 'త్రిపుంద్రం మోక్షదం త్యక్త' మన 'పి-
రళ మేత జన్యత్ర రమతే' యనగ ను
చితసూక్తి యట్లు వాసిష్ఠలైంగంబు.
—పండితారాధ్య చరిత్రము.

ఇట్లు గూర్చుట పండితారాధ్యచరిత్రమందే హెచ్చుగాఁ గానవచ్చును. బసవపురాణమున నేద్విపదకా ద్విపద విడఁబడియే యున్నది."

పయి ప్రభాకరశాస్త్రిగారినిరూపణమునకు విరుద్ధముగా రంగనాథరామాయణమున ప్రయోగములు గలవని శ్రీ సీతారామశాస్త్రిలవారు 'పదమధ్యపద్యావసాన ప్రయోగములు' అని పేర్వెట్టి యీ క్రిందిపట్టులఁ జూపిరి.

౧. తమతమ యిండ్లకుఁ దా రర్థి నరుగ
శమితాఘలగు మునిసంఘంబు లప్పు-
డంత నావృత్తాంత మానోగదృష్టి.
రంగనా. ౩౬ పుట.

౨. విశ్వంబు కలగొని వెదకి నాయొమ్ము
నశ్వంబు గొనకొ నీ రరుగర వలవ
దని పల్కి నాగాక —రంగనా. ౪౦. పుట.

౩. చిన్నారినూగారు సింగంపుగోను
పొన్నపూబొక్కిలి నొసలెను పిలుదు
లూరుల మీగు... రంగనా. ౭౦ పుట.

౪. కౌసల్యసతి సామకర ముంచబట్టి
కైసేత లుడిగియి గతిపుష్పకర్ణి
కారశాఖయు బోలి —రంగనా. ౩౫ పుట.
("కర్ణికార, పు. కర్ణికామృచ్ఛాతి" శబ్దరత్నాకరము మహానిధి).

౫. వసుధ రాజిడి విరుల్ మనోపలములు
మసరుడేనియు సోన ముంచినవాన
గానొప్పును వసంతకాలంబు.—రంగనా. ౧౯౭ పు.

శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారు చెప్పిన లక్షణమునకు నుదాహరణములకును, శ్రీ సీతారామస్వామి శాస్త్రిలుగారు తద్విరుద్ధముగా యని రంగనాథరామాయణమునసుండి చెప్పించి చూపిన యుదాహరణములకును సంగతి లేదు. సంస్కృతశ్లోకములలో "యతి ర్విచ్ఛేదసంజ్ఞకః" అన్న చెప్పిన యతిస్థలములందుఁ గల్గు పదసంధివంటిది శ్రీ సీతారామస్వామిశాస్త్రిలుగారు చూపిన పదసంధి. అది కూడదని యెవ్వరును జెప్పలేదు. చిన్నన్న,

"ద్విపదతో ద్విపద సంధిల నేకశబ్ద
మపుడు ప్రయోగింప నది యయుక్తంబు"

అనెను. ప్రభాకరశాస్త్రిలును ద్విపదయు ద్విపదయుఁ గలయునపుడు ఒక్క పదమే యిటు గొంతయు నిటు గొంతయు నుండునట్లు గూర్పరాదని వ్రాసిరి. దానికి లక్ష్యములుగా "గణైక-నియమ, అన మొదల త్రిపుంద్రం, అనగను-చితసూక్తి" యనువాటిని జూపిరి. సీతారామ

శాస్త్రులుగారు చూపిన ప్రయోగములట్టివి గావుగదా! రెండు ద్విపదలను సంధిగూర్చ రాదనుట చిన్నన్న మతముకాదు. అతఁడు 'ద్విపదలో ద్విపద సంధిల' అనెను. పూర్వాపరద్విపదలు కందచంపకోత్పలాదుల వలె నంతాద్యక్షరంబు సంధిలేక తెగిపోవలెనని ఎవ్వరును జెప్పలేదే!

మఱియు చిన్నన్న,

"మఱియు సంస్కృతోక్త సమాసరూపమున
నెఱయ సన్నిహితమైన విశ్లేషంపఁదగును" అన్నాఁడు గదా!

కర్ణికార ప్రయోగ విలక్షణము చెప్పనక్కఱ లేకున్నదిగదా!

అనంతామాత్యుఁడు చెప్పిన "సముద్రసాహ్వ, సాయ." అన్న ప్రయోగమును "కళేచ్ఛ మృగతృష్ణికా సు సలిలం సమాసాద్గిత", "రామోనామ క్షితి పవతి కాకుత్స్థవంశోద్భవ స్సాల", "రామోనామ క్షితిపవతి సీతాపతి స్వాభిమానాః." ఇత్యాది యతిస్థలములందలి పదములు యతిచ్ఛేదములవంటివియు, శ్రీ సీతారామ స్వామిశాస్త్రులుగారే తమ యక్షగానంబున బ్రయోగించిన

"కాశాది స్వర్గలోకము నీడ దేవ
శములకు * సాహస్రంబులములందు విడిచి"
"విద్యాపురమహోచ్చ విభవంబులయను న
యసాక్రాంతమణిచేత నాకృష్టుఁడగుచు"
"రాగకల్పకవల్లి యాగతిక విఫలి
తంబుగాఁగ జయధ్వజం బెత్తలేదే"

ఇత్యాది ప్రయోగములును పూర్వులనివని చిన్నన్న చెప్పెను. రంగనాథాదులును ప్రయోగింపరైరి. కాని 'రామో నామ క్షితిపవతి సీతాత్మనాథో మహాత్మా' ఇత్యాది విధముల నచ్చుండి గల స్థలములును, శ్రీ సీ. శాస్త్రులు గారే ప్రయోగించిన

"దక్షిణ హైందవ స్థానమోఘా గ్ర
ణీ ధైర్యమున గోహిణీ సుజగ్రహము"

అన్నచోట అగ్ర+ణీ పదమును, రంగనాథుఁడు ప్రయోగించిన కర్ణి+కార (కర్ణికా+అర, కర్ణి+కార, ఎట్లయినను సరియే) అన్న పదమును ద్విపద సంధిలోఁ బ్రయుక్తములగుట దోషముగాదు. ఇట్లు పరిశీలింపఁగా చిన్నన్న చెప్పిన ద్విపదలక్షణమే పర్యాప్తమయినదని, రంగనాథాది ప్రాచీన కవి సంప్రదాయ సమ్మతమని తెలియనగుచున్నదిగదా!

మఱియు పాల్కురికి సోమనాథుని ద్విపదరచన రంగనాథాదుల ద్విపదరచనమునకును, తదనుసారియైన చిన్నన్న ద్విపదలక్షణమునకును విరుద్ధమైనదని స్పష్టముగాఁ దెలియనగుచున్నది గదా!

రంగనాథాదుల ద్విపదరచనా విధానమును కవి జనాశ్రయాది లక్షణగ్రంథములు కూడ నిరూపింపఁజాలకున్నవని నుడివియే ప్రభాకరశాస్త్రిగారు పర్యాప్తమయిన చిన్నన్న ద్విపద లక్షణ నిర్వచనమును బసవపురాణ పీఠికలో నుదాహరించిరి.

"ద్విపదమునఁ బ్రాసయతిని జేర్చుట మొదలుగా సోమనాథుఁడు చూపిన ఛందస్స్వాతంత్ర్యమును శివకవు లంగీకరించిరిగాని, యితరులు గర్హించిరి. కాకతి ప్రతాపరుద్రుని కాలమనసే యిట్టిగర్హ యేర్పడినట్టు పద్యబసవపురాణము తెలుపుచున్నది. అర్వాచీనుఁడగు నొక శివకవి యిట్లు చెప్పినాఁడు.

...ఇలఁ బాలకురికి సోమేశుండు మున్ను
తొలగక ప్రాసయతుల్ ద్విపదలను
లలి రచించుట యది లక్ష్యంబుగాను
నెలమి రేఫఱకారములు శివకావ్య
ములయందుఁ జెల్లుఁ దప్పులుగావు కాన
ఆపాల్కురికి సోము ననుమతి నేను
దీపితప్రాసయతిచ్ఛందసరణి

---

* 'సాహస్రంబులములందు' అనఁగా అర్థమేమో ?

నామహాగురుదేవు ననుమతి యట్ల
శ్రీ మెఱయంగ రచించితి నిట్లు"

(బసవపు. పీఠిక ౯౭ పు.)

పయివాక్యములవలన ప్రతాపరుద్రునికాలముననే పైమతభేదము వెలసినట్లు తెలియవచ్చుచున్నదిగదా! దీనింబట్టి సోమనాథు ననుసరించినవారు కొందఱును, రంగనాథాదుల ననుసరించినవారు కొందఱును నుండి రనుట స్పష్టమగుచున్నదిగదా!

పయిచర్చవలన శ్రీ చినసీతారామస్వామిశాస్త్రి గారు బసవపురాణపీఠికావాక్యములమీఁదఁ జేసిన యాక్షేపము నిరాధారమయినదని విస్పష్టపడుచున్నది గాదా!

---




ఆంధ్రులవైఖరి యిప్పటివలె నున్నచో—మరికొన్నాళ్లకు

# మను, వసు చరిత్రములందలి పద్యములు

శెట్టి లక్ష్మీనరసింహము

౧

"ఎందే డెందము కందళింప రహిచే
  నేకాగ్రతన్ నిర్వృతిం
జెందుం, గుంభగతప్రదీపకళికా
  శ్రీ దోఁప నందిందుఁ బో
కుందే నింద్రియముల్ సుఖంబుగ నను, న్నా
  యింపే పరబ్రహ్మ: మా
నందో బ్రహ్మ యటన్న శ్రౌతజువునం
  దర్బుద్ధి నూహింపుమా."

ఈ మనుచరిత్రపద్యము పూర్వముద్రణములందలి పాఠము. దీనియందలి 'కందళింప' 'కందళించు' గాను, 'నందిందు' 'నెందిందు' గాను క్రొత్త ముద్రణములందు మాఱినవి. ఈమార్పులు శ్రీయుత కుఱుగంటి సీతారామయ్యగారి సందేహమునకును, భ్రమమునకును గారణములైనవి. పూర్వపాఠమును బట్టి, యానందప్రాప్తిని జెందు విషయములు రెండే యగును; అవాంతరార్థములును రెండే యగును. రక్తితోఁ జిగిరింపఁగా మనస్సు దేనియం దేకాగ్రవృత్తిని సుఖముగాంచునో, కుంభగతప్రదీపకళికాశ్రీ దోఁప నింద్రియములు దేనియం దట్టిటు చలింపక సుఖము గాంచునో, యాయింపే పరబ్రహ్మము: ఇది పూర్వముద్రణములందలి వ్యాఖ్యానముఁబట్టి తేలెడి యర్థము. పూర్వపాఠమువలనఁగాని, వ్యాఖ్యానమువలనఁగాని పెద్దనగారి పద్యమున కెట్టిలోపమును గలుగనేరదు. 'కందళించి' యని యున్నచో సరసముగా నుండు ననుట నిశ్చయమే కాని యట్టిపాఠ మున్నట్లెచ్చటను గనఁబడదు. 'చు' 'చి'గా మార్చుకొనుమన్నది తంజాపూరు సరస్వతీమహాలు గ్రంథాలయమందలి యాయొక్క ప్రతికిని సంబంధించిన లేఖకునిదో, పాఠకునిదో యభిప్రాయమమాత్రమే.

"స్థితస్య గతి శ్చింతనీయ" అన్నారు పెద్దలు! 'కందళించు' పాఠముతోనే రసభంగముకాని యర్థము చెప్పి సమర్థించినారు సాహిత్యసమ్రాట్టు శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మమహారాజుగారు! 'కందళించు' సమాపకక్రియగాఁగాక ధాతుజవిశేషణముగా నన్వయించి, కందళించునట్టి రహిచే డెందము దేనియం దేకాగ్రసుఖము పొందునో యన్నది వారుచెప్పిన యర్థము.

౨

వసుచరిత్రమందలి నానాసూనవితానే త్యాదిపద్యమున సమాసోక్త్యలంకారము గలదని శ్రీయుత బులుసు వేంకటరమణయ్యగారు మిక్కిలి మెక్కువయిన చక్కని నేర్పుతో సాధించినారు. కాని, శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మమహారాజులుంగారి వెనుకటి సందేహము వెనుకటియట్లే యుండిపోయినది.

ఆపద్యమున సమాసో క్త్యలంకారము గలదని పూర్వవ్యాఖ్యానములలో లేదు. వావిళ్లవారి (౧౯౧౫) వ్యాఖ్యానమునందును లేదు. ఆనందముద్రాక్షరశాలవారి (౧౯౩౦) వ్యాఖ్యానమునందు మాత్రము తత్పద్యవ్యాఖ్యానముతుదిని 'సమాసోక్తియును' అను పొడిమాటయున్నది. ఎట్లో, వివరణము లేదు.

సమాసోక్తి యున్నదన్న పక్షమునఁ దేలెడి యవస్థ: గంధఫలి నాయిక. సారంగుఁడు నాయకుఁడు: శ్రీకృష్ణునితో సరిసమానుఁడైన దక్షిణనాయకుఁడు. అతనితో సంబంధముగల స్త్రీసముదాయములు రెండు తెగలవి గలవు. ఒకతెగ: స్వజాతికిఁ జేరిన మధుకరీ పుంజములు. రెండవతెగ: అన్యజాతికిఁ జేరిన నానాసూనవితానములు. అన్యజాతికిఁ జేరిన రెండవతెగలోనిదే గంధఫలీ నాయిక. తన జాతిలోని తక్కినవారి నెల్ల వలచిన నాయకుఁడు తన్నేల రొమ్ముఁడని యామె పంచాగ్నిహోత్రమధ్యమునఁ దపస్సు చేసినది. ఏమి కోరి? వేలలగు రుక్మిణీప్రముఖపురాణనాయికలేమి, చరిత్రలయందలి స్త్రీలేమి, పట్టి నాయకలాభమునే కోరినారు. అంతకంటె ప్రౌఢురాలైన మన గంధఫలీనాయిక తనకు మఱుమేనఁ దన నాథుఁడు వలచిన తన జాతి స్త్రీల లక్షణములు గలుగవలయు ననియు, నాథునికి స్వజాతీయువతులైన తన సవతులు తన కూడిగము చేయుచుండవలయుననియుఁ గోరినది. నాయకుఁడా? అతనిఁగూర్చిన చింత యేల? వచ్చిన ట్లతఁడు వచ్చినే తీరును: ఇది యంతయు రామరాజభూషణునికి లేని యత్యద్భుతకల్పనాశక్తి.

సమాసోక్తి యున్నదన్ననే, వసుచరిత్ర కర్త యనుచితపుఁ గూర్పు గూర్చినాఁడేమో యన్న సందేహము కలిగి, 'మధుకరీ' శబ్దమును మర్దించుట కిన్నిపాట్లు పడవలసి వచ్చును. లేకున్న, 'సారంగ'శబ్దము జాతివాచకము చేసికొని, స్త్రీ పురుష వివక్ష లేకుండఁ దుమ్మెదలు తక్కిన పువ్వులవాసన కింపుగని తన కంపు కిట్టనివైనందున సంపఁగి తపస్సుచేసి గిరికనాసికగ్నై యన్ని పూవుల వాసనను గ్రహించుటచేత దాని కిరువంకలను కటాక్షమాలికలను మధుకరీపుంజములు చేరినవని చెప్పుటలో నౌచిత్య భంగము కలుగదు.



" ఎంతకును రాఁడు మన్మనఃకాంతుఁ డకట! "

—యస్. దుర్గారావు.

# జానీ

కొల్లూరు ధర్మారావు

పదునాలుగులో ప్రపంచయుద్ధం
ప్రారంభించిన కొద్దిరోజులకు
పట్నం వెలుపల కంటోన్మెంటున
బారులు తీర్చిరి ఫౌజు.

చక్రవర్తికై జగద్రక్షకై
సైనికదళమున జేరిరి యువకులు,
ఉత్సాహము తమ ఊతకర్రగా,
దేశభక్తియే దినబత్తెముగా.

బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులను
పాటిం పిసుమంతైన లేకయే
పశ్చిమవాసుల యజ్ఞవేదికకు
పరుగులెత్తినారు.

"జర్మనువాడట, జగతినంతనూ
జయిస్తాడట, కానీ చూదాం;
చావే వస్తే వీరస్వర్గం-
సాధిస్తే, సామ్రాజ్యం!"
అంటూ ఝంఝామరుత్తుముందట
నణువులపోలిక జనసందోహము
వెడలసాగె రవి రుధిరము గ్రక్కె-
పడమటి సీమలకు.

* * * *

లోకం పోకడతో నాకేమని
వెన్నెలవెల్లువ విరియఁబోసినది
కదనరంగమున, గృహాంగణమ్మున,
మృతిచాయలపై—బ్రతుకూయలపై.

గాలికి తెరచిన కిటికీ చేరువ
నాలోకించుచు నిలచెను జానకి,
పదునారేడుల యౌవనభాగ్యము
కనురెప్పల నీడల నిలువగ.

ఆమె యెఱుంగదు ప్రపంచమేమో,
బ్రతుకుబాటలో మజిలీ లేమో,
ప్రేమను చంపే ఖేదాలేమో,
వాదాలేమో ఖేదాలేమో.

జగమంతా తన ఆనందముకే,
సృష్టియెల్ల తన రంజనకొరకే,
భూతభవిష్య ద్వర్తమానములు
మునిగిన యామె మధుప్రాయమున!

ప్రియనాథుడు, గోపాలము, జానకి
ప్రేమరాజ్యమున కధినేత;
గోపాలుని ప్రణయప్రపంచమున
కమృతార్ణవ మామె!

* * * *

"జానీ, జానీ! సీమదేశమున
కిక నే పోవకతప్పదు రేపే,
రాజునాజ్ఞ శిరసావహించుటే
సేవకధర్మము కాదా?

"జర్మను శంఖధ్వాన మ్మపుడే
సాగరోర్మికల సవారిమైనది,
సూర్యాస్తమయం బెరుగని మన ప్రభు
సామ్రాజ్యము రక్షింపవలెగా.

"అమాయికపు బెల్జియము, హరిహరీ!
గురియైనది శాత్రవశాతాసికి;
పట్టరాదు, భరియింపగరాదీ
జర్మనువారల దౌర్జన్యం!"

తమలపాకుగొని వాడిగోటితో
తీసిన యీనె విధమ్మున, పెదవుల్
విడివడ చిటిలిన మొలకనగవుతో
జానకి యిటు బలికెన్:

"నాథా! మీ రాడిన మాటకు నే
కా దనుదాననుగానీ,—(మౌనం).
యేరికిపోని యొనర్చు టెరుంగని
మీకూ నాకూ శత్రులు గలరా?

"అవ్వలి సైనికు డెవడైతే నేం?
ఆడుబిడ్డ మగడే కాదా?
మొగా లెఱుంగని మీ యిద్దరికీ
వైరం బెక్కడిది?

"ఏడువమని బాడుగకై తెస్తే
దుఃఖం యెట్లా వస్తుంది?
యెవరో కిరీటధారుల కాంక్షల
కిందరి కేలా, సంక్షోభం?

"ప్రేమపరిష్వంగముకొరకుగదా,
మనుజునకున్నవి బాహువులు?
మారణకర్మకు వినియోగించుట
మంచికార్య మగునా?"

ఫాలఫలకమున నల్లల నాడే
యామె ముంగురుల తన వ్రేళ్లన్
దువ్వెనతోవలె నిరుపార్శ్వములకు
నిమురుచు పెనిమిటి బల్కెన్:

"ముద్దరాలవుసుమీ, జానీ! యీ
యుద్ధాలన్నీ శాంతికోసమే;
దుష్టశిక్షణము శిష్టరక్షణము
గీతా సమ్మతముల్.

"రాజభక్తులకు రాజమార్గమును
భారతవీరుడు కన్గొడు చూపెను;
పోషించే ప్రభు వానతిచ్చుచో
అగ్నినిసైతం ఉరకాలి!

"హృదయము నీకడ కుదువబెట్టితిని,
పదిలపరపు నా తిరుగుదలకునై;
దేశాంతరముల దిగ్విజయముకై
పోవు నాకు నిర్భయమింక!"

* * * *

పటాలమంతా పట్నం వెడలే
శుభావసరమున సూచనగా
'బారకాసు'*లో మ్రోగిన ఫిరంగి
జానకి యెదలో పగిలెన్!

చింతల చాటున జారిన జాబిలి
రాగిరేకువలె వెలవెల బారెను,
తిమిరాలకలను విరియబోసుకొని
శోకమయం బయ్యెను లోకం.

* * * *

తన సర్వస్వము-తన గోపాలుడు
విడిచి చనినవా డర్థంబైనవి,

* Barracks.

బ్రదుకుబాటలో మజిలీ లేమో
వాదాలేమో ఖేదాలేమో.

జానకి కేదెస జూచిన గానీ
ఆశింపందగు వస్తువులేదు.
ఎవ్వారల దరిజేరినగానీ
మనసు గంతులిడు మాదిరిలేదు.

మాతృస్తన్యము మాయమైన శిశు
వేమి కాంచి శమియించు?
కిరాతగతమై పులుగు పోవగా
గువ్వలేమ నోదార్చె దెవరు?
"తడయగరాదిక, తరలిపోయెదను,
పంటాడెద నా ప్రాణఘనంబును;
తలుపులేని వాకిలి-యాలోకం-
దాచివేయునా, నాప్రియుని?"

అంటూ, పగబూనిన సర్పమువలె,
ఆకలిగను బాలెంత సింగమటు,
ప్రణయకేతనము పట్టుక జానకి
యుద్ధసీమకై వెడలెన్!

* * *

"క్వెట్టా" సైనిక శిబిరము చెంగట
గుడారముల నిర్మాణం బైనది
"రెడ్ క్రాస్" సేవాసంఘము వారల
యాపత్సహాయ సమితి.

శత్రుడు కానీ, మిత్రుడు కానీ,
ఆర్త రక్షణము వారి యాశయము;
ఆశా సంక్షుభితావని కనురా
గామృతదాతలు వారు.

అనుదిన మా శాంతికుటీరమునకు
వచ్చువారు వేనకువేలు,
అవనీసానువులందు సైనిక ప
దాహతులగు క్షత గాత్రుల్.

ఆసుపత్రిలో చికిత్సకాగ్రణు
లా వికలుల శోధించిన పిమ్మట
నప్ప జెప్పెదురు సంరక్షణకై
యచ్చటి దాదులకు.

దాదులచేతులు పరసువేదులో,
వారల యెడదలు జాలి గాదులో,
ముట్టినమాత్రనె రోగి తెప్పిరిలు
తల్లియొడిని పసికూన బలెన్.

వారలలో తలమానిక మనగా
"నైటింగే*" లపరావతార మన
దనరెను పరోపకారైక జీవి
యగు "జేన్" దొరసాని.

జీమూతగ్రసిత నిశానాథుని
చాడ్పున మోమున కళ దాగి,
స్పృహియింపగ జేయు ననూహ్యమ్మగు
విశ్వజనీనత చూపరకు.

ఆమెదృగంచలములలో విరియును
శీతలకరుణా శీకరముల్;
ఆ చిరునగవున నవతరించు బా
లేందు కిరణ నిశ్శ్వాసనం!

శూన్యకులాయము జూచి విశ్వమే
కలయ వెదకు కీరిక భంగి

* Florence Nightingale.

కదనాగత సైనికు లందరి గను
నామె నిరాశగ నెందులకో.

* * * *

కాటుక బూసిన కారు నిశీథిని
మోటా రొక్కటి వచ్చి నిలచినది,
యార్తనాదమటు "హారన్" ధ్వనింప
నామెగుడారము చెంత.

* * * *

నిద్దుర తాకని గాజు చూపుతో
ఒద్దిక సడలని లేత రూపుతో
శరణాగతరక్షకై కదీక్షా
శాలిని జేన్ అరుదెంచి,

"ఆసుపత్రిలో నీ నడురేయిని
నిద్రాముద్రితులై యుందురు జను
లిప్పటి కియ్యెడ శయ్య యున్న, దిట
డించుడు మీ యిక్కట్టుల మూట."

సేవాసోదరు లిర్వురు జేర్చిరి
గుడారమున పానుపుపైని,
మోటారున పయనించి తెచ్చిన గ
తాసుప్రాయపు మానిసిని.

"దాహం, దాహ"మ్మను తొలిపలుకే
భూగర్భంలో చీల్చుకు వచ్చిన
కరణిని వినబడినంతనె, పెదవుల
కందిచ్చెను జే నొక గ్లాసు.

"ఇంత చల్లదన మీ యమృతత్వం
బీ కరుణారస మెక్కడిది?
తల్లీ! చేతులు మోడ్పగలే దీ
రెక్క తెగిన పక్షి!

"ఈ వేదన భరమున నా కేవో
పురామధుస్మృతు లందిచ్చి,
పేదమనసునకు పెన్నిధి గూర్చెద
వమ్మా! నీ వెవరు?"

మోముజాబిలిని పరివేషించిన
తలపుట్టము విప్పి,
ముసరిక్రమ్ముకొను ముంగురు లెగయగ,
తలయూచుచు జేన్ పలికె:—

"వీరాగ్రేసర మిము కడుపున గని
ధన్యజీవ మైనది మీ మాత;
కన్నుల గని యిది ధన్యయయ్యె, మీ
చరణదాసి మీ జాని!"

* * * *

"రాజభక్తికై దేశముక్తికై
రాలిపోయినది దక్షిణబాహువు;
బలికోరిన దీ ప్రపంచయుద్ధం
నా అరకౌగిలి మాత్రం!

"నాథా! ప్రపంచశాంతికోసమై
ప్రవహించిన రక్తముచాలు;
ప్రేముడి జాబిలి వెన్నెల విరిసే
మింటికి, మనయింటికి, పోదాం!"

"దేశాలన్నీ నాశము కానీ,
లోకం శతధా భిన్నము కానీ,
ప్రణయరాజ్యమును పాలింతును నీ
పదసన్నిధి, నారాణీ, జానీ!"

# చింతామణి

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

వెలుగులు వెలారించు దృశ్యమునకు కళోపాసకులు కను లప్పగింతురు. సౌందర్యము సమ్మిళీనమైనపుడు సమీరస్పర్శనందిన పరిమళమట్లు, గంధబంధుర ప్రఫుల్లహృదయము ఆనందమున నుప్పొంగును. సౌందర్యము, ఆనందము, అనురాగము ప్రకృతికి సహజములు.



శ్రీయుత చింతామణిగారు

మనుష్యప్రకృతియందలి పాటనూపినపుడు జయగీతము పాడుదుము. హృదయము నుప్పొంగించు ఘనగుణములే మహాపురుషుల జీవనములందు సౌందర్యమును గురిపించును.

సౌందర్యసందీప్త ప్రకృతిదృశ్యముపై కళోపాసకుడు కన్నువేయునట్లు ఆశయప్రదీప్త మనుష్య ప్రకృతిపై జిజ్ఞాసువు మనసు నిలుపును. ఈతడును ఆతడును ఉపాసకులగుట సైదోడులు. కొంపవిఱిగి తలపై డల్లి పడుచున్నను, గత్నదీపములుపోయి ఆశయములనుండి వీరు కన్నులు చెదరనీయరు; వాని నందుటకు చిరతప మొనరింతురు.* వీరి స్థిరదృష్టి, వీరి స్థిరనిశ్చయము క్షుద్ర వాంఛలను పారద్రోలి, వీరికి స్థితప్రజ్ఞను, నిత్యానందమును ప్రసాదించును.

"ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే."
(శ్రీ భగవద్గీత అ ౨; శ్లో ౫౫.)

ఆదర్శకళోపాసకులును, సంయములును ఇట్టి ప్రజ్ఞనందెదరు. బుద్ధ యేసు గాంధి ప్రభృతులును, కాళిదాసు షేక్స్పియరు డాంటే మున్నగువారును దీనినంది పరమాశయములను ముగ్గినపండ్లట్లు పుడికిరి. వీరివలె పరిపూర్ణత్వముపై చూపుల్లు నిలుపకున్నను ఐహిక జీవనములందు విశేషోన్నతి నందినవారు పలుసీమలందు జనించిరి. ఇచ్ఛాశక్తి దృఢనిశ్చయములను, సహనపరిశ్రమలను చేత జిక్కబట్టి, వీరు తమ గమ్యస్థానములు చేరగలిగిరి. తన యుద్గ్రంథములందు - ముఖ్యముగ "self-help" నందు - స్మైల్స్ యిట్టివారి దృష్టాంతములను వివరించినాడు. అధునాతన ఆంగ్లవసుంధరయందు తలచూపిన లాయడ్‌జార్జ్, మేక్‌డొనాల్డు, లార్డ్ రీడింగ్ ప్రభృతులీ తెగలోనివారు. వీరు సంయములు కారు. కాని అణువులై పుట్టి మేరువులై పెరిగిన వ్యక్తులు. వీరియందు లోపములున్నవి; కాని వీరి పట్టుదల, వీరి సహనము, వీరి సామర్థ్యము అసామాన్యములని ఒప్పుకొనక తప్పదు. ఆంగ్లభూమియందువలె అనుకూలవాతావరణము మననేలయందు లేకున్నను, ప్రతికూల శక్తులెన్నో యిందు విజృంభించుచున్నను, వీరి కుజ్జీకాగల వ్యక్తులు మన రాజకీయ క్షేత్రమున పుట్టిరి. లోతులోయలో పుట్టి, రాజకీయములపై దృష్టి నిలిపి, యెత్తుకొండ నెక్కజాలిన ఆంధ్ర ప్రముఖులలో చిట్టావూరి యజ్ఞదత్త చింతామణి యొకడు.

* రవీంద్రుడు వాకొను 'Aspiration for the expansion of the human spirit' ఈతపమునుండి వేఱుకాదని నాయభిప్రాయము.

మనుష్యదృష్టిగల ఆదర్శము దిగ్వలయమువంటిది. ఒక ఆదర్శమును చేరినంతన నింకొకటి మెఱుపులు విర జిమ్ముచు కట్టెదుట కానుపించును. ఈ యాశయముల నందజూచు మానవుడు నిరంతర యాత్రికుడై యుండును. కొంతదూరము సాగిపోయి, సహనమును దిగ జార్చి, ఉస్సురస్సురనుచు, "ఇస్సీ!" యనుచు ఈ తడు తనగమనమును త్రెంపినవాడు, తా నొనరించిన కృషితో సంతుష్టినందినవాడు తనమనుష్యత్వమునకు, తన మహత్త్వమునకు హద్దుగోడ నిలుపుకొనినవాడగును. యాత్రికులందఱు ఒకేతీరుపట్టుదల కలవారుకారు. దృఢయత్న మెన్నడును ధూమశకటమువలె చరచర సాగిపోదు. నిమిషనిమిష మిది అడ్డంకులను, అరిష్టము లను మార్కొనవలెను. ఎదుటగోచునవి ఎత్తుకొండలు కాక, పూలరాసులనుచో దృఢయత్న మస్పృశ్యమగును. వీరునందు, మహాపురుషునందు, మనుష్యునందు గల శక్తి, విహంగపతినెక్కి యెగయు విష్ణుదేవునివలె దృఢ యత్నము నాధారమొనరించుకొని ఉన్నతస్థానములందు విజృంభించగలదు. కురుక్షేత్రమందే భీముని పని యున్నట్లు, దృఢయత్నమునకు ప్రతికూలశక్తుల కెదు టనే పనియుండును. ప్రతికూలశక్తులను కాంచని మాన వుడు మహాయోధుడు కాజాలడు. మఱి పిఱికిపందయగును. దూదిబుంగలను, ఇసుకతిన్నెలను ఎదుర్కొనుట కెల్లరకు సాధ్యము. హిమగిరిపై వాలుమొగ్గ వేయుట అప్రతిమానప్రజ్ఞగలవానికే సాధ్యము. మహా పురుషులను కనునవి మహారిష్టములును, మహోన్నత ప్రతి బంధకములును కాని విలాసావేశములు కావు. ప్రపంచ సాహిత్యమును తెలుపుడు; ఎన్నెని దృష్టాంతములు కనులబడును.

కష్టరహితములని పెడదారులు పట్టక బనియన్ తెలిపిన క్రైస్తవునివలె (Vide: Bunyan's "Pilgrim's Progress") యాత్రికుడెత్తుకొండలనే ఎదు ర్కొని తనయాశయమందలి విశ్వాసమును గోలుపడక* గమ్యస్థానమును చేరవలెను. కన్నుజెదరించు ప్రలోభ నము లెదురగుతఱి, ఉచ్చులబోలు వాని మోహంపు జాడక్కల నాతడు తవుల్కొనరాదు. మునిసిపల్ లాంతరులచెంత చదువుకొని, పెద్దయంజలువేసి ప్రముఖు డనిపించుకొనిన బయ్యా నరసింహేశ్వరశర్మ అవి యొడ్డిన వాసనమందు గూలబడి అపజయ మందినాడు. ఇక్కట్టులు నెట్టి, చదివిన ఆంధ్రప్రముఖుడు అల్లాడి కృష్ణస్వామి ఉన్నతిపందినాడు. కాని, యాతడు తన యాత్ర ముగిసెనని యెంచునో గోపురమువంటి తన గొప్పందనమును గూలద్రోసికొనును. నిమ్నతలమునుండి లేచి ఉత్తుంగశిఖరముపై కాలుంచిన మఱొక ఆంధ్రుడు రాధాకృష్ణుడు. ఇతడు కొండకొనగల ఎత్తుచెట్టుబోలు వాడు. ఈచెట్టునకును వియత్తలమునకును ఎంతదూరము లేదు! ఈదూరమును కడచినవాడు రాధాకృష్ణుడు పర మాశయమందిన పరమహంస యగును. క్రమనిష్ఠకతన వృద్ధిగాంచిన నాగేశ్వరరావు నేడును సంతృప్తిసందక, లోకోత్తరపురుషుడైన మహాత్ముని కనుతెరువు నిలుపు కొనినాడు. ఈతని యాత్ర, ఈతని తపసు సాగుచునే యున్నవి.

ప్రత్యేకస్థానమునుండి చింతామణి తనయాత్రను సాగించుచున్నాడు. శర్మవలె నితడు సంతృప్తినంది, వలయందు దవుల్కొనలేదు. అల్లాడివలె ధనరాసులపై దూకి నిలుపలేదు. రాధాకృష్ణునివలె ప్రపంచ మహా విజ్ఞానికాలేదు. నాగేశ్వరరావువలె కఠినవ్రతమునకుకడంగ లేదు. కాని, చింతామణి ఆత్మకురుక్షేత్రమున, పెద్దంజ వేసి వీరుడైనాడు. మనుష్యులందు కొలదిమందికే యుండు నియమపాలనాశక్తి ఈతనియందు రాశిలు గొడ్డణము. నీతినిబంధనము లీతని యారాధ్య దేవతలు. వీని యాన బాలించుపట్ల చింతామణి చేయజాలని త్యాగములేదు. నియమమున కంజలెత్తిరే కదా అరువదివేల రూకల రాశి నీతడు వదన్నాడు! మంత్రిపదవికి స్వస్తి చెప్పినాడు! బొంబాయిలోని "Indian Daily Mail" సంపాదకపదవికి బంగారూ రనినాడు! శర్మవలె నిరుపక్షి నాలుగు గంటలలో నీతడు తన కలుగునందు తెచ్చు దూరలేదు. నష్టకష్టములను లెక్కచేయక నమ్మిన దానిని మోమోటములేక చేసితీఱువాడు చింతామణి.

* "Bunyan's Alegory symbolises Faith"—Carlyle.

త్రిమూర్తు లడ్డునిలిచినను, ముల్లోకములు గడలు పూని వచ్చినను ఇతడు తన నిశ్చితాభిప్రాయమునుండి కదలడు.

స్వీయశక్తియందు, స్వతంత్రభావమందు ఈతనికి విశ్వాసము మెండు. పదుగురు పట్టిన తెరువును తాను పట్టెనేని, ఈతడెంతేని పలుకుబడిని సంపాదించియుండును. ఎట్టిదైనను సొంతయూహనుండి కదలక మెదలక, దానికి పట్టుముగట్టుకెట్టె చింతామణి. తమ నిశ్చితాభిప్రాయములు తమ యవిచలిత చేతనము గావించుకొని పలుకుబడిన నపేక్షింపక, అపయశమునకు జోలి యొడ్డి, అత్యాచారమునకు తలయొగ్గి కర్తవ్యము నెఱపుకొను నాయకులసంఖ్య అల్పము. ఈ నాయకులకుండు స్వతంత్ర బుద్ధిని శైశవమందే చింతామణి తన హృదయమందు పెంచినాడు. తన పరిశీలనాశక్తిని నమ్మియే తన గురాచార్యుడైన జి. సుబ్రహ్మణ్యఅయ్యరు మాటను త్రోసిరాజని "United India" "The Madras Standard"ల సంబంధము త్రెంచుకొని, చెన్నపురి నుండి కదలిపోయి అలహాబాదునం దీతడు తన భావి యున్నతికి పునాదివేసికొనినాడు.

నలుగురు త్రొక్కు తెరువునందే తన గతి మోక్షము లిమిడియున్నదని భావింపక, బలిష్ఠమైన సంప్రదాయమెదుట నిలిచినను బహు సంఖ్యాకుల బలమందిన భావమొండు రాజ్యచక్రము త్రిప్పుచున్నను, దానికి వంగి సలామొనరింపక తన తెన్నున దాను నడచువాడు కావున చింతామణి విశ్వవిద్యాలయ జీవనమున విశ్వాసముంచినాడు కాడు. యూనివర్సిటీ డిగ్రీ శతగోపమునకై గడపై నిలిచినపుడే, పెద్దమూకలు కల యువకుడు 'ఫస్ట్‌క్లాస్' యనుకొను దినములందు, దానిపై చూపెక్కి నిలుపని గట్టిఘటము చింతామణి. రవీంద్ర, బెర్నార్డ్‌షా, వేల్స్, హావెల్సు మున్నగువారు డిగ్రీలనందకయే సాహిత్యవసుంధరయందు సమ్రాట్టులైరి.

పత్రికాప్రపంచమున నిట్టి భారతమహనీయులలో ముఖ్యులు కృష్ణదాస్‌పాల్, మోతీలాల్‌ఘోష్, చింతామణులే. స్వప్రయత్నముకతన నేర్వజాలని దెద్దియు లేదని నమ్మి వీరు విజ్ఞానులైరి.

చిన్నవయసునందే రాజకీయములు చింతామణి దృష్టి నాకర్షించినవి. నౌరోజీ సురేంద్రులును, డబ్లియు. సి. బెనర్జీ, ఫిరోజిషా మెహతా, భూపేంద్రనాథబాసు, రనడే, గోఖలే లీతని కన్నుగుట్టిరి. జాన్సన్ చుట్టు మసలు బోస్‌వెల్ వలె వీరలచుట్టు జిజ్ఞాసువులు చేరెదరు. ౧౯౧౯ లో కలకత్తాలో జరిగిన మాడరేటు రాజకీయవాదుల మహాసభయందు చింతామణి, "చిన్ననాటనుండి సురేంద్రునిపై నాకు గాఢానురాగము కలదు. సురగంభీరములైన ఆతనివాక్కులు వినుటకై ఎందుండియో పర్వెత్తుకొనివచ్చువాడను" అని పలికినాడు. ఆసభయందు సురేంద్రుడుండెను. ఇరువదేండ్ల యువకుడై, చేత గాసులేనితఱి (౧౯౦౦ లో) చింతామణి కాంగ్రెసును, దేశనాయకులను చూచుటకై తెలుగునేలనుండి కదలి లాహో రరిగినాడు. వేడుక జూచుటకై నాడీత డచటి కరిగియుండడు. హృదయమున సలసలగ్రాగు జిజ్ఞాసయే నాడీతనిచే ముందంజలు వేయించినది. వీరపూజకై, మహాపురుషుల సేవకై ఈతని మనసు ఆతురంపడెను. * చింతామణి వీరపూజయే చింతామణిని వీరుని గావించినది.

ఉపాస్యదేవతయందలి గురుగుణములను తనవి గావించుకొనుటకు ఉపాసకుడు కావించు సాధనమే పూజ. సుఖాపేక్ష వ్రతదీక్షకు భంగము దెచ్చును. నట్టింట జతికిలపడి గీతగోవిందములు పాడిన, సాధనము నెరవేరదు. సర్వశక్తులను వినియోగించిన గాని, జిజ్ఞాసువు సాధనము పూర్ణముకాదు. రెక్కలు కట్టుకొనియైన నక్షత్రమండలమట్టు వెలుగొందు ఆశయే సందీప్తశిఖ

* And now if worship even of a star had some meaning in it, how much more might that of a Hero! Worship of a Hero is transcendent admiration of a greatman...... No noble feeling than this of admiration for one higher than himself dwells in the breast of man. It is to this hour, and at all hours, the vivifying influence in man's life"-Vide Thomas Carlyle's "Heroes, Heroworship and the Heroic in History."

వము నందితీరవలెనని ఈతడు కాంక్షించును. జిజ్ఞాసువు నకు వలసిన వాతావరణమును, యాత్రికుడు కాంక్షించు తరుణమును చింతామణి తాను పుట్టిననేలయందు కాంచ లేకపోయెను. ఆంధ్రుల కొక రాష్ట్రములేదు; ఒకమహా నగరములేదు. ఆంధ్రులం దాంధ్రత్వ భావమే లేదు. ఒకని హృదయమున నంకురించిన ప్రజ్ఞాబీజమునకు నీరు వోయు ఆదరము ఆంధ్రపృథ్వియందు నిండుసున్న. కావున నున్నతిగనజూచు యువకు లన్యసీమలకు తరల వలసి వచ్చుచుండెను. తెలుగుమన్నునుండి కదలిపోయి, చింతామణి ముందులకు రాగలిగినాడు.

పత్రికాప్రపంచమున ఆదర్శపూరుషుని కాంచ గోరువారు చింతామణిపై దృష్టి నిబద్ధమొనరింపవలెను. అధునాతన పృథ్వియందు పత్రికచేయు సేవ అత్యద్భుతము. మానవసమస్య లన్నిటి నెదుర్కొని, వసుమతీ వాసులకు దైనికసంబంధము లేర్పఱిచి, ప్రజల సర్వతోముఖాభివృద్ధికై తోడ్పడజాలునది పత్రిక. దీని మూల్యమును పాశ్చాత్యులు గుర్తించినట్లు భారతీయు లింకను గుర్తింపలేదు. పత్రికా కర్తవ్యమందలి ప్రాముఖ్యమును పత్రికాసంస్థాపకులతో జనసామాన్యము కూడ గుర్తించిననాడు పత్రికలు నెగ్గును. బాలకుడైయుండగనే చింతామణి పత్రికానిర్వహణమందలి గభీరోద్దేశమును గుఱుతించి, దానికై తన సర్వశక్తులను ధారవోయవలెనని, తన జీవనమును వినియోగింపవలెనని నిశ్చయించినాడు. చెన్నరాజధానినుండి కదలినగాని తనకు గతిమోక్షములు చిక్కవని గ్రహించి, నటరాజన్ బొంబాయి పోయినట్లు తాను త్రివేణీక్షేత్రమున కరిగినాడు. మాలవ్యా సత్ప్రభృతులు శంఖుస్థాపనమొనరించిన "లీడరు" పత్రికా కార్యాలయమును తన యాటపంచిరిగావించుకొనవలెనని మక్కువపడినాడు.

అన్యరాష్ట్రీయులనిన నులికిపడువారు వంగీయులు కాని సంయుక్తరాష్ట్రవాసులు కారు. యువకుడైన చింతామణిప్రజ్ఞను మహోదారుడైన మాలవ్యా పండితుడు దరనిముషములో గుర్తించినాడు. హృదయకవాటము తెఱిచి స్వాగతమునిచ్చినాడు. తాను చేరిన తావును, *తాను చేపట్టిన పత్రికను హృదయపూర్వకముగ ప్రేమించి చింతామణి సంయుక్తరాష్ట్రీయులకు తలలో నాల్కయైనాడు. †లీడరు పక్షమునందు, లీడరు భవనమందు "లీడరు" పత్రికతో అవినాభావ సంబంధము గల్పించుకొనినాడు. చింతామణి నామధేయము "లీడరు"నకు మాఱుపేరైనది.

"లీడరు" దృక్పథమును గుర్తించితిమేని చింతామణి రాజకీయధోరణి తెలియును. బాలకుడైయుండగ నీతని దృష్టి నాకర్షించినది కాంగ్రెసు. కాంగ్రెసు దిగ్గజము లీతని యారాధ్య దేవతలు. కాని, కాంగ్రెసుపై నీతడు పదంపడి కస్సుబుస్సులు వోసినాడు.

సూరతులో కుర్చీలు విఱిగిననాటనుండి భారత రాజకీయములందు చీలిక లేర్పడెను. ప్రజలు పడు పాట్లను గుర్తించి, వారి నుద్ధరించుటకై కంకణము కట్టుకొనినారు కాంగ్రెసువాదులు. "౧౮౯౮ మొదలు ౧౯౧౮ వఱకు కాంగ్రెసుఛత్రముక్రింద నిలిచితిని. పదంపడి లిబరల్ దళమున జేరితిని. భారతజాతీయత్వ సంస్థాపకుల అడుగుజాడల నంటియే నడచుచున్నాను." అని "Indian Daily Mail" లో తన తొలిసంపాదకీయమందు చింతామణి తెలుపుకొనినాడు. సమయసమయములందలి దేశపరిస్థితుల ననుసరించి స్వరాజ్య సంపాదనావిధానములందు మార్పులు కలుగవలె నను నంశమును చింతామణి గుర్తించినాడు కాడు. ౧౯౪౧

*"I have learnt to love the city of Allahabad with a love that can with difficulty be exceeded by one's love for one's birth-place".—Chintamani.

†"Chintamani had helped us in building up public life in the U. P. during the last twenty years. If Madras has reason to feel proud of him as one born within its territory, we of the U. P. are prouder still in having adopted him as one of ourselves." Vide Sir Tej Bahadur Sapru's Speech delivered in Madras on Oct. 7, 1928. while unveiling the busts of S. Kasturi Ranga Iyengar and G. Subrahmania Iyer.

# కోడైకెనాలు చిత్రములు

(K. M.·R.)



౨. ఉపవనము



౧. ఉపవనము



3. సరోవర ప్రాంతము



౪. పుదుక్కోట మహారాజుగారి వేసవిమేడ

లో బొంబాయిలో కాంగ్రెసు నెలకొనిననాటి పరిస్థితులు రౌలటుబిల్లుల నాడును, పంజాబుహత్యలనాడును లేవు. కాలపరిస్థితు లొకానొక మహాపురుషునకు జన్మ నొసగినవి. గాంధిజీ రాజకీయముల నాధ్యాత్మిక దృష్టితో పరికించినాడు. కలహవాతావరణమునుండి లేవనెత్తి రాజకీయముల నాతడు పూజాపీఠమున నిలిపినాడు. విద్యాధికుల డిబేటింగుసొసైటీయై యుండిన కాంగ్రెసుసంస్థానికి సామాన్యప్రజల నాహ్వానించి, వారికి స్వాతంత్ర్య మంత్రము నుపదేశించినాడు. భారతీయుల కనులను నూతనాలోకముతో నింపినాడు.* దౌర్జన్యభూయిష్ఠ విధానమునకు భారతసీమయందు చోటులేదు. గాంధిజీ యుద్యమము ఇంచుమించుగ నెగ్గినదని నాటి బొంబాయిగవర్నరు పలికెను. ఆపత్కాలమున దేశనాయకులందఱు ఒకేజెండాదరిచేరి యుండినచో స్వరాజ్యము ౧౯౨౦ లోనే భారతీయుల చేకూలబడెడిది. నాయకులందే పొరపొచ్చెములు పొడసూపినవి. పెద్దలు పెనగులాడుచుండ పిన్నలును, సామాన్యప్రజలును సంఘీభావము నారాధింతురా? "నీ బిడ్డలందు సంఘీభావ ముండదు అని భారతమాత నొసలున జగదీశుడు వ్రాసియుండు" నని ద్విజేంద్రుడు తెలిపినాడు. (Vide: D. L. Roy's "Downfall of Mewar") ద్విజకవినుడువులందు అగ్నికణములవోలు సత్య మున్నది. ఈయగ్నికణము చల్లారినగాని భారతసీమ సముద్ధరణమును కనజాలదు. భారతీయులందు తోచిన మనస్పర్థలు అన్యదేశీయులందు ఎత్తిపొడుపులను, ప్రతికూల విమర్శనలను రేకెత్తించినవి. భారతవాసులు జాతీయత్వమునే యెఱుగరని వీ రందురు.† చింతామణివంటి వ్యక్తి కాంగ్రెసు ఉద్యమమున కెదురు తిరుగుట దేశదౌర్భాగ్యము. తన్ను కేల యని ఈతడు దూరకొనినను బాగుండెడిది. చట్టున లేచినాడు. నిర్బంధ విధానమునకు 'భళాభళి' యనినాడు. నాటిపని ఈతని జీవనమున నల్లమచ్చయైనదని నొక్కి చెప్పవలెను. తాను తలచినదే నిజమని నమ్ముట ఈతని సహజలక్షణ మంటిని కదా! తన మనసునకు నచ్చనిపంతయు నూతని ఘోష యని యెంచి, ఎదుట నిలిచిన దిట్టలెవ్వరైనను, అడలు లేక, అపయశము తలపైబడునని యోచింపక కుండబ్రద్దలు కొట్టినట్లు తాను చెప్పదలచినదానిని చింతామణి చెప్పితీఱును; ‡ చేయదలచినదానిని చేసితీఱును. కాంగ్రెసు

* "Gandhiji has created a new epoch in human history. By his invincible life force, he has awakened the country into a deeper endeavour to realise its destiny. He it was who instilled fresh vigour into our slumbering countrymen and opened to them the vision of a glorious future of India" Rabindranath Tagore.

† "India is a welter of antagonisms, social religious and political. The vast mass of its people are illiterates, some of them regarded by others, under the caste system as something almost less than human. It therefore lacks the essential elements which go to compose a nation state."

Vide: pages 303 and 304 "Modern Political Constitutions" By C.F. Strong, M.A., R.D.

‡ ఒకదృష్టాంతము: రమారమి పదేండ్లకుమున్ను కలకత్తాలో సర్ మోరోపంత్ జోషీ అధ్యక్షతక్రింద అఖిలభారత లిబరల్ దళమహాసభ జరిగినది. సభ ముగిసిన మర్నాడు ఆల్బర్టుహాలులో బిపిన్ చంద్రపాల్ అధ్యక్షత నొక మహాసభ జరిగినది. సప్రూ, జోషీ, చింతామణులు ప్రధాన వక్తలు. ఎమటి వంగీయుల ప్రకృతి నెఱిగిన సప్రూ, జోషీ లేమేమో చెప్పి చల్లగ నవ్వలికి దాటిరి. జంకుగొంకులేక చింతామణి మోతీలాలుప్రభృతులపై తూపులు వదలినాడు! సభయం దల్లరి లేచెను. మాటలాడుటకు చింతామణికి సాధ్యముకాలేదు. హాలులోని అల్లరిని దిగమ్రింగ సింహనాద మొనరించి బిపిన్‌పాల్ 'క్షమింపు' మని అతిథిని వేడుకొనినాడు.

వాదులను వివిధరంగస్థలములనుండి ఈత డెదుర్కొని నాడు.

ఇట్లనిన చింతామణి అనవరతము పాలకులపెన్క 'డిన్విడివ్విటు'ము వాయించు నని మనము తలపరాదు. **Constitutional Agitation** చుట్టు జయమంగళము పాడువాడైనను, సహజముగ భయరహితు డగుసు రాజ్యాంగవిధానములందు లోపము గోచరించినపుడు తీవ్రవాదివలెనే కంఠమెత్తి 'ఇది తప్పని' ఇతడు పలుకును. వీరు తనవారు, వారు తనవారు కా రనుభావ మీతనికి లేదు. చేటుమూడునని చెడుమాట వదలుటకు సంశయింపని చింతామణి మేలుచేకురునని మంచిమాట నుచ్చరింపడు. ఒకరిదూషణ కీత డెట్లు విలువగట్టలేడో ఒకరి భూషణకుగూడ నీతడు విలువగట్టలేగు. మీద తాలుపడునని జంకని యీవ్యక్తి పూవులు పడవలెనని యెన్నడును అపేక్షింపలేదు. ప్రజలును, ప్రభువులును కారుకదా దేవతలు దిగివచ్చినను వారిని గురించిన తన అనుకూలప్రతికూలభావములను తూచా తప్పక ఈతడు వెడలగ్రక్కివేయును. "నాపాదములు పట్టుము; లేకున్న ముక్కుపిండెద"నని ముక్కురు డొక డీతని నిర్బంధించినచో, నడుముగట్టి వాని కీతడు పిడిగ్రుద్దు సమర్పించును. "నీ యభిప్రాయమును మున్నీట గలుపుము. ఇదిగో కనకపల్లేరమున స్వర్గమును నీకు వాయనముగ నప్పనమొనరించుచుంటి"నని దేవేంద్రుడు డెదుటనిలిచి వచో, సర్లేము నీతడు పడదన్ని తీలును! పేరున్నై, డబ్బున్నై చక్కని యోగ్యులువేరయు లౌకికులకును చింతామణికిని కనుచూపులు లేవు. ఇతడు కాంగ్రెసులో ప్రవేశించలేదని దుఃఖింతునుగాని, సొంతదళమండలి కొందఱి దేవయ్యలవలె, జస్టిసుపార్టీ మున్నగు యితర దళములందలి పల్వురు ఓబయ్యలవలె పెద్దయుద్యోగములకొఱకును, గొప్పబిరుదులకొఱకును ప్రాకులాడని ధీరుడని సంతసింతును. సైమనుసప్తబుషుల కీతడు నివాళు లెత్తలేదు; ఇక దేశమం దావిర్భవింపనున్న రాజ్యాంగములందు భారతాశయము మిలమిల మెఱయుచున్నదని తెయ్యిమని గంతువేయలేదు. ఇతడు తలచున దొకటి, చెప్పున దింకొకటి, చేయునది వేఱొకటి కాదు. ఇట్టివ్యక్తినే కార్లయిల్ "Sincere man" అనినాడు. ఇట్లని ఈవ్యక్తియే యెఱుగడు. ("Great Man's sincerity is of the kind he cannot speak of is not conscious of") ఈసుగుణము వీరపురుషోచితమని ఆమహనీయుడు పలికినాడు. ("I should say sincerity, a deep great genuine sincerity, is the first characteristic of all men in any way heroic." Vide: chapter on "The hero as prophet", Carlyles famous book "Heroes and Hero-worship") చింతామణి సంయమికాడు; మహాత్ముడుకాడు. కాని యీతడు వీరుడని చెప్పకతప్పదు. అభిప్రాయభేదములున్నవని, ఒకప్పుడు కొంతలోపము జూపినాడని (లోపము లేని మానవుడేడి?) కొరడా చేబట్టను; మఱి ప్రత్యక్షమైన గొప్పగోనములకు చేతులు జోడింతును.

చింతామణి రాజకీయములనే నమ్ముకొని తన మనసు నంతయు వాని కప్పనమొనరించినాడు. ప్రపంచ రాజకీయ విధానములను చక్కగ పరిశీలించినాడు. పార్లమెంటు ప్రభుత్వము విజృంభించిన నాటగోలె ఆంగ్లపృథ్వియందు గోచిన ఫాక్స్, బర్కు, ఫాక్సు, షెరిడన్, డిశ్రేలీ, గ్లేడ్‌స్టను ప్రభృతి మహావక్తల ఉపన్యాసములను కంఠస్థము గావించుకొనినాడు. నాగోజీ, ట్యాగ్బి, మోహాతా, జేనన్జీ మున్నగువారి నుడువులను మెదడునం దిముడ్చుకొనినాడు. మిలన్ గ్రంథముల నన్నిటిని దిగమ్రింగిన మెకాలే, ఆగ్రంథములన్నియు అస్పృశ్యమైనను, తాను వానిని గ్రక్కగలననినాడు. గ్లేడ్‌స్టను హోమరు 'ఇలియడ్' ను అప్పజెప్పువాడు. దివంగతులైన ఆంగ్ల రాజకీయవేత్తల పల్కులను సంతచెప్పులీల చింతామణి యుచ్చరింపగలడు. ఈతని జ్ఞాపకశక్తి అద్భుతమైనది. దేశసేవయందు ప్రాతకాపులైన పండితులకుకూడ రాజకీయములందు చింతామణి నిఘంటువై యుండును. లేఖారచనమందును, పత్రికారచనమందును, సభాస్థలియందును, మద్దిమేకకమిటీ మున్నగు సమితులందును, శాసనసభలందును ఈతని పాండితి విజృంభించినది,

మనజునకు శక్తినిచ్చునది జ్ఞానము. ఇది నిశిత శాస్త్రీయ కమువంటిది. ప్రతికూలవాసనల నిది తునియలుచేసి వేయును. ఇట్లని చింతామణి పలుమాఱు నిజజీవనమున నిరూపింపగలిగినాడు.

లిబరల్ దళమం దీతని మించిన రాజకీయ విజ్ఞాని లేడు. సాహిత్యపరిజ్ఞానమున రామస్వామి అయ్యరు, శ్రీనివాసశాస్త్రి లీతని మించినారు. రాజకీయ అర్థశాస్త్రములను ఈతనివలె నే యయ్యరులును పిడికిటబట్టలేదు. శాస్త్రి శాస్త్రవేత్త కాక సౌందర్యపిపాసువగును, కళోపాసకుడగును శ్రోతలపై సమ్మోహనాస్త్రము ప్రయోగించును. జటిలమైన అర్థశాస్త్రసమస్య నెదుట నిడితిమేని దానిని మార్కొనుటకు మాఱు శాస్త్రి చక్కని భాషాజాతీయములను దంచగ గ్రుచ్చి మనమనసుల కర్పించును! కళలను, శాస్త్రములనుగూడ తమవి కావించుకొనిన వ్యక్తులు మనుజులం దరుదు. కళాకామి కఠినపఠనము నోర్వడు. మెదడుచే నేవస్తువునైన దంచి, మఱి పరిగ్రహింపడు. ముచ్చెమట లీతనికి గిట్టవు. కులుకుచు, నాడుచు, పాడుచు సుందరభావకేదారమున నీత డేంచ్లను, పూంచ్లను (అట్లని మెలుగక) కదపును. నడుము వంచి, మనసుచే మర్దించినగాని శాస్త్రాంశములు లొంగవు. ఈపనికి గట్టిమెదడును, పెద్ద ఓపికయును అవసరములు. వీనినిగల చింతామణి శాస్త్రవేత్త యైనాడు. ఈతనిదాపల నిలువగల రెండవ లిబరల్ పక్షీయుడు మోచర్లపంతులు.

అనిబెసంటు, పాల్, తిలకు మున్నగువారు రాజకీయములందు విశేషప్రజ్ఞ చూపినను, వానియందే మునిగియుండలేదు. తాత్త్విక సారస్వత పరిజ్ఞానమున నాఱితేఱి, దానికతన జగద్విఖ్యాతి గాంచిరి. తిలకు విజ్ఞానము మేక్స్ములరాది మహాపండితుల జోహారులందినది. ఈతనికి చిరకీర్తి నిచ్చున దీతని గీతాభాష్యమని గాంధీజీ పలికెను. పాశ్చాత్య నాగరకతపట్ల విశేషాదరము జూపిన చింతామణి ప్రాచీవిజ్ఞానమునకై; మాతృభాషాసేవకై పాటుపడినాడుకాడు. పిన్నవయసున నీతడు అలహాబాదునకు కాక, ఏకలకత్తాకో తరలియుండినచో, నేడు తీవ్రరాజకీయవాదియై, స్వీయసీమ విజ్ఞానమునకై రేబవళ్లు తపించియుండువాడు. స్థలశక్తి మనుష్యశక్తికి తన రూపాసగితీలును.

ప్రాచీనవిజ్ఞానమునకై పాటుపడకపోయినను, దానియెడల నీతడు ద్వేషభావమును చూపలేదు. భారత సంప్రదాయమునెడల ద్వేషభావము చూపలేదు. కావున నీతని దోషభావము సోకలేదు.

కేవల రాజకీయపరిజ్ఞానము మనుష్యవాక్కునకు మహత్త్వగభీరత్వముల నొసగదు. భారత విజ్ఞానమునెడల ఱోతగలిగి, రాజకీయములను గుఱించి పెద్ద కబురులు చెప్పువ్యక్తి, గభీరార్థభూయిష్ఠములైన హిందూ శుభకార్యముల నింగ్లీషుమంత్రములతో జేయించు అధునిక విప్రునివంటివాడు. మాతృప్రేమ మాతృవిజ్ఞానమందు వ్యక్తపడును. భజగోవిందముల నాంగ్లమున బాడు భారతీయుడు దేశభక్తుడుకాడు, — మఱి దేశభ్రష్టుడు. వందేమాతర గీతమును హూణభాషయం దాలాపించు వ్యక్తి దొంగదేశభక్తుడు. భారతరాజకీయములను భారతదృష్టియందే చూడవలెననిన, వానియందు భారతభావమును నింపవలెను. ఈభావములేని రాజకీయములం దితరసరుకు ఎంతేని యుండవచ్చును; కాని దేశభక్తి వానియందు బండిసున్న. ఇట్టి రాజకీయములు చర్చలకును, ఉపన్యాసములకును, చప్పట్లకును పనికివచ్చును. వీని నుచ్చరించు విద్వాంసులు మోళీగట్టుగడసరులు కాని, తల్లికై తనువుకోసియీయగల మహనీయులు కారు. స్వీయసీమవిజ్ఞానమునెడల భక్తి స్వీయసీమభక్తికి గుర్తు. విజ్ఞానపిపాసువులమై అన్యదేశములనుండి జాలువారు నూతనభావధారను గ్రోలవలయును గాని, స్వీయదేశవిజ్ఞానమునకు మనము దిగదుడుపనరాదు. ఇట్లుంటిమేని, మనము నిజమైన దేశభక్తులము కామనియు, పూలమాలలకై, పెద్దపేరుకై నాటకమాడు,నీతిబాహ్యుల మనియు నొక్కి చెప్పెదను. రాజకీయములందు మసలు పెక్కురు భారతీయులు (వీ రేయే రాజకీయపక్షములకు చెందినవా రైననేమి) వేషభాషలందు పాశ్చాత్యుల ననుకరించుచున్నారు. స్వదేశ వస్తువులపై

వీరికి మక్కువలేదు. "ఖద్దరులో మాకు బిలీఫ్ లే" దని వీ రందురు. మాతృభాష నేవగించి, ఇష్టదైవత మని అన్యభాషనే వీరు పూజింతురు. భారతభావము భారత వస్తువునందును, భారతవాక్కునందును జాలువారును. పరిమళము జన్మస్థలమైన పుష్పమధ్యమునుండి వెడలి పూరేకులనుండి అవ్వలికి పయనమగును. ఇనుపరేకులతో బూవుచేసి, దానికి చక్కని రంగుపూసి, యెప్పుడైన నందు సుగంధము సుహ్వానింపగలమా? సహజభావ వ్యక్తీకరణమునకు సహజమార్గమే సరియైనది కాని పెర దారి కాదు; మెఱపుపూతనందిన మరే అన్య వ్యవస్థ యును కాదు. ప్రతీచీ ఆచారములకు దాసులైన వ్యక్తుల హృదయములనుండి దేశభక్తిసౌరభ మెట్లు వెడలును? సంస్కరణాభిలాషియైన చింతామణి, భారతసంఘము లందలి చెడుగులను గునుమాడనెంచు చింతామణి ఇట్టి మృషాదేశభక్తులను ముందుగ క్రమమార్గమున నిలుప శక్తివంచన లేక యత్నింపవలెను. భారతవిజ్ఞానమునెడల వీరికిగల ద్వేషభావమును మాపుచేసినవాడు ఈతని యత్నము ఫలించును. ఈ మహత్తరకర్మమును నెఱపవలె ననిన చింతామణి ప్రాచీవిజ్ఞానరత్నాకరమున మునుగీత నీది అందలి అద్భుతభావ విభూతిని తనవశ మొనరించుకొనవలెను.

చింతామణి చక్కని వక్త. తాను నమ్మినవి, తాను చెప్పునది *నిజమని యెంచినదే ఈతడు మాటలాడును. కావున నీతనివాక్కులు శక్తిసమన్వితములై యుండును. పైకమునకై పాడుకేసును చేతబట్టిన న్యాయవాది పెద్ద చప్పుడు చేయవచ్చును; దీర్ఘముగ సలుపవచ్చును; కాని తాను వ్యక్తీకరించుభావమున తనకు విశ్వాసములేని వ్యక్తి యగుచు ఓటిమాటలనే ఈత డుచ్చరింపగలడు. వక్తకు కావలసిన ప్రధానలక్షణము ఆత్మభావవిశ్వాసము. చింతామణి కిట్టి విశ్వాసము కలదని చదువరు లెఱుగుదురు.

ఆంగ్లభాషను స్వాధీన మొనరించుకొనిన దిట్ట చింతామణి. కాని కళోపాసకున కుండవలయు దివ్య సామగ్రి యీతనియందు లేదు. ఈతనివాక్కులం దద్భుతపాండిత్య ముండును; కాని యివి సౌందర్య మాధుర్యములతో తొలుకాడవు. ఈతని పల్కులు లలితములుకావు; కుసుమపేశలస్పర్శములు కావు. అవి యబ్బురమును కొలుపును గాని మేనబులకల బుట్టింపవు. సత్యమూర్తికిగల తీవ్రభావముగాని, రామస్వామి అయ్యరునకు గల చుఱుకుపాలుగాని, మాలవ్యాపండితునకు గల వేగముగాని, శాస్త్రికిగల కౌశలముగాని ఈతని యుపన్యాసమున గానము. శివస్వామి అయ్యరువలె క్షీణస్వరమున నీతడు మాట లుచ్ఛరింపడు. కాని, యీతడు గురుగంభీరస్వరముగల వక్తకాడు. ఈతని వాక్కులు కోడెత్రాచులట్లు బుసకొట్టుచు నెగురవు. అవి కొండచిలువలవలె బలిష్ఠములై నిడుపులై యుండును. గత శతాబ్దాంత వక్తలసోరణి నీతడు కొంత యలవరచి కొనినాడు. చింతామణియందు భావదార్ఢ్యము కలదు కాని భావనావేశము లేదు. కావున నీతడు సామాన్య ప్రజల నాకర్షింపగల వక్తకాడు. పండితులకు పాత్రములుచెప్పి, పండితుల మన్ననల నందగల వక్తయనుట నిస్సంశయము.

ఈతని వక్తృత్వశక్తికి రచనాశక్తి తులతూగును. "లీడరు" పత్రికయం దీతని సంపాదకీయము లీతనికలము సత్తువను సర్వజగతికి దెలుపజేసెను. మోమోటములేక, అడలులేక ఈతడు భావమును వ్యక్తీకరించును కావున, నీతనిశైలి యందు వాడి కలిగియుండును. కాని వంగీయులవలె నీత డాత్మసంవరణమును పోనాడువాడు కాడు కావున వారివలె వేడిమి గ్రక్కడు. పత్రికా ప్రపంచమున నీతనివలెనే కీర్తినందిన మోతీలాల్ ఘోష్ తనకలముచే చింతనిప్పులు గ్రక్కించువాడు. శ్యామ సుందరచక్రవర్తి ఒకపరి క్రోధస్ఫులింగములు చల్లి,

* "Language becomes accurate if the speaker desires to be true; clear if he speaks with sympathy and a desire to be intelligible; powerful if he has earnestness and pleasant if he has sense of rhythm and order".—Ruskin.

వేఱొకపటి శోకధారలను వెలారించువాడు. మహా యోధుడు రణరంగమున తురగము నడాయించునట్లు అరవిందుడు తన కలమును ఛంగుఛంగున దుమికించువాడు. కుతకుతలాడు మనసే వేంప్రమును వెడల గ్రక్కును. క్రోధము భాషాసురిని వేగవంత మొనరించు నని మెకాలే పలికినాడు. మితవాదియైన చింతామణి మితిమీఱిన తీవ్రభావము సభిలషింపడు. కావున నీతని శైలికిని తీవ్రవాదులైన వంగప్రముఖుల శైలికిని పోలిక కుదురలేదు. నటరాజన్, రామానంద ఛటర్జీ, కస్తూరి రంగఅయ్యంగారు మున్నగు ప్రధాన పత్రికా రచయితల దాపల చింతామణికి చోటున్నది.

ఉత్తరహిందూస్థానమున వాసమేర్పఱచుకొనిన చింతామణి అనుక్షణము అడలును, ఆరాటమును బుట్టించు హిందూముసల్మానుసమస్యపై ఆసుగంపు మాద్యాలను నిగిడించినాడు. గంగాయమునలట్లు హిందూముసల్మానులు *కలిసిననాడు భారత రాజకీయములందు పవిత్రక్షేత్ర మేర్పడునని ఈతని విశ్వాసము. 'ప్రత్యేక జాతికి ప్రత్యేక లాభము'లనువాదన ఈతనికి రుచింపదు. మోచర్ల పంతులువలె స్వతంత్రరాష్ట్ర ప్రజలహక్కులకై కొంతకాల మీతడు శ్రమించినాడు.

చింతామణి రాజకీయములందు తలపండించుకొనినాడు. తనప్రజ్ఞకు తగిన సేవ చేయవలెననిన, నీతడు తనమణికట్టునకు బిగువైన కంకణమును కట్టుకొనవలెను; నిరుపేదలును, నిరుద్యోగులును, నిర్భాగ్యులును పలువు దీనారవములకు (చెవిటివాడైనను) చెవియొగ్గవలెను. పేదరికమున పెరిగిన అదృష్టవంతుడు కావున, కష్టపరంపరలను కాంచిన భాగ్యశాలి కావున, దేశాటన మొనరించి కడుకౌశలమున నొకయంశ యేర్పఱచుకొని నిజ జీవన కుట్టిమమును ఇటుకయిటుకచొప్పున కట్టుకొనిన దిట్ట కావున, క్రమనిష్ఠ కఠినదీక్షాది గురుగుణముల నలవఱచికొనిన జెట్టి కావున స్వీయసీమపురోభివృద్ధికై యీతడిక కర్మవీరుడు కావలెను. కర్మవీరుడు కాజాలని భారతీయున కిక రాజకీయములందు చోటుండదని ఈతడు గుర్తింపవలెను. మితవాదియై వేడుకచూచుచు, శాస్త్రివలె నొకమాఱు కాంగ్రెసుమీదను, వేఱొకమాఱు ప్రభుత్వముమీదను తూపులు వదలినంతన, ఉపన్యాసములను కురిపించినంతన, రచనా పరంపరలను పృథ్విపై చెరిగిపోసినంతన, నీతని కర్తవ్యము చెల్లిపోదు. కృషికులకును, కూలీలకును దూరమై, క్రియారంగణమున లంఘింపని రాజకీయవాదిని కన్నెత్తి చూచుటకు నేడే భారతీయుడును ఇచ్ఛగింపడు. రమారమి ముప్పదేండ్లనుండి సన్నాయిపాడుచున్నారు కాని మితవాదులును, కాంగ్రెసున జేరని ఇతర రాజకీయవాదులును దేశార్థమై ఎట్టిత్యాగమును సలుపలేదు. సరికదా

* "I am free to confess, ladies and gentlemen, that a smile, at once incredulous and irreverent, is forced to the lips when one hears solemn asseverations of complete British disinterestedness in the treatment of India's communal problem. Mr. Gokhale once said to me: 'He makes a mistake who: thinks that India's political struggle is a duel between the British and Indians. If is more of a triangular fight among the British, Hindus and Muslims? He added that Euclid's proposition was not less true in politics than in geometry, that any two sides of a triangle are greater than the third. The natural thing would be for Hindus and Muslims, to make common cause in the service of their Common Motherland. Unfortunately this has not always happened. I will not pause to attempt an apportionment of blame for the regrettable result" Vide Chintamani's Presidential Address delivered at the All India Anti communal Award Conference held at Delhi on 24 th February 1935.

వీరిలో పల్వురు స్వార్థపరులై, పరోక్షమున ప్రతిపక్షులై మెలగిరి. వీరియెడల జనసామాన్యమున కావగింజంత విశ్వాసము లేదని ఇటీవల జరిగిన ఎన్నికలే నొక్కి చెప్పినవి. వీరియందు సంపూర్ణ ఆంతరంగిక పరివర్తనము * కలిగినపుడు భేదభావములు, వానితో దేశదౌర్భాగ్యమును అంతరించును. రాజకీయములందు దౌర్జన్యరహితమైన ఏవిధానము నవలంబించినను సరే, నిక్కపుసేవను దృష్టినిడికొని, పరార్థజీవనమును పరమాశయము గావించుకొని, సత్వరభారత పునరుద్ధరణమును ప్రత్యేకకర్తవ్య మొనరించుకొని నాయకులందఱు జాతీయపతాకముచెంత నిలిచిరేని, మహాత్మునకెంతేని సత్తువ నీయగలరు; ఉద్దేశసిద్ధిని కనుల జూడగలరు.

ఈ యుత్కృష్ట ధర్మమును నిర్వహించుటకు ముందంజవేసిననాడు చింతామణి దేశభక్తచింతామణి యనిపించుకొనును.

---

* దీనినే తాత్త్వికులు "Inward Renewal" అందురు.



నూఁడవేత K. P. S.

# ప్రాఁత బండి

మండపాక పార్వతీశ్వరశాస్త్రి

వరుస సంఖ్య 029
తేది 21-10-86

3

పాఁతబండిని నేను;..............
పనిపాట్లు లేవు—
పల్లెటూరను జేరి పడియుంటి మూల;
పగలెల్ల నాతోడఁ బలుక రెవ్వారు;
ఏకాంతసేవలో నింపుమై నుందు.

బడికిఁ బోనొల్లని బాలురు కొంద
ఱపుడప్పు ననుఁజేరి యాటాడుకొంద్రు;
తమపనుల్ దీర్చి, సంధ్యాకాలమందుఁ
బెద్దలు నాచుట్టు విడియుచుండెదరు,
ప్రాఁతముచ్చటలను బలుకుచునుంద్రు;

*   *   *

ననుఁజూచి కొందఱు నవ్వుచునుంద్రు;
కొందఱు ననుఁజూచి సందడించెదరు;
వెడవెడచూపుల, వెక్కిరింతలను,
పరియాచకంబులఁ బలుకరింతలను,
కాలంబు కొందఱు గడపుచునుంద్రు;
జాలితో నాయూసు లాలించుచుండి,
యొకఁడొక్కఁ డెవ్వఁడో యొక్కొక్కవేళఁ
బ్రీతితోడ సహానుభూతిని జూపు.

దినము లీరీతిగాఁ జనియె నెన్నెన్నొ,
ఎన్ని యేండ్లయ్యెనో యెఱుఁగను నేను;
పడియుంటి నీరీతిఁ బల్లెలోపలను.

*   *   *
*   *   *

నడుసంజ దాఁటెు; నెండ యలంచుచుండె;
వెచ్చనిగాలులు వీఁచుచునుండె;
పనులలోఁ బెద్దలు పడి మున్గుచుంద్రి;
బదులలోఁ బిన్నలు పడి తేలుచుంద్రి;
పనిలేక, బడిలేక, పడి యువకు లుంద్రి;
స్త్రీ లింట మునుఁగుచుఁ దేలుచునుంద్రి;
కానుగునీడ నేకాంతమం దేను
మునుఁగక, తేలక, కునుకుచునుంటి,
కునుకుచునుంటిని; కునుకుచునుంటి—

*   *   *

త్రుళ్లిమేల్కాంటిని—...........
...............త్రోపుఁబాటయ్యె;
డబ్బాల డబడబల్ తబ్బిబ్బులాడె;
బాజాల బడబడల్ బేజారులొందె;
పెద్దల గుసగుసల్ పెనఁగుచునుండె;
పిన్నల రొనరొనల్ విరియుచునుండె;
యువకుల వినవిసల్ కవియుచునుండె;
గుసగుసల్ రొనరొనల్ వినవిసల్ గలిసి,
కునుకు నా కదరిపాటును గల్గఁజేసె.

*   *   *

అదరితి-మేల్కాంటి-నలుకుడు వింటి—
అమ్మోరిసంబరం బనుకొంటిఁ దొలుత;
జయజయశబ్దాలు రయమున వచ్చె;
పెద్దలు, యువకులు, పిన్నలు, స్త్రీలు
కూడివచ్చుచునుంద్రి గుంపుగుంపులుగ.

రంగుల జెండాల సింగార మొప్ప,
వన్నెవన్నెల బండి వచ్చుచునుండె;
బండిపైఁ గూర్చుండె బండినాయుండు;
బండి సమీపించె; బండి నిల్చుండె;
బండిని దిగినాఁడు బండినాయుండు;

* * *

నెత్తిపైఁ బాపట నీటుగా నుండ;
మెడను బంగరుగొల్సు మెలికలు దిరిగె;
నడుమను మొదలయి, యెడఁదను దాఁటి;
నెమ్మేనిపైఁ బైఁట యెమ్మెలు గ్రమ్మె;
ఆదివ్యవిగ్రహం బటు చూచి చూచి,
యాఁడుదో మగవాఁడొ యనుకొనుచుంటి;
వక్షస్థలాన స్త్రీత్వము తోఁపలేదు;
మీసకట్టుదయాన గీసినట్లుండె;
పగటివేస మటంచు భ్రమగొనుచుంటి;
పగటివేసము కాదు; పరంతియుఁ గాదు;
ఒయ్యార మొలికించు నొకక్రొత్తవేస
మిదియంచుఁ దలపోసి, యదె చూచుచుంటి;

* * *

బుగ్గను వ్రేలిడి, పూని నవ్వ జూచి;
ప్రాఁతబండో యంచుఁ బరిహాసమాడి,
యావేస మొకసారి యదలిం నన్ను,

* * *

గీసిన మీసాలు, వేసిన పైఁట,
తీసిన పాపట, మూసిన గుండె,
పోసిన గుండాలు పోలుపారఁ జూచి,
తన్మయంబైన చిత్తము తత్తరింపఁ,
జూచుచునుంటిని; చూచుచునుంటి;
చూచిచూచి, ముదానఁ జొక్కుచునుంటి;

* * *

వినవచ్చె నీరీతి వింతవింతగను.

* *

"క్రొత్తబం డిదె వచ్చె;—క్రొత్తనాయుండు
క్రొత్తరీతులఁ దోలు కొలఁదులఁ దీర్చె;
ప్రాఁతబండ్లను మూలఁ బడవైతు మింక;
ప్రాఁతబాటలు మాకుఁ బనికిరా వింక;
ప్రాఁతవారలు మాకుఁ బనికిరా రింక."—

* * *

* * *

కానుగుక్రింద నొక్కట నున్న నన్ను
దూరాన నొకమూలఁ ద్రోసిరా జనిరి.
స్త్రీలును బురుషులుఁ జేరి రమ్యోకను;
పెద్దలు కూర్చుండ్రి పిన్నలంగూడి.
కొందఱు నాచుట్టు గుమికూడియుండ్రి;
నానీడ యాఁతగా నను జేరియుండ్రి;

* . * *

సభసాగె;—పద్యాలు చదివించినారు;
వ్యాసాల వేసాలు, మీసాలు నులిపి,
రోసాలతోఁ జేసి రీసులు మీర.

క్రొత్తనాయుఁడు నిల్చి, క్రొత్తపోకడలఁ
దలఁద్రిప్పి, త్రిప్పి, క్రొత్తదనంబు మీరఁ
గ్రొత్తమాటలఁ బల్కి క్రొత్తలం గొల్పె.

* * *

"ప్రాఁతరస్తా లింకఁ బనికిరా విపుడు;
ప్రాఁతరోజులు పోయె; ప్రాఁత రోఁతయ్యె.
ప్రాఁతవారలు మూలఁబడియుండవలయు;
క్రొత్తలోపల రుచి, క్రొత్తయే రసము;
క్రొత్తలోపల వింత, క్రొత్తయేః సొగసు;

క్రొత్తలోపలఁ గ్రొత్త, క్రొత్తయే క్రొత్త;
లోకములోఁ గ్రొత్త; లోకమే క్రొత్త;
రాసిక్యమే క్రొత్త; రమణియే క్రొత్త;
క్రొత్తనాయుఁడ నేను; క్రొత్త నాబండి;
రంగులు చూడండి, రాణ చూడండి;
మాపస చూడండి, మనసు నిల్పండి;
మము గౌరవించండి; మాటాడకండి.

అనుచు నిమ్మాయి నుపన్యాసం బాసంగ,
సెబాసటంచును జెప్పె నొక్కండు;
వహ్వారే యని యాడి పాడె నొక్కండు;
బ్రేవోయని నుతించెఁ బ్రీతి నొక్కండు,
బళిబళీయని నుతుల్ పలికె నొక్కండు;
బళిబళి, బ్రేవు, వహ్వారె, సెబాసంచు
నలుగెలంకులనుండి వెలయఁగాసాగె.

ముసలివాఁ డొక్కండు ముసిముసినవ్వి,
నిలిచి యీరీతిగాఁ బలుకఁబోడంగె.
"క్రొత్తధోరణి నీది, క్రొత్తనాయుండ,
నీక్రొత్తలోఁ గ్రొత్త నేరుపు కలదు;
క్రొత్తలోపల నొక్క రుచి యున్నదంచు
నీ విందుఁ గ్రొత్తగా నేల చెప్పంగ?
క్రొత్తావకాయలో రుచి కలదంచు
లోకం బెఱుంగదే, నీ కేలఁ జెప్ప?
ఊరనికాయలో నొకరుచి యొప్పు;
ఊరియూరనికాయ నొకరుచి యొప్పు;
ఊరినకాయలో నున్నట్టి రుచియు,
నూరనికాయలో నొప్పారఁగలదె?
ఊరనికాయ నోరూరఁగాఁ జేయు;
ఊరియూరనికాయ యూఁట లూరించు;
ఊరినకాయలో నున్నట్టి రుచిని
తమినీర నెఱిఁగిన తత్త్వజ్ఞుఁ డెవఁడు
ఊరనికాయపై నుత్సాహ మెందు?
ఊరియూరనికాయ కువ్విళులూరు?
ఊరియూరనికాయ, యూరనికాయ,
యప్పటికప్పుడే యానందమిచ్చు,
నది శాశ్వతంబౌనె? అదియు లక్ష్యంబె?
మూఁడుకాలములందు ముచ్చటల్ దీర్చు
రుచులిచ్చి, నిత్యంబు క్రొత్తగాఁ దోఁచు
ప్రాఁతావకాయయే ప్రీతికావించు
నది యింట నిల్పుకోనగుఁగాదె మనకు?
ఇది లోక మెఱుఁగదే? యేల నీ క్రొత్త?
క్రొత్తక్రొత్తని యేల తత్తరిల్లెదవు?
ఎన్నేళ్లనుండియో యెఱుఁగుదు నిన్ను
నీచేతలోఁ గ్రొత్త నేఁ జూడలేదు.

ప్రాఁతరంగులు గీసి, బాగుగాఁ దోమి,
క్రొత్తరంగులు పూసికొన్న మాత్రాన,
ప్రాఁతబండియుఁ గ్రొత్తబండి కాఁగలదె?
ప్రాఁతలోపలఁ బటుత్వంబు చెన్నారు;
క్రొత్తలోపల నొప్పుఁ గోమలత్వంబు;
పటుతయుఁ గోమలత్వంబును గదిసి
కవగూడియున్న, మార్గము దేసిఁగూడి
యున్నట్టు చిత్తంబు నూరింపకున్నె?
క్రొత్తక్రొత్తగ నుండి కొమరొందవలయు;
ప్రాఁతప్రాఁతగనుండి భాసిల్లవలయు;
ప్రాఁతపై లక్ష్యగౌరవము లొప్పారఁ
గ్రొత్తవారలు పనుల్ క్రొత్తగాఁ జేయఁ
గ్రొత్తలోపలఁ బ్రాఁత రూపించుచుండు;
ప్రాఁతలోపలఁ గ్రొత్తరీతి కన్పట్టు;

ప్రాతక్రొత్తలపసల్ రాణించుచుండు;
ప్రాఁతేమి, క్రొత్తేమి? ప్రాఁతక్రొత్తేమి?
యానందమొసఁగూర్చునదియె యాబండి;
ఆనందమొసఁగూర్చునదియె యాఁ ద్రోవ—
నీదువైఖరి యింక నిలుపు మోయయ్య;
క్రొత్తలత్యంబులు, క్రొత్తపోకడలు,
ప్రాఁతలత్యములఁ గల్పఁగఁజూడుమయ్య."
అనుచు వృద్ధుఁడు పల్కి యంతఁ గూర్చుండె
"కాఁబోలు"ననుచు నొక్కఁటఁ బల్కెఁ బెద్ద,
"ఛీఛీ"యనుచు నొంట ఛీకొట్టెఁ బిన్న,
అటునిటు పలుకక యందుఁ బెక్కండ్రు
మౌనముద్రను దాల్చి మర్యాదగనిరి

* * *

పసిబాలు డొక్కండు పలికె నీరీతి—
"ప్రాఁత ప్రాఁత యటంచు వదరుచున్నారు,
క్రొత్తక్రొత్త యటంచు గోణఁగుచున్నారు,
ప్రాఁతలోఁ బ్రాఁత కన్పడలేదు నాకు;
క్రొత్తలోఁ గ్రొత్త కన్గొనలేను నేను;
క్రొత్తప్రాఁతలలోని కూర్మితనాలు
ఆవకాయలలోన నరయుచున్నారు.

పసిపిల్లలము మేము, పాలపాపలము,
ఆవకాయలయూఁట యెఱుఁగదు మాకు.

తినలేము కకూర్తిఁ దినఁబోదుమేని
మండును నోరంత—మండును గడుపు
ఆవకాయలలోన నలరారు రుచుల
నెఱుఁగఁజాలము మేము—ఏల యిచ్చెదరు?
రాసిక్య మన్నారు, రమణి యన్నారు—
ఆల్మగలను బ్రేమ నరయుచున్నారు
అర్థమౌనే మాకు నాల్మగ లనఁగ?

వారిలోపలఁ బ్రేమ పరికింపఁగలమె?
ప్రేమ యెఱుఁగుదు మేము నొక్కంత;
అమ్మనాయనలపై నగు ప్రేమ మాకుఁ
అరయుచుందుము ప్రేమ నన్నదమ్ములను
అక్కతోఁ బ్రేమతో నాడుకోఁగలము;
ప్రేమతోఁ జెల్లెలిఁ బిలువఁగాఁగలము
మా ప్రేమ మీరేల మన్నింపలేరు?
మా ప్రేమ మీరేల మఱితెల్పలేరు?
ఆఁడుది మీ కెట్టు లగపడునొక్కొ,
అమ్మగా—అక్కగా—అగపడు మాకు.

కాంతను మేమును గౌఁగిలించెదము
ముద్దాడుచుందు మేమును గాంత నెపుడు
కాంత మాకును నింపు గలిగింపుచుండు;
కాని, కాంతను మేము కనుచున్న వేళ,
అమ్మగా, అక్కగా అగపడుచుండు.

మాకుఁ గాంతలపైని మలసిన ప్రేమ,
మేము కాంతల కిచ్చు ప్రేమంపు ముద్దు,
వర్ణింపఁగా మీకుఁ బరిపాటిలేదు.

మాయమ్మతమ్ముండు మా చందమామ,
దోబూచిచేసి మాతో నాడుచుండు;
మా తాత మేఘుండు మముఁ బిల్చుచుండి,
యందుకో రాడు, వెన్నాడుచుండినను.

కోయిలల్, చిలుకలు, కులుకుఁదుమ్మెదలు,
ననురాగ మొసఁగెడు నాటవస్తువులు.
మాయాటపాటలు, మా ప్రేమగతులు,
వర్ణింపఁగా మీకు బలమేల లేదు?
రాసిక్యమేగాని, రమణియే కాని,
యింకొక్కసంగతి యెఱుఁగరే మీరు?

ఆవకాయకు మీర లాసింతు రకట;
తల్లికమ్మనిపాలు తలపోయలేరు.

మాచూపుతో మీరు మమ్ము చూడండి,
మాప్రేమ తెలియండి, మాటలాడండి—
తినుటమాత్రమె లోకమున కింపు గాదు;
తినవలె, రుచులఁ గన్గొనవలె, దాని
నతిగించుకోవలె, నందు నానంద
మందఁగావలెఁగాని, తందానతాన
లతిగించుకోలేని వవి మాకొసంగి,
తలనొప్పి, కడుపునొప్పులు కల్గఁజేసి,
యలయించకండి, మ మ్మాదరించండి,
లోకమంతటిలోన, లోనను బైటఁ
బసితనమే మేము పరికింతు మెపుడు.

ఆపసితనమె మా కబ్బురం బౌనఁగు;
ఆపసితనమె మా కానందమిచ్చు:
అదియె మాకొసఁగి మా కబ్బురంబింపు;
అదియె మాకొసఁగి మా కానందమింపు;
ఈసభ లేటికి? ఈరచ్చ లేటి
కీర్తన వేటికి? ఈపాట లేల ?
వద్దింకఁ బ్రాబండి, వద్దు క్రొంబండి;
మీదు కొయ్యలబండి మీ కుండనీండి;
బండి మాకియ్యఁగానలె నంటి రేని,
ముద్దుమువ్వలబండి, మురిపెంపుబండి,
గణగణగంటలకాసులబండి
బంగారుబండి మాపాలఁ బెట్టండి,
మమ్ముఁ బ్రేమించండి, మమ్ము నమ్మండి,
మముఁ గంటఁజూడండి, మఱచిపోకండి,
మీకు మ్రొక్కెదమండి, మీచిత్తమండి"
అని మ్రొక్కి పసిబిడ్డఁ డంతఁ గూర్చుండె.

తల్ల వాల్చి, ముసలివారలు నీళ్లు నమలిరి—
ఔనౌను నిజమని యాడువా రనిరి,
క్రొత్తనాయుఁడు పండ్లుకొఱుకుచుఁ బలికె,
"పసిబాలుఁ డెఱుఁగునే పడఁతిలో రక్తి?
రాసిక్య మెఱుఁగునే ప్రాంతనాయుండు?
పసివారు మాకేల, ముసలివా రేల ?
రాసిక్య మొక్కటే, రమణి యొక్కటియె,
మాకు నాదర్శంబు, మాకు లక్ష్యంబు;
మారక్తి చూడండి, మనసునిల్పండి,
మామాటలు వినండి, మాటాడకండి—"

* * *

కరతాళశబ్దముల్ గవిసె నెల్లెడల,
జయజయధ్వానులతో సభయెల్ల ముగిసె.

* * *

* * *

ప్రాంతబండిని నేను బరికించుచుంటి;
ననుఁజూచి వెక్కిరించె నొకండు కోరి;
ననుఁజూచి జాలిచెంద నొకండు చేరి;
చూడకచూచియుఁ, జూచిచూడకయు,
సభవారు నను నుపేక్షను జూచుచుండ్రి
ఆయుపేక్షయె నాకు నర్ఘ్యసత్కార
మనుచు నానందించి, యపుడు నే నుంటి
క్రొత్తబండిని దోఁచుకొనుచు వెన్వెంటఁ
బెద్దలు పిన్నలు వెడలుచునుండ్రి
నిర్జనం బయ్యెను, నిశ్శబ్దమయ్యె;
కాఁగః నీడను నేను గదలకయుంటి,
నేకాంత సేవలో నింపుమై నుంటి.

* * *

ప్రాంతబండిని నేను బడియుంటి నిట్లు
పల్లెటూరను జేరి సనిపాట్లు లేక.

# సామ్యవాదము

దీగవల్లి వేంకటశివరావు

నేటి నాగరక దేశములందలి అర్థసంపద, పారిశ్రామిక వ్యవస్థ యంతయు ధనికుల వశమై రాజ్యపరిపాలనముకూడ వారి హస్తగతమే అయి యున్నది. దేశములో స్వంతఆస్తి, స్వంతహక్కులు అనునవి బాగుగ ప్రబలి, ప్రజలను ధనార్జనకు పురికొల్పగా, ఈ ప్రాపులాటలో కొందరు అమితధనవంతులగుటయు, బహుసంఖ్యాకు లమితదరిద్రు లగుటయు తటస్థించినది. దరహాపు టుత్పత్తివినిమయములు గల వస్తునిర్మాణ వ్యాపారవ్యవహారములు, వృత్తులు, సేవలు, రవాణా మార్గములు, అన్ని ముఖ్యపరిశ్రమలు స్వలాభముకొరకు నడుపు పెట్టుబడిదారుల వశమునైనవి. తాము పెట్టుబడి పెట్టి నడుపు పరిశ్రమలందు వ్యాపారములందు నీ ధనవంతులు సాధారణముగా సేవనియు స్వయముగా చేయరు. సరకులను కార్ఖానాలయం దితరులచేత చేయింతురు. ఇతరులచేత రవాణా చేయింతురు. దాని లాభమంతయు తామే గ్రహింతురు. వీరి చేతిక్రింద కూలినిగాని, జీతబత్తెములుగాని పుచ్చుకొను కష్టజీవులు కొందరు తమ చెమ్మటను నూర్చి కష్టించుచుందురు. అయితే ఈ కష్టజీవులు తయారుచేయు సరకులందుగాని వానిని తయారుచేయుటకు వీరుపయోగించు పనికరము లందుగాని యంత్రములందుగాని ఈ పారిశ్రామికుల కట్టి హక్కుభుక్తములు నుండవు. తాము పడిన శ్రమవలన పెట్టుబడిదారులకు వచ్చు లాభములందు వీరికి భాగ ముండదు. ఈ ఆర్థికవ్యవస్థకే 'క్యాపిటలిజం' అని పేరు.

ఈ ఆర్థికవ్యవస్థయందు పాటుపడు వారు ఎంత శ్రమపడినను వారికి పెట్టుబడిదారులగు యజమానులు ఇచ్చు మామూలు కూలి, మామూలు జీతబత్తెములే తప్ప శ్రమకుతగిన గిట్టుబడి యుండదు. జీవనాధారమునకు తగిన జీవనభృతి లభింపదు. ఈ 'మామూలు' కూలి జీతబత్తెములనునవి, పెట్టుబడిదారులు నిర్ణయించిన ఆచార వ్యవహారములను బట్టి ఏర్పడినవేగాని కూలివారి క్షేమ లాభముల ననుసరించి ఏర్పడినవికాదు. అందువలన పెట్టుబడిదారు లంతకంతకు ధనికులై సుఖింతురు; కూలివారంతకంతకు దరిద్రులై కష్టపడుదురు. ధనికులకువలె బీదలకు విద్యాలాభముగాని, ఆరోగ్యావకాశములుగాని సుఖజీవనముగాని, లభించుటకు వీలులేదు. ధనికులు దరిద్రులు నను తారతమ్యము తరగతులుగల సంఘనిర్మాణమువలన సాంఘికముగను రాజకీయముగను ధనవంతులే బలవంతులగుటయు వారికే పలుకుబడి, అధికారములు కలుగుటయు అర్థోత్పత్తి అర్థానుభవములకువలెనే దేశ పరిపాలనమును వారిహస్తగతమై, ప్రజాజీవనమునందుగల అభివృద్ధిమార్గములు కూడ వారిచేతులలోనే ఇమిడి యుండి దరిద్రులు లేవలేక అణచివేయబడియుందురు. ఈ నాగరకత యంతయు పెట్టుబడిదారుల ప్రాబల్యముగల నాగరకతగా చిరస్థాయిగా వర్ధిల్లుచుండును. దీనికే క్యాపిటలిజం అని పేరు.

'సోషలిజం' అనునది 'క్యాపిటలిజం' కు విరుద్ధమగు సిద్ధాంతము. దీనిని సంఘసామ్యవాదము లేక సామ్యవాదము అని వ్యవహరింపవచ్చును. ఈ "సోషలిస్టు" వాదులు క్యాపిటలిజం పద్ధతులను రద్దు చేయదలతురు. దేశములో స్వంతఆస్తి స్వంతహక్కులు నిర్మూలింప దలతురు. దేశసంపదనెల్ల సాముదాయికపు సొత్తుగా జేసి దేశాదాయమును దేశములోని ప్రజ లందరికిని సమానముగా పంచిపెట్ట దలంతురు. ప్రజలకు జీవనాధారమును గల్పింపగలట్టియు వారికి సౌఖ్యము హెచ్చింపగలట్టియు అర్థోత్పత్తిసాధనములను, పరిశ్రమలను, సంఘసేవలను, వృత్తులను, జనసంఘముయొక్క ఉమ్మడి అధికారము క్రిందనుంచి, ప్రజల ఉమ్మడిక్షేమలాభముల కొరకే సాముదాయికముగా నడిపి, అందరికిని సమానమగు విద్య, ఆరోగ్యము, సౌఖ్యము లభింపజేసి, తారతమ్యములు, తరగతులులేని సంఘనిర్మాణము గావింపవలెనని వీరి యుద్దేశము. ప్రతి

వ్యక్తికిని తాను పడు శ్రమనుబట్టి తగిన జీవనభృతిని పొందుటకు వీలుండవలెనని కొందఱు సోషలిస్టులయభిప్రాయము. కేవలము శ్రమనుబట్టి దానికి తగిన జీవనభృతిమాత్రమే గాక ఒక్కొక్కవ్యక్తికి అతని యావశ్యకతలనుబట్టి దానికి వలయు జీవనభృతిని గల్పింపవలెనని మఱికొందఱు సోషలిస్టుల యభిప్రాయము. ఏదియెట్లున్నను జీవితావకాశములందు, సౌఖ్యములందు, సంఘమునం దొకవ్యక్తికి, ఇంకొకవ్యక్తికి తారతమ్యము లుండరాదని సోషలిస్టు లందరును తలంతురు.

జనసామాన్యము యొక్క సౌఖ్యమునకు క్షేమలాభములకు సంబంధించిన సమస్త వ్యవహారములును స్వలాభమును కాంక్షించు ప్రైవేటు పెట్టుబడిదారుల వలన గాక ప్రజాశ్రేయము నందే లక్ష్యముంచి పనిచేయు ప్రజాప్రతినిధిసంస్థలవలన నిర్వహింపబడినచో ప్రజాసౌఖ్యము శ్రేయము హెచ్చునని అందఱకును తెలియును. పురపారిశుధ్యపుబనులు, నీటిసరఫరా, విద్యుచ్ఛక్తి, దీపములు వెలిగించుట, విద్య మున్నగు పనులు మనదేశములోని మునిసిపాలిటీలెట్లు పరహాముపైన సాముదాయికముగా నిర్వహించుచున్నది మనము చూచుచున్నాము. ఇతరదేశములందలి స్థానికసంస్థలింక ననేక కార్యములు ప్రజాసామాన్యశ్రేయము మేరకు నిర్వహించుచున్నవి. సహకారసంస్థలు, వస్తూత్పత్తిని, వస్తువుల సరఫరా రవాణా మున్నగు పారిశ్రామిక వ్యాపారవ్యవహారములు, ప్రజలలాభముకొరకే నిర్వహించుచున్నవి. ఈపనులందెల్ల సోషలిజం సిద్ధాంతము లిమిడియున్నవి.

సాముదాయికపు ఆస్తియొక్క యాజమాన్యపుహక్కులు, దాని పరిపాలనము, అనుభవవిధానము, పలురూపములు దాల్చవచ్చును. దేశమునకంతకు ప్రజలకంపరికిని సంబంధించిన పనులు, పరిశ్రమలు, సంపదలు కేంద్రప్రభుత్వవశమునం దుండవచ్చును. మండలమునకు ఒకప్రదేశములోని ప్రజలకు సంబంధించిన అర్థసంపద, అర్థోత్పత్తి సాధనములు రాష్ట్రీయస్థానికసంస్థల యధీనమున నుండవచ్చును. రాష్ట్రీయస్థానిక సంబంధములకు కొన్ని ప్రత్యేకప్రజాప్రతినిధి సంస్థలందే నెలకొల్పబడవచ్చును. ఇట్లు మొత్తము మీద అర్థికశక్తులకెల్ల ప్రభుత్వపరిపాలక సంస్థలద్వారా సమన్వయము చేసి ప్రజోపయోగము కొరకే వినియోగించుటకు సోషలిస్టులు ప్రయత్నింతురు.

ఆర్థికవిషయములందు సమానమగు హక్కుభుక్తము లుండవలెనని మాత్రమే గాక, అందరికిని సమానమగు రాజకీయహక్కులును, సర్వసమానమగు సాంఘికగౌరవ ప్రతిపత్తులును, ఉండవలెనని కూడా సోషలిస్టుల ఆశయము. అర్థసంపదను సర్వజనులకు సమానముగ పంచి అందరికిని సమానముగా అనుభవించుటకును సర్వసమానరాజకీయసాంఘిక హక్కులు కలుగుటకును వలసిన సర్వసన్నాహములు, అధికారములు, చట్టనిబంధనలుకూడ ప్రభుత్వము చేయవలెనని సోషలిస్టుల యభిప్రాయము. ప్రస్తుతము అమలులో నున్న రాజకీయ సంస్థలకు తమ ప్రతినిధులను విరివిగా పంపి వానిని వశముచేసికొనినచో వానిచే తమ యభిమతానుసారముగ కార్యములెల్లా చేయించవచ్చుననియు, ఎట్టి ఆకస్మికపు మార్పు విప్లవము లేకుండగనే తాము కోరు సంస్కరణములెల్ల సిద్ధించి సంఘస్వామ్యము నెలకొల్పబడవచ్చుననియు సోషలిస్టుల ఊహ.

పూర్వకాలమునాటి సోషలిస్టులు ప్రధాన పరిశ్రమలు, వృత్తులు, అర్థోత్పత్తి సాధనములు సాముదాయికముగా నిర్వహించుటకొరకు ప్రభుత్వవశమైన జాలునని తలంచుచుండిరి. అంతమాత్రమున ఆయా పరిశ్రమలందు వృత్తులందు వ్యవహారములందు కష్టించువారికి సరిగా ఉపకరించి సౌఖ్యము కలుగునటకు వీలులేదనియు, ఆయాపరిశ్రమలు, వృత్తులు, వ్యవహారములనడుపుటలో అందు పనిచేయు కష్టజీవులకు కొంత పలుకుబడి అధికారము కూడ నుండవలెననియు నేటి సోషలిస్టులు కోరుచున్నారు. పూర్వము ఇంగ్లాండులోని బొగ్గుగనుల పరిశ్రమ ప్రభుత్వవశమైన జాలునను వారు నేడాపరిశ్రమ, బొగ్గుగనుల పనివారికి ప్రాతినిధ్యము స్వపరిపాలనాధికారములు గలట్టి యొక్క ప్రత్యేకపాలకసంఘవశము చేయబడవలెననుచున్నారు. ఇట్లే నేటిపాశ్చాత్యదేశములందలి వివిధపరిశ్రమలవారు

కోరుచున్నారు. ఈయుద్యమము ప్రతిదేశములోను అభివృద్ధిగాంచుచున్నది గాని ఆచరణమునందు ఫలితములంతగా గానవచ్చుట లేదు. బీదలు బాగుపడుటలేదు. ఐరోపాదేశములోని సామ్యవాదులలో కొందరు సోషలిస్టులనియు కొందరు కమ్యూనిస్టు లనియు పిలువబడుచున్నారు. నేడు రష్యాలో స్థాపింపబడిన సోవియటు ప్రభుత్వము అచ్చటి కమ్యూనిస్టు సామ్యవాదులు తమ అభిప్రాయముల ప్రకారము నెలకొల్పిన ఒక మహా రాజ్యాంగము. ఉద్దేశములందును ఆశయములందును సోషలిస్టులకును కమ్యూనిస్టులకును ఎట్టి తారతమ్యము లేదుగాని కార్యాచరణ విధానములందు చాలా భేదము కలదు. కమ్యూనిస్టులు సోషలిస్టులలో తీవ్రవాదు లను కార్యశూరులని చెప్పవచ్చును.

ప్రస్తుతపు నాగరకత పెట్టుబడిదారుల నాగరకతయైనందున దానివలన నిర్మింపబడిన ప్రజాప్రభుత్వ సంస్థలు పేరునకుమాత్రమే ప్రజాసంస్థలనియు, వని నెంతమార్చినను అవి నిజముగా జనసామాన్యమునకు, కష్టజీవులకు దరిద్రులకు నుపకరింపజాల వనియు, ధనికుల పలుకుబడి, అధికారప్రాబల్యము నేదో విధముగా మిగిలియుండు ననియు, ఈవిషబీజములను కూకటివేళ్లతో పెల్లగించి ప్రాతపువాదులను నాశనముజేసి, కేవలము బీదలు కష్టజీవులు నను పాటకపుజనులకే సర్వాధికారముగల ప్రభుత్వమును స్థాపించి సర్వసమానసంఘస్వామ్యమును నెలకొల్పవలెననియు, ఇదికేవలముసౌమ్యమార్గములచేత సిద్ధింపదనియు, ధనికులతో సంఘర్షణము అధికారులతో పోరాటము కలుగక తప్పదనియు, పాటకపుజనులు ఏదో విధముగా విజృంభించి, - విప్లవ మార్గములచేత, రాజ్యమును వశము చేసికొనవలె ననియు వీరి యభిప్రాయము. అన్ని దేశములందును కర్షకులును కార్మికులును ఇట్టివిప్లవమునకు సంసిద్ధులుగా నుండ రనియు సామ్యవాద సిద్ధాంతములు వారి యందు మెల్లిగా వ్యాపింపజేయవలెననియు సోషలిస్టు సామ్యవాదులు చెప్పుమాటలు వీరు విశ్వసింపరు. దౌర్జన్యమునకు, రక్తపాతమునకు వీరు జంకరు. ఏదో విధముగా దేశముయొక్క రాజకీయార్థిక ప్రభుత్వ యంత్రములను వశముజేసికొన జూతురు. క్యాపిటలిస్టు రాజ్యాంగమును తిరుగదోడిన పిదప, సంఘస్వామ్యముయొక్క పరిపూర్ణస్థితి సిద్ధించువరకును ఒకేమారుగా జనసామాన్యము స్వయముగా పరిపాలింపనేరదు గనుక మార్పుదల కాలమున పాటకపుజనుల సర్వాధిపత్యము (Dictatorship of the Proletariat) గల సోవియటుసంఘ ప్రభుత్వమును స్థాపింపవలె నందురు. అనగా జనసామాన్యముయొక్క అభిప్రాయములనే ప్రతిఫలింప గల సామ్యవాద ప్రజాపక్షమును నెలకొల్పి ఈ ప్రజాసభ ఆధ్వర్యముక్రింద గ్రామములందును పట్టణములందును రైతులను కూలివారిని చిన్నచిన్న జనసంఘములుగా ఏర్పరచి వారి ప్రతినిధులను సోవియటు కాంగ్రెసుకు పంపునట్లు జేసి, పరిపాలక సంఘముల నేర్పరచి వానిక్రింద పనిచేయు మంత్రులను నియమించి ఒక సార్వజనిక నియంత్రణ ప్రభుత్వము నేర్పరుపజూతురు. రష్యాలో నేడు స్థాపింపబడిన సోవియటు ప్రభుత్వము ఇటువంటిదే.

# సంస్కృతభాషయందు గద్యచంపూకావ్యములు

కనుపర్తి మార్కండేయశర్మ

సంస్కృతభాష అనాదిభాష యగుటచేత తత్సాహిత్యమునం దనేకవిషయములు అపారములయి కనబడుచుండును. ఋగ్యజుస్సామాథర్వములను నాలుగువేదములును పరమేశ్వరప్రోక్తము లగుటచేత పరిమితముగ నాలుగని వ్యవహరింపబడుచున్నవి. తదర్థనిర్ణయార్థము మహర్షులచేత ప్రోక్తములయిన శిక్షాదిషడంగములనుగురించియు, ఉపాంగములనుగురించియు ఏర్పడిన గ్రంథము లసంఖ్యాకములయి దేశమునందంతటను వ్యాపించియున్నవి. ఇది వైదికవాఙ్మయ విషయము.

ఆర్ష సంస్కృతసాహిత్యమునందు వాల్మీకిరామాయణమునకు ఆదికావ్య మని గలదు. ఆర్షసాహిత్యమునకు సంబంధించిన అగ్నిపురాణమునందు

'గద్యం పద్యంచ మిశ్రంచ కావ్యాది త్రివిధం స్మృతమ్
*　　*　　*　　*　　*　　*
మిశ్రం చంపూరితి ఖ్యాతం ప్రకీర్ణకమితి ద్విధా,
శ్రవ్యం చైవాభినేయంచ ప్రకీర్ణం సకలోక్తిభిః.'
అనియున్నది. (౩౩౬-౩౮.)

## చంపూశబ్ద వ్యుత్పత్తి

గత్యర్థకమయి చౌరాదికమయిన చపిధాతువునకు ఉ ప్రత్యయమును చేర్చగా "చంపూః" అను శబ్దమేర్పడుచున్నది. "చమత్కృత్య పునాతి సహృదయాన్, విస్మితీకృత్య ప్రసాదయతీతి చంపూః" అని హరిదాస భట్టాచార్యులవారు చంపూశబ్ద వ్యుత్పత్తిని చెప్పిరి కాని ఆర్షసాహిత్యమునందు దీనికి తగిన ఉదాహరణ మీనామముతో గనబడుటలేదు.

క్రీ. ౭-వ శతాబ్దియందున్న దండి తన కావ్యాదర్శమునందు

'గద్యపద్యమయీ వాణీ చంపూరిత్యభిధీయతే'(౧-౩౧) అనుశ్లోకముచేత గద్యపద్యాత్మక మయిన కావ్యవిశేషమునకును 'చంపూకావ్యము' అను సంకేతము నొసగియున్నాడు. ఆచార్యదండిప్రోక్త మగు చంపూలక్షణము నాటకాదికమునం దతివ్యాప్తి యగునను తలంపుతో ౧౨ వ శతాబ్దమునందు 'కావ్యానుశాసన' మను లక్షణగ్రంథము నొనర్చిన హేమచంద్రాచార్యుడు చంపూలక్షణమును ఈవిధముగ పరిష్కార మొనర్చియున్నాడు:

"గద్యపద్యమయీ సాంకా సోచ్ఛ్వాసా చంపూః" అని. ఇంతటితో శాస్త్రీయమయిన శబ్దవ్యుత్పత్తిని విరమించి విషయమునకు వత్తము.

చంపూకావ్యనిర్మాణపద్ధతి బ్రాహ్మణాదిగ్రంథములం దచ్చటచ్చట గల వైదికేతిహాసములనుండియు, బౌద్ధవాఙ్మయమునందు గల పాలీభాషామయజాతకగ్రంథములనుండియు, పంచతంత్రము, హితోపదేశము మున్నగు సంస్కృతకావ్యగ్రంథములనుండియు రచనాప్రణాళి గైకొనబడి విద్వాంసులచేత రూపాంతరము పొందింపబడినదయి ఇప్పటి చంపూకావ్య పద్ధతికి తేబడినది.

## మొదటి చంపూకావ్యము

హేమచంద్రాచార్యుడు తన కావ్యానుశాసనమునందు చంపూలక్షణమును చెప్పి అందుల కుదాహరణముగ సుబంధువిరచితమగు 'వాసవదత్త'ను చెప్పియున్నాడు. కాని ఆలంకారికులలో పలువురు 'వాసవదత్త'ను చంపూకావ్యముగ అంగీకరించుటలేదు. కావున అందఱును చంపూకావ్యముగ అంగీకరించుచున్న త్రివిక్రమభట్టకృతమయిన 'నలచంపువు'ను ప్రథమచంపూకావ్యముగ మన మంగీకరింతము. ఈ త్రివిక్రమభట్టు

రాష్ట్రకూటవంశీయు డయిన మాన్యఖేటాధిపతియగు మూడవ ఇంద్రరాజుయొక్క ఆస్థానపండితుడనియు, ఈ మూడవ ఇంద్రరాజు మాన్యఖేటమునుండి కృష్ణా గంగానదీసంగమస్థలమునందున్న కురుండకగ్రామము నకు వెళ్లి అచట రాజ్యాభిషేకమును చేసుకొన్నటుల ఒకానొక తామ్రశాసనము విక్రమ సం. ౯౭౨ (క్రీ. శ. ౯౧౫) లభించినది. అభిషేకానంతరము బంగారు తులా దానమును, అనేకాగ్రహారములను బ్రాహ్మణులకు దాన మొసగియున్నాడు. ఈతామ్రశాసనమునందలి శ్లోకము లను రచించినది యీత్రివిక్రమభట్టే యని శాసనశోధ కులు నిర్ణయించియున్నారు. అనగా మొదటి చంపూ గ్రంథమును రచించిన త్రివిక్రమభట్టు క్రీ. శ. ౧౦ వ శతాబ్దముయొక్క ప్రారంభమునం దున్నటుల మనము నిశ్చయించవచ్చును. ఇతడు 'మదాలసచంపువు' అను మఱొకగ్రంథమునుకూడ రచించియున్నాడు. మహా జ్యోతిషికుడయిన భాస్కరాచార్యు డీతనివంశమునందు జన్మించియున్నాడు. సభంగశ్లేషమయం దీచంపువుతో సమానమయిన గ్రంథరాజము సంస్కృతభాషయందు మఱొక్కటి లేదనవచ్చును.

చంపూకావ్యము లిప్పుడు సంస్కృతభాషయం దనేకములు గనబడుచున్నవి. ఇందులో కొన్ని చంపూ కావ్యములు ఏకాలమునందు రచింపబడినవో తెలియ వచ్చుచున్నవి. మఱికొన్ని చంపూకావ్యములయొక్క కాలము తెలియుటలేదు. ద్వివిధములయిన చంపూకావ్య ములయొక్క సూచి కర్తృనామసహితముగను, ముద్రితా ముద్రితభేదముతోను క్రమముగ సంస్కృతభాషాభి మానులను భావుకుల సంతోషార్థము ప్రకటించుచున్నా ను. ఆయాచంపూగ్రంథములను రచించినటుల సూచీ పత్రములవలన ఎఱింగినవానినిసుఱించి ఏ సూచీపత్రము నందు చూచియున్నానో ఆవిషయమునుగూడ తెలిపి యున్నాడను. ఇంకను చూడవలసిన సూచీపత్రములు చాలగలవు. విషయ మంతయు 'ఆనందకందచంపువు' యొక్క ఉపోద్ఘాతమునుండి సంగ్రహించితిని. కొన్ని టిని సూచీపత్రములనుండి సంగ్రహించియున్నాడను.

## ౧. కాలనిర్ణయము తెలిసిన చంపూగ్రంథములు

| చంపూనామము | గ్రంథకర్తృనామము | సమయము | వివరణము | |
|---|---|---|---|---|
| నలచంపువు | త్రివిక్రమభట్టు | క్రీ. శ. ౯౧౫ | ముద్రితము | బొంబాయి |
| మదాలసాచంపువు | ,, | ,, | | |
| యశస్తిలకచంపువు | సోమదేవసూరి | క్రీ. ౯౫౯ | ,, | ,, |
| జీవంధరచంపువు | హరిచంద్రుడు | క్రీ. ౧౦ వ శతాబ్దము | ,, | తంజావూరు |
| *రామాయణచంపువు | భోజుడు | క్రీ. ౧౧ వ శతాబ్దము | ,, | బొంబాయి |
| ఉదయసుందరీకథాచంపువు | సోడ్ఢలుడు | | ,, | బరోడా |
| *భారతచంపువు | అనంతభట్టు | క్రీ. ౧౫ వ శతాబ్దము | ,, | బొంబాయి |
| ,, | రాజచూడామణి | ౧౬ వ శతాబ్దము | అముద్రితము | |
| వరదాంబికాపరిణయచంపువు | తిరుమలాంబ | క్రీ. ౧౫౪౦ | తం.వా.౭.సం.౪౨౨౦ అము. | |
| వీరభద్రదేవచంపువు | పద్మనాభమిశ్రుడు | క్రీ. ౧౫౭౭ | పిటర్సన్ ౧.౧౦౧ | ,, |
| *భాగవతచంపు | అభినవకాళిదాసుడు | క్రీ. ౧౭ వ శతాబ్దము | ,, | బొంబాయి |
| మాధవచంపు | చిరంజీవభట్టాచార్యుడు | ,, | ,, | కలకత్తా |
| విద్వన్మోదతరంగిణీచంపు | ,, | ,, | ,, | ,, |
| భాగవతచంపు | రాజనాథుడు | ,, | అముద్రితము తం. ౭-౪౦౭౦. | |

## కొడైకెనాలు చిత్రములు



౫. సరోవరప్రాంతము



౬. కొడైకెనాలు



౭. నక్షత్రపరిశోధనశాల



౮. స్తంభపుకొండలు (౮30 అడుగుల మొత్త

| | | | | |
|---|---|---|---|---|
| ఆనందబృందావనచంపు | కర్ణపూరుడు | ,, | ముద్రితము | మధుర |
| గోపాలచంపు | జీవగోస్వామి | ,, | ,, | బృందావనము |
| యాత్రాప్రబంధచంపు | సమరపుంగవదీక్షితులు | ,, | ,, | బొంబాయి |
| ఆనందకందచంపు | ,, | ,, | అముద్రితము (ఇం. ఓ. వా.) | |
| ,, | మిత్రమిశ్రుడు | ౧౬౦౫-౧౬౭౪ | ముద్రితము | కాశి |
| మందారమరందచంపు | కృష్ణకవి | ,, | ,, | బొంబాయి |
| వసుచరిత్రచంపు | కాలహస్తి | ,, | అము. (తం. ౪-౨౧౨౬) | |
| నృసింహచంపు | సూర్యదైవజ్ఞుడు | క్రీ. ౧౬౩౬ | ,, (ఇం. ౪-౫౦౫౧) | |
| *నీలకంఠవిజయచంపు | నీలకంఠదీక్షితులు | ౧౬౩౪ | ముద్రితము | మదరాసు |
| యుద్ధకాండచంపువు | రాజచూడామణి | ,, | | |
| త్రిపురవిజయచంపు | ,, | ,, | అముద్రితము | |
| కర్ణచంపు | కకాభట్టు | క్రీ. ౧౬౯౬. | ,, | |
| *విశ్వగుణాదర్శచంపు | వేంకటాధ్వరి | క్రీ. ౧౪ వ శతాబ్దము | ముద్రితము | మదరాసు |
| హస్తిగిరిచంపు | ,, | ,, | ,, | ,, |
| ఉత్తరచరితచంపు | ,, | ,, | ,, | ,, |
| శ్రీనివాసచంపు | ,, | ,, | ,, | ,, |
| యతిరాజవిజయచంపు | అహోబిలుడు | ,, | అముద్రితము | |
| కేరళాభరణచంపు | రామచంద్రదీక్షితుడు | ,, | తం. వా. ౪. సంఖ్య ౨౦౩౧ | |
| స్వాహాసుధాకరచంపు | నారాయణుడు | ,, | ముద్రితము | బొంబాయి |
| త్రిపురవిజయచంపు | అతిరాత్రయాజి | ,, | తం. వా. ౪. సంఖ్య ౨౦౩౬ | |
| ,, | నృసింహామాత్యుడు | ,, | ,, ,, ,, | |
| నృసింహచంపు | కేశవభట్టు | ,, | ముద్రితము | బొంబాయి |
| అనిరుద్ధచరితచంపు | దేవరాజు | ,, | సరస్వతిభవన | బనారసు |
| ధర్మవిజయచంపు | నల్లాదీక్షితులు | క్రీ. ౧౪౧౦ | తం. వా. ౪. సంఖ్య ౨౭౩౧ | |
| భోసలవంశావలీచంపు | వేంకటేశకవి | క్రీ. ౧౪౧౧ | ,, ,, ౨౭౨౦ | |
| యదుగిరిభూషణచంపు | అప్పలాచార్యుడు | ౧౮ వ శతాబ్దము | ముద్రితము | |
| హరిశ్చంద్రచరిత్రచంపు | గురురాముడు | ,, | ,, | |
| శంకరచేతోవిలాసచంపు | శంకరమిశ్రుడు | ,, | హ్ర. ౫ వా. సంఖ్య ౧౨౪ | |
| గౌరీమాయూరమహాత్మ్య [చంపు | అప్పాదీక్షితులు | క్రీ. ౧౪౭౫ | తం. ౪. సంఖ్య ౨౦౩౫ | |
| చిత్రచంపు | బాణేశ్వరభట్టాచార్యుడు | క్రీ. ౧౪౨౨ | ఇం. వా. ౪సం. ౨౦౨౨ | |
| గంగావతరణచంపు | శంకరదీక్షితులు | క్రీ. ౧౪౭౦ | ,, ,, ,, ౫౦౨౧ | |
| బాలభాగవతచంపు | పద్మరాజు | క్రీ. ౧౮౦౦ | భండా. ౧. సంఖ్య ౪౧ | |
| స్యానందూరుపురవర్ణనచంపు | రామవర్మకులశేఖరవంచిమహా[రాజు | క్రీ. ౧౮౧౩ | ముద్రితము | అనంతశయనం |
| భాగీరథీచంపు | అచ్యుతశర్మ | క్రీ. ౧౮౧౨ | ,, | బొంబాయి |
| కుమారసంభవచంపు | శరభోజీమహారాజు | క్రీ. ౧౮౩౦ | అముద్రితము తం. ౪. ౨౦౩౦ | |
| కుమారోదయచంపు | కోరాడరామచంద్రశాస్త్రి | ౧౮౩౦-౧౯౦౦ | అముద్రితము | |
| దేవీవిజయచంపు | | | ,, | |
| రఘునాథవిజయచంపు | శ్రీకృష్ణకవి | క్రీ. ౧౮౬౫ | ముద్రితము | బొంబాయి |

* ఈసుర్తుగలవి ఆంధ్రాక్షరములందుకూడ ముద్రితములని ఎఱుంగవలయును.

| | | | |
|---|---|---|---|
| సముద్రమథనచంపు | బెల్లంకొండ రామకవి | ౧౮౭౫-౧౯౧౩ | అముద్రితము |
| రమాపరిణయచంపు | ,, | ,, | ,, |
| * గరుడసందేశచంపు | ,, | ,, | ముద్రితము |
| * రుక్మిణీపరిణయచంపు | ,, | ,, | ,, |
| శివవిలాసచంపు | విరూపాక్షుడు | క్రీ. ౧౯ వ శతాబ్దము | తం. ౭ సంఖ్య ౪౧౬౦ |
| చోలచంపు | ,, | ,, | ,, ,, ౪౨౧౩ |
| వేంకటేశచంపు | ధర్మరాజు | ,, | ,, ,, ౪౧౫౮ |
| ఉత్తరచంపు | భగవంతాచార్యులు | | ,, ,, ౪౦౨౯ |
| వ్రజముకుటీవిలాసచంపు | అలశింగభట్టదీక్షితులు | ,, | క. వా. ౪ సం. ౩౨౯౨ |
| భైష్మీపరిణయచంపు | రత్నఖేటదీక్షితులు | ,, | ముద్రితము-కలకత్తా |
| అభినవరామాయణచంపు | లక్ష్మణదాంతుడు | | భండా. ౧ సం. ౩౯ |
| లక్ష్మీశ్వరచంపు | రమాబాయి | | ముద్రితము కలకత్తా |
| శంకరాచార్యచంపు | బాలగోదావరి | ఆధునికి | ముద్రితము-బొంబాయి |
| శేఫాలానఖందరము | భగవచ్చంద్రవిశారదుడు | ,, | ,, కలకత్తా |
| ప్రదోషమాహాత్మ్యము | ప్రభాకరతాలమణి | ,, | తిరుమాగు |
| పురుషోత్తమచంపు | జినదాసశాస్త్రి | | బొంబాయి |
| జైనచంపు | ,, | | |

## ౨. కాలనిర్ణయము తెలియని చంపూగ్రంథములు

| | | |
|---|---|---|
| అభినవపారిజాతచంపు | తెలియదు | ఆపస్తు వా. ౨. సంఖ్య ౩౪౭, |
| అభినవభారతచంపు | అభినవకాళిదాసుడు | రై సు. ౨౪౬ |
| ఉత్తరచంపు | వేంకటకృష్ణకవి | క. వా. ౪. సం. ౪౦౨౯ ? |
| | యతిరాజు | అ. ౩౦౨ |
| ,, | శంకరాచార్యుడు | ,, ౨౯౨ |
| ,, | హరిహరానందుడు | ,, ౨౭౦ |
| | తెలియదు | ఆపస్తు. ౨. ౯౦౦౮ |
| ఉత్తరకాండచంపు | బ్రహ్మసూరి | క. ౩ వా. ౨౩౨౨ ఏ |
| ఉత్తరరామాయణచంపు | రాఘవాచార్యుడు | రై సు. ౨౪౮ |
| ,, | రామానుజదాసుడు | క. ౪. ౩౪౩౭ |
| కాకుత్స్థవిజయచంపు | వల్లీసహాయుడు | ఇం. ౪౦౩౯ |
| కావ్యకలాపచంపు | మహానందధీరుడు | మిత్ర. ౨ వా. ౯౩౧ |
| కాశికాతిలకచంపు | నీలకంఠభట్టు | క. ౩ వా. ౨౦౧౧ |
| కుమారభార్గవీయచంపు | భానుదత్తుడు | ఇం. ౪౦౪౦ |
| కుమారవిజయచంపు | భాస్కరయజ్వ | క. ౪ వా. ౩౯౧౯ |
| కుమారాభ్యుదయచంపు | తెలియదు | క. ౩ వా. ౨౫౦౧ బి |
| కుమారోదయచంపు | ,, | క. ౪ వా. ౩౯౬౪ బి |
| కువలయాశ్వవిలాసచంపు | త్రివిక్రముడు | ముద్రితము బొంబాయి |
| కృష్ణకీర్తిచంపు | చింతామణి | ఓకనేరు. ౫౭౨ |
| కృష్ణరాజచంపు | కృష్ణశాస్త్రి | రై సు. ౨౪౮ |

## సంస్కృతభాషయందుగల చంపూకావ్యములు

| | | |
|---|---|---|
| కృష్ణవిజయచంపు | వీరేశ్వరుడు | డి. ౨ వా. ౧౬౦౪ సి |
| గంగావంశానుచరితచంపు | వాసుదేవరథసోమయాజి రాజగురువు | డి. ౪ వా. ౩౦౩౦ |
| గోదాపరిణయచంపు | తెలియదు | డి. ౪ వా. సం. ౩౧౦౮ |
| గౌరీపరిణయచంపు | వేంకటసూరి | డి. ౩ వా. ౨౨౫౫ ఏ |
| చంద్రశేఖరచంపు | రామనాథకవి | ముద్రితము కలకత్తా |
| చంపూసంక్షేపము | భీష్మాచార్యుడు | డి. ౩ వా. ౨౮౭౬ సి |
| దూతవాక్యచంపు | తెలియదు | డి. ౩ వా. ౨౪౮౫ బి |
| నరసింహచంపు | సంకర్షణసూరి | తం. |
| నిరనునాసికచంపు | నారాయణద్విజుడు | డి. ౪ వా. ౪౨౦౬ బి |
| నీలకంఠచంపు | తెలియదు | ముద్రితము బొంబాయి |
| పంచకల్యాణచంపు | చిదంబరకవి | డి. ౪ వా. ౨౯౪౦ |
| పారిజాతహరణచంపు | కృష్ణకవి | ముద్రితము బొంబాయి |
| పురుషోత్తమచంపు | నరసింహార్యుడు | తంజా. ౧ నెం. ౨౮౪ |
| పార్వతీపరిణయచంపు | రామేశ్వరవిద్వాన్ | డి. వా. ౩ సం. ౨౭౭౭ సి |
| ప్రహ్లాదచంపు | కేశవపండితుడు | మిత్ర\|౩ వా. ౧౪౨౮ |
| బకవధచంపు | తెలియదు | డి. ౩ వా. ౨౪౫౫ బి |
| బాలకృష్ణచంపు | జీవనకవి | ముద్రితము. బొంబాయి |
| భాగవతచంపు | తెలియదు | డి. ౩ వా. ౨౬౦౭ బి |
| ,, | చిదంబరకవి | తం. ౪౦౬౮ |
| ,, | రామభద్రుడు | ,, ౪౦౬౯ |
| ,, | వీరరాఘవాచార్యుడు | డి. ౪ వా. ౪౧౨౨ సి |
| ,, | కొల్లూరి సోమశేఖరకవి | డి. ౩ వా. ౨౨౬౯ ఏ |
| భారతచంపు | నారాయణుడు | ,, ౪ వా. ౩౮౯౩ సి |
| భార్గవచంపు | రామకృష్ణసూరి | ముద్రితము బొంబాయి |
| భిల్లకన్యాపరిణయచంపు | తెలియదు | డి. ౧ వా. ౩౬౬. యఫ్ |
| మద్రకన్యాపరిణయచంపు | గంగాధరకవి | ,, ౪ వా. ౪౧౩౭ సి |
| మాధవానలకామకందలాకథాచంపు | తెలియదు | కాశ్మీర ౭౧ |
| మానవేదభారతచంపు | మానవేదమహారాజు | డి. ౪ వా. ౩౨౭ |
| మారుతివిజయచంపు | రఘునాథుడు | తం. ౪౧౦౬ |
| మృగయాచంపు | కవిరాజు | డి. ౪ వా. ౩౨౧౭ |
| యుధిష్ఠిరవిజయచంపు | గోపాలకవి | డి. ౪ వా. ౪౧౫౦ సి |
| రామచంద్రచంపు | విశ్వనాథసింహుడు | మిత్ర. ౧ వా. ౮౩ |
| రామానుజదివ్యచరితచంపు | వకుళభూషణసూరి | డి. ౪ వా. ౩౪౯౩ |
| రామాభిషేకచంపు | దేవరాజభట్టు | ,, ౨ వా. ౧౫౧౬ బి. |
| రామాభ్యుదయచంపు | రామకవి | ,, ౨ వా. ౧౪౯౯ బి |
| రామాయణచంపు | తెలియదు | ,, ౩ వా. ౨౪౩౮ బి |
| రుక్మిణీపరిణయచంపు | వేంకటాచార్యుడు | ,, ౩ వా. ౨౫౪౦ బి |
| రుక్మిణీస్వయంవరణచంపు | చిదంబరకవి | ,, ౩ వా. ౨౪౫౫ బి |
| వాసుదేవానందినీచంపు | గోపాలకృష్ణుడు | రె కు. ౨౫౨ |

| | | |
|---|---|---|
| విక్రమసేనచంపు | నారాయణరావమంత్రి | కు. ౨ వా. ౧౯౦౩ |
| విరించినాగచరితచంపు | నవనీతకవి | కు. ౪ వా. ౩౯౨౫ ఈ |
| వీరభద్రవిజయచంపు | ఏకామ్రదీక్షితులు | ,, ౧ వా. ౪౧౯ బి |
| బృందావనవినోదచంపు | రుద్రన్యాయవాచస్పతి | సరస్వతీభవన బనారసు |
| శివచరిత్రచంపు | కవివాదిశేఖరుడు | కు. ౪. వా. ౪౧౪౬. బి |
| శ్రీనివాసచంపు | శ్రీనివాసుడు | తం. నం. ౪౧౬౧ |
| శ్రీనివాసవిలాసచంపు | వేంకటేశకవి | కావ్యమాలాముద్రితము |
| శ్రీనివాసమునియాత్రావిలాసచంపు | గోవిందదాసుడు | కు. ౩ వా. ౨౧౨౪ ఏ |
| సాత్రాజితీపరిణయచంపు | గాంగేయకవి | కు. ౩ వా. ౧౯౬౭ ఏ |
| సాహిత్యతరంగిణీచంపు | కృష్ణుడు | కావ్యమాలాముద్రితము |
| సుభద్రాహరణచంపు | తెలియదు | కు. ౩ వా. ౨౪౫౫ ఏ |

## సంకేతాక్షరములు

తం—డిస్క్రిప్టివు కేటలాగు ఆఫ్ సంస్కృత మానిస్క్రిప్టుస్ ఇం ది సరస్వతిమహాలు లయిబ్రరి, తంజావూరు.

పిటర్సన్—డిటైల్డు రిపోర్టు ఆఫ్ ఆపరేషన్ ఇన్ సర్చ్ ఆఫ్ సంస్కృత మానిస్క్రిప్టుస్ బై ప్రొఫెసరు పీటర్సన్, బొంబాయి.

ఇం—ఇండియా ఆఫీసు కేటలాగ్.

బ—బర్నలు తంజావూరు కేటలాగ్.

బం—డిస్క్రిప్టివ్ కేట్లాగు ఆఫ్ సంస్కృత అండు ప్రాకృత మానిస్క్రిప్టుస్ ఇం ది లయిబ్రరి ఆఫ్ ది బొంబాయి బ్రాంచి రాయల్ ఏషియాటిక సొసైటి.

కు—ట్రయన్నియల్ కేట్లాగు ఆఫ్ మానిస్క్రిప్టుస్ సంస్కృత లయిబ్రరి, మదరాసు. కుప్పుస్వామి శాస్త్రి, ఎమ్. ఏ.,

హ్ర—డిస్క్రిప్టివు కేట్లాగు ఆఫ్ సంస్కృత మానిస్క్రిప్టుస్ ఇన్ సంస్కృత కలకత్తాకాలేజి. హృషీకేశశాస్త్రి.

భం—లిస్టు ఆఫ్ సంస్కృత మానిస్క్రిప్టుస్ ప్రైవేటు లయిబ్రరి ఇంది బొంబాయి ప్రెసిడెంసి ఆఫ్ ఆర్. జి. భండార్కరు.

ఆఫ్రెక్ట్—లిస్టు ఆఫ్ సంస్కృత మానిస్క్రిప్టుస్ ఇన్ ప్రైవేటు లయిబ్రరీసు సదరన్ ఇండియా బై ఆఫ్రెక్ట్.

రైస్—కేట్లాగు ఆఫ్ సంస్కృతమానిస్క్రిప్టుస్ ఇన్ మైసూర్ అండు కూర్గు.

అ—కేట్లాగ్ ఆఫ్ సంస్కృత మానిస్క్రిప్టుస్ ఇన్ ప్రైవేటు లయిబ్రరీస్ ఆఫ్ నార్తు వెస్టు ప్రావింసు.

మిత్ర—నోటీసు ఆఫ్ సంస్కృత మానిస్క్రిప్టుస బై రాజేంద్రలాల మిత్ర.

---

# విస్మృతజీవవర్గము

గూడూరు వెంకటాచలం

ఎప్పుడో జ్ఞానోదయం అయింది ప్రపంచానికి. ప్రకృతినిర్మాణంలోనే ఇది నిబిడీకృతమయియుంది. ఈజ్ఞానమే 'అహం' అనే స్మృతికి ఆధారభూతము. సూక్ష్మాతిసూక్ష్మజీవులలోకూడ ఈస్మృతి ఏదో విధంగా ద్యోతకమవుతుంది. చర్మచక్షువుకు గోచరంగాని జీవులలోకూడ వానికి గల్గే బాహ్యావస్థల పరివర్తనలవలన ఆంతరంగికంగా భావోత్పత్తి అవుతుంది. జగదీశచంద్రబోసుగారు, మనము జడము లనుకునే వృక్షాల్లోకూడ నాని బాహ్యాచలనానికి ఒక ఆంతరికమైన మానసికపరివర్తన ఉంటుం దని పరికరం ద్వారా స్పష్టపరిచారు. సాయంసమయమందలి సముద్రతరంగాల్లో, ప్రత్యూషకాలమందలి బంగారపు టెండలో, శరద్రాత్రులందలి శుభ్రజ్యోత్స్నలో ఆహ్లాదానికి కారణం ప్రకృతిలో గుప్తమైయున్న ఈజ్ఞానసంచలనమే.

ఈజ్ఞానమే మానవునిలో అత్యుత్తమ స్థానాన్నాక్రమించి అతనిలో ఒక తార్కికదృష్టి, ఒకపరిశోధనాతృష్ణ కలుగచేసింది. తదేవా, మానవుడు అనాదినుండియు ప్రకృతిశాస్త్రజ్ఞుడయ్యాడు. ప్రకృతిని తీవ్రంగా పరిశీలించాడు. పరిశోధనలో పరవశు డయ్యాడు. ప్రకృతిచిత్రవిచిత్రాలను గ్రీకులు తమ దేవాలయాల్లోను, రాజమందిరాల్లోను సేకరించారు. హెలీనాసామ్రాజ్యంలో మొట్టమొదట జీవాలను చంపి పరిశోధన సల్పారు. భారతదేశంకూడ ఈపరిశోధనల్లో కొంత ప్రాముఖ్యత వహించింది. మనదేశంలో పరిశోధనకి ప్రాతిపదికం సల్పింది అశోకచక్రవర్తి. ఆయహింసాతత్పరుడు జీవవిచ్ఛేదనతో పరిశోధన పాపమన్నాడు. అనేకవిధములయిన ఉద్భిజ్జముల సేకరించి వాతావరణపరిస్థితులకు అవి పొందు అనుకరణములను పరిశీలించాడు. కాని పరిశోధనికి ఆయనే ఆఖరుచక్రవర్తి. తరువాత భారతదేశములో శాస్త్రజ్ఞులు తర్కమున, మీమాంసలో మునిగిపోయి, ప్రాకృతిక, భౌతికపరిశోధనలకు తిలాంజలులిచ్చారు. ఇక్కడే ప్రాచ్యపాశ్చాత్యులు వివిధపథాల ననుగమించారు. తత్ఫలితమే ఆధునిక ప్రాచీప్రతీచీ వైవిధ్యవిజ్ఞానవీచికలు !!!

## పృథ్వీ నిర్మాణము

ప్రకృతి పాఠశాలలో పృథ్వి ప్రధాన పాఠ్యగ్రంథము. ఆ గ్రంథ నిర్మాణానికి పదకొండువేల లక్షల సంవత్సరాలు పట్టింది. పుటతర్వాత పుటచొప్పున 14 మైళ్ల మందమున నున్నవి ఈ గ్రంథములోని పుటలు. ఇంత విస్తృత గ్రంథము దురూహ్యంగా ఉంటుంది. ఈ పృథ్వీపటలముల నేర్పర్చుటకు సముద్రములు, జలవాహినులు ప్రధానపాత్ర వహించాయి. ప్రతి జలవాహినియు కొంతమట్టిని తీసుకొనివచ్చి పోయును. మరియొకచోట భూభాగమును తొల్చివేయును. అనేక సముద్ర నదీతీరములందు పూర్వము జలమున్న స్థలములకును, ప్రస్తుతమున్న స్థలములకును ఎంతయో భేదముండును. ఒకప్పుడు భూగర్భమునందలి అగ్నిపర్వత విచ్ఛిద్రముతో అంతయు తారుమారుచేసి ఏమియు లేనిచోట సముద్రము కల్పించుచుండును. అప్పుడు కోటానుకోట్ల జీవరాసులు సముద్రములో నశించిపోవుచుండును. పూర్వ మొకప్పుడు మన ఆశియాఖండమును, దక్షిణ ఆఫ్రికా ఖండమును కలిసియుండెడివి. తరువాత మధ్యనున్న భూఖండము సముద్రములోనికి పోయినది. ఇటులనే కొండలు కుంగిపోవుట, పైకుబుకుట తటస్థించుచుండును. గత క్వెట్టా భూకంపమువలన హిమాలయ పర్వతపంక్తులందు గల్గిన మార్పులు చూచిన ఆశ్చర్యము జనించును. ఈ పరివర్తనములు గాంచిన ఆధునిక భూఖండములు, సరిహద్దులు శాశ్వతములా అనిపించును. పరిశోధకుడైన ప్రకృతిశాస్త్రజ్ఞుడు తాత్కాలికములైన సరిహద్దులనుచూచి "నాదేశము" అని మురియు దేశభక్తుని చూచి నవ్వుతాడు.

## భూమి వయస్సు

పటలము పటలముగా పృథ్వియందు అనాదియందు అట్టడుగుపటలమును, తదుపరి తరువాత పటలములును ఏర్పడి యుండవలయును. ఈ నిర్మాణమునకు ప్రకృతి కాలముతో కలసి మహాయజ్ఞ మొనర్చింది. ౧౮వ శతాబ్దాంతమువరకును భూగర్భపరిశోధనకు ఎవరును గడింగలేదు. ౧౮౧౫ లో విలియమ్ స్మిత్తు భూగర్భ పరిశోధన సల్పినాడు. ఆయన భూపటలములన్నిటిని వాని ద్రవ్యప్రకృతినిబట్టి విభజించాడు.

౧. సీమసున్నపుపొరలు, ౨. సున్నపురాయిపొరలు, ౩. ఇసుకరాయిపొరలు, ౪. బంకమట్టిపొరలు. ఆయనపరిశోధనలందు ఈ పొరలన్నియు ఎక్కడ యున్నప్పటికిని ఒకేవరుస ఒకేవిధానమందు ఉన్నవి. దీనినిబట్టియే అవి ఏర్పడినకాలమును నిర్ణయించుటకు వీలులేదు. ఆ పటలములందు ఆకాలపు జీవముల శిల్యములు గాని, లేక వీనిచే ముద్రితమైన చిహ్నములు (ప్రకృతి శాసనములు)గాని ఎంచుచుండును. పటలగర్భమునందలి ధాతుసముదాయముగూడ మిగుల తోడ్పడును. కాబట్టి పృథ్వివయస్సు నిర్ణయించుటకు—

౧. భూగర్భమునందు ఆయాపటలము లున్నలోతు.

౨. ఆ పటలమునందు శిథిలములైన జీవులు.

౩. పటలమునందలి ధాతుసముదాయము.

ఈ నిదర్శనములచే భూతలము లన్నిటి వయస్సును నిర్ణయించిరి. ప్రాచీన భూగర్భ పరిశోధకులు తమ జీవితమంతయు వినియోగించిరి. మన దేశమందు కూడ ఒక భూగర్భ పరిశోధకశాఖ (Department of Geological survey of India) యున్నది. వీరు మన దేశమందు ప్రతి అంగుళమును పరిశోధించిరి. ఇట్టి పరిశోధనలవలననే మన దేశమందలి వాయవ్యభాగమంతయు కొన్నిలక్షల సంవత్సరములక్రిందట హిమాచ్ఛాదితమై యుండెనని తెలియుచున్నది. అందుకు నిదర్శనముగా హిమకాలమునందు నాశనమైన జీవుల శిథిలములు దొరికినవి. పూర్వోక్త నిదర్శనముల ననుసరించి భూమి వయస్సును అయిదు (ఇప్పటివరకు) యుగములుగను, వానిని మరల శకములుగను విభజించిరి.

౧. ఆర్కియోజోయిక్ (ప్రథమ) యుగము:—ఈ యుగమునందు జీవము ప్రారంభమయినది.

౨. ప్రోటేరియోజోయిక్ (ద్వితీయ) యుగము:- ఈ యుగములో అనేక ప్రాథమిక జీవులు వచ్చినవి. పురుగులుకూడ అప్పుడే ప్రారంభమయినవి.

౩. పేలియోజోయిక్ (తృతీయ) యుగము:— ఈయుగమును మరల ఆరుశకములుగా విభజించినారు. (అ) కేంబ్రియన్ శకము. ఈశకమునందు జీవ మింకను భూమిపై కెగబ్రాకలేదు. (ఆ) ఆర్డోవిశన్ శకములో వెన్నెముకగల జంతువులు ప్రారంభ మయినవి. (ఇ) సిలూరియన్ శకములో చేపలు భూమిపైకి ఉద్భిజ్జములు వచ్చినవి. (ఈ) డెవోనియన్ శకము. (ఉ) కార్బనిఫెరస్ శకము. ఈశకములో భూచరజీవములు వృద్ధి పొందినవి. (ఊ) పెర్మియన్ శకము. దీనిలో సరీసృపములు వచ్చినవి.

౪. మీసోజోయిక్ (చతుర్థ) యుగము :— దీనిని మరల మూడుశకములుగా విభజించియున్నారు. (౧) ట్రయాసిక్. (౨) జురాసిక్. (౩) క్రెటాసియక్ శకము. ఈయుగమునందు స్థూలపరిమాణముగల ఉద్భిజ్జములు, జంతువులు పృథ్వియందు వ్యాపించినవి.

౫. సీనోజోయిక్ (పంచమ) యుగము :— ఇదియే ఆధునికయుగము. దీనిని మరల ఆరుశకములుగా విభజించియున్నారు. (అ) ఇయోసీనుశకము. (ఆ) ఒలిగోసీన్. (ఇ) మయోసీను (ఈ) ప్లియోసీను. (ఉ) ప్లెస్టోసీను : ఈశకము పృథ్వి చాలాభాగము హిమాచ్ఛాదితమయింది. (ఊ) ఆధునికశకము.

"మానవవికాసము" (ఏప్రెలు నెల భారతి)నందు అనూహ్యమైన విశ్వవయోవాహినియందు క్షణమాత్రమైన పృథ్వివయస్సు తెలుప సాధ్యమైనదికాదు. ఇందులో గన్పరిచిన పటమునందు మొదటి పట్టికయందు భూపటలములబట్టియు, వాని వయస్సునుబట్టియు ఆపటలము లేర్పడుటకు బట్టిన కాలము చిత్రింపబడినది,

## ౧. పృథ్వీనిర్మాణములో పటలములు ఏర్పడిన కాలము

| | | | | |
|---|---|---|---|---|
| సీనోజోయిక్ యుగము | | మానవుడు | ప్లయోసీను | |
| | 500 లక్షలు | | మయోసీను | |
| మీసోజోయిక్ యుగము | | | ఒలిగోసీను | |
| | | పక్షులు | సీనోజోయిక్ ఇయోసీను | |
| పేలియోజోయిక్ యుగము | | శిశుపోషణ గల మృగము | క్రెటాసియస్ | |
| | 5000 లక్షలు సంవత్సరములు | ఫలపుష్ప వృక్షములు | జురాసిక్ | |
| ప్రోటెరియోజోయిక్ యుగము | | క్షీరయుత జంతువులు | మీసోజోయిక్ ట్రయాసిక్ | 1750 లక్షలు |
| | 11000 లక్షలు సంవత్సరము | ఖగములు | పెర్మియన్ | |
| | | సరీసృపములు జలచర, భూచరములు | కార్బనిఫెరస్ | |
| ఆర్కియోజోయిక్ యుగము 1 | | కీటకములు భూమిపై ఉద్భిజ్జవర్గము | డెవోనియన్ | |
| | | మత్స్యవర్గము | సిలూరియన్ | |
| | | వెన్నెముక గల జంతువులు | ఆర్డోవిసికన్ | |
| | | త్రిభాగ జంతువులు | కేంబ్రియన్ శకము | 500 వేల లక్షలు |
| | | | పేలియోజోయిక్ శకములు | |

| | |
|---|---|
| ప్లైస్టోసీను | 5 లక్షలు |
| ప్లయోసీను 13000 అడుగులు | 100 లక్షలు |
| మూడవశకము పటలము 9000 అడుగులు | 175 లక్షలు |
| రెండవశకము పటలము 12000 అడుగులు | 300 లక్షలు |
| ఆధునిక యుగములో మొదటిశకము పటలము 23000 అడుగుల లోతున నున్నది. | 500 లక్షలు |

రెండవపట్టికయందు ఆఖరుమూడుయుగములు, వానిశకములు, కాలము తెలుపబడినది. మూడవపట్టికయందు ఆధునికయుగములందలి శకములు, ఆయాపటలములు ఉండిన లోతుగూడ వివరింపబడినది.

అషర్ అను క్రైస్తవమతాచార్యుడు సృష్టి క్రీ. పూ. ౪౦౦౪ సంవత్సరముల క్రిందట (ఆయన గంటలు, నిముషములు కూడ నిచ్చియున్నాడు.) ప్రారంభ మయ్యెనని విశదీకరించెను. క్రైస్తవులందు ఇప్పటికిని ఇదినమ్మువార లనేకు లున్నారు. ఈవిషయమునందు భారతీయులు నిదర్శనసహితముగ కాకపోయినను కొంచెమయినను ఊహింపగల్గిరి. యుగములు, పాదములు నిర్ణయింపగల్గుట చాలా గౌరవింపదగిన విషయము. అరవిందఘోషుగారు తమ "కాళిదాస" అను పుస్తకమునందు ఆయాయుగపురాణములనుండి కవుల గైకొని నాగరికతావికాసమును చక్కగా విశదీకరించిరి. నేటి భారతీయులుగూడ ఆధునికయుగపరిశోధనలతో అడుగుపెట్టిన తమ ప్రాచీనత్వాన్ని గౌరవించినవా రగుదురు.

## విస్మృతజీవవర్గము

జీవము సాధారణముగా తానుండు పరిస్థితుల కనుకూలముగా జీవించుటకు ప్రయత్నించుచుండును. ప్రకృతితో సామరస్యము బొందగల్గిన జీవులే చివరవరకు జీవింపగల్గును. దీనికి నేడు మానవజాతులయందలి యుద్ధములే తార్కాణముగా గైకొనవచ్చును. ఆస్ట్రేలియాయందలి ఆదిమవాసులు ఆధునికుల హత్యాపరికరముల నిర్మింపజాలక చనిపోయిరి. ఐరోపా మహాసంగ్రామమునందు ఆంగ్లేయులు జర్మనులవలె విషవాయువులను, టాంకులను నుపయోగింపనంతకాలము జయము మిగుల సందేహాస్పదముగా నుండెను. అటులనే మన దేశమందు క్షామము గల్గినప్పుడెల్లప్పుడును స్త్రీశిశువులకంటె మగశిశువులు ఎక్కువమంది జన్మింతురు.

ప్రకృతిప్రయోగశాలలో జీవము అనేక పరివర్తనలు పొందింది. అణువులోనుంచి అత్యంత స్థూల స్వరూపాన్ని పొందింది. మరల స్థూలములో నుంచి సూక్ష్మస్వరూపమగుచున్నది. ఈ మాధ్యమికావస్థ లన్నియు శిథిలమయిపోయినవి. వాని చిహ్నములే ఒకప్పుడు ఆ జీవవర్గము ఉండినదనుటకు ఆధారము. ఆ చిహ్నములు దొరకుట బహు దుర్లభము. జంతువుకాని వృక్షముకాని జీవించియున్నపుడు ఏ మట్టిలోనో, కొండచరియలలోనో ఇరుకుకొని చనిపోయియుండును. వాని శిథిలములచే గాని, వాని శరీర స్పర్శచే ముద్రితములయిన శాసనములచేగాని విస్మృతజీవవర్గము నూహింపగలము.

మనము మామూలుగా వాడు సాంబ్రాణియందు అనేక ప్రాచీనమైన క్రిమికీటకములు దొరుకుచుండును. సైబీరియాయందు పెద్దపెద్ద మృగము లనేకములు భూమియందు పాతుకపోయి దొరికినవి. కాలిఫోర్నియాలో ఒక నీటిదొరవునందు తారు ఉండుటచే అందులో నీరుత్రాగుటకు పోయిన కొమ్ముపులులు మున్నగునవి చనిపోయినవి. ఈమధ్య ఆదొరవు త్రవ్వుచుండగా ఆ జంతువుల శల్యపంజరములు దొరికినవి. ఇటులనే బెల్జియములో ఒక గుహయందు ౨౯ సరీసృపములు చనిపోయినవి. ఆర్కియోప్టేరిక్సు అను ఒక సరీసృపఖగము సున్నపురాతిపై బడి చనిపోయినది. అపుడు దాని చే సున్నపురాయిమీద ఏర్పడిన ముద్రయే ఆ ప్రాచీన సరీసృప ఖగ అస్తిత్వానికి ఆధారము.

విస్మృత జీవవర్గమును రెండువిధములుగా విభజింపవచ్చును.

౧. విస్మృత జంతువర్గము.

౨. విస్మృత ఉద్భిజ్జవర్గము.

విస్మృత జంతువర్గమును వాని వికాస ప్రాముఖ్యమునుబట్టియు, ప్రాచీనత్వమునుబట్టియు అనేక విభజనలొనరించిరి.

## విస్మృతజంతువర్గము

ఆర్కియోజోయిక్ యుగమునందు జీవము ప్రారంభమయినను ఆజీవము శిథిలములు ఏమియు గానిపించుటకు అవకాశము లేకపోయినది. ఆయుగమునందు అక్కడక్కడ పర్వతములు ఏర్పడినవి. కెనడా, గ్రీసు




౨-వ పటము

## విస్మృతజీవవర్గసంక్షిప్త ఇతిహాసము

[ఇది పట్టికలక్రింద విభజింపబడియున్నది. ఒక్కొక్కపట్టిక ఒక్కొక్క యుగమునందలి శకమును తెల్పును. దీనిలో ఆయాశకములందు వచ్చిన జీవవర్గము తెలుపబడియున్నది. (౧) సాలీడులు, (౨) తేళ్లు, (3) సముద్రవృశ్చికములు, (౪) పీతలు, (౫) కీటకములు, (౬) త్రిభాగజంతువులు, (౮) రొయ్యలు, (౧౮) ప్రాచీనములగు వెన్నెముక గల జంతువులు, (౧౯) చేపలు, (౨౦) జలచర భూచరములు, (౨౧) సరీసృపములు, (౨౨) ఖగములు, (౨౩) క్షీరయుతజంతువులు, (౨౪) మొట్టమొదట పృథ్వి పైకి వచ్చిన ఉద్భిజ్జములు, (౨౬) ధోరస్, (3౪) క్లబుమాసెలు.]

లాండుదేశములందు అనేక ధాతువులతో గూడిన ఆ పర్వతశిఖిలములు మాత్రము గాన్పించుచున్నవి.

తరువాత అనగా పదివేల లక్షల సంవత్సరముల క్రిందట వచ్చిన ప్రొటెరొజోయిక్ యుగము చాలా కాల ముండలేదు. ఈయుగమునందు జీవము స్థిరస్థావర మొనరించుకొనుటకు మిగుల ప్రయత్నించినది. ఈయుగమునందు లోహయౌగికములు దొరికినవి. నేడు సంయుక్తరాష్ట్రములందు దొరుకు ఇనుమునందు చాలాభాగము ఈయుగమునందు ఏర్పడినదే. ఈద్వితీయయుగమునందు మొదటిసారి హిమము ప్రపంచమునంత నావరించినది. భూమి చల్లబడుటకు ఈహిమము మిగుల దోడ్పడినది.

పేలియోజోయిక్ యుగము (తృతీయ)— కేంబ్రియన్

### (అ) శకము

త్రిభాగజంతువులు— పైశకము ప్రారంభమగు సరికి ఇప్పటివరకు భూమికి గడిచినవయస్సులో సగము చెల్లిపోయినది. అయినను ఈయుగపు జంతువుల శిథిలము లనేకములు దొరికినవి. "అ" శకములో భూచరములుగాని, వెన్నెముకగల జంతువులుగాని లేవు. చివరకు నత్తగుల్లలు, కీటకములుగూడ లేవు. ఆజంతువులు రంగులనుచూడగలవు; శబ్దమును వినగలవు. అవే త్రిభాగ

వృద్ధిపొందినవి. తరువాతవచ్చిన కార్బనిఫెరసు శకమునందు ఇవన్నియు భూమిలోనికి బోవ మొదలిడినవి. ఇటులనే పెద్దపెద్ద అడవులన్నియు భూమిలోనికి బోయినవి. పిదప భూతలమంతయు సర్దుకొని పోయెడిది. ఇటులనే ఉద్భిజ్జవర్గము పెరుగుట, భూమిలోనికి బోవుట అనేక పర్యాయములు జరిగెనది. ఉద్భిజ్జములు భూమియందు సుమారు పదివేల అడుగుల లోతువరకును బోయినవి. అప్పుడు భూమియందలి ఉష్ణాధిక్యముచే బొగ్గుగా మారిపోయినవి. ఇదివరలో పెద్ద అడవులున్న చోట్ల బొగ్గుగను లున్నవి.

ప్రపంచమునందు ఏడులక్షల కోట్ల టన్నుల బొగ్గు ఉన్నదని కెనడా భూగర్భ పరిశోధక శాఖవారు నిర్ణయించిరి. అనగా వాయుమండలమందు నున్న బొగ్గుకు నాలుగురెట్లుండును. ఇంతబొగ్గు ఏర్పడుటకు ఎన్నియోవందల లక్షల సంవత్సరములు పట్టినది. కాని దీనిని మిగుల తొందరగా ఖర్చుపెట్టుచున్నాము. ౧౯౦౫ సంగు ౯ వేల లక్షల టన్నుల బొగ్గు ఖర్చుపెట్టిన ౧౯౧౦ లో ౧౧౫౦౦ లక్షల టన్నులు, ౧౯౨౩ లో ౧౩౦౦౦ లక్షల టన్నుల బొగ్గు ఖర్చుఅయినది. ఈ విధముగా ఖర్చుపెట్టిన యెడల భూగర్భములోని బొగ్గు అయిదువందల సంవత్సరములకంటె ఎక్కువ రాదుండదు. అమెరికాలో ౨౦౦౦ సంవత్సరములవరకు వచ్చును. ప్రకృతి ఎన్నియో లక్షల సంవత్సరములలో కూడబెట్టిన ధనము విచ్చలవిడిగా ఖర్చుపెట్టుచున్నాము.

## వెన్నుముకగలజంతువర్గము-పృథ్వీప్రవేశము

ఉద్భిజ్జవర్గము భూమిపై ప్రవేశించి జంతువర్గమునకు దారితీసినది. దానిచే భూమి ఆహారసమన్వితమయినది. జంతువులు జలమునందుండుటకు విపరీత పరిస్థితులు సంభవించినవి. జలాశయములు ఎండిపోయి ప్రాణవాయువు మిగుల తక్కువయ్యెను. దీనితో జంతువర్గము భూమిపైకి వచ్చుట అత్యవసరమయ్యెను. భూమిపై జీవించుటకు ముఖ్యముగా రెండవయవములుండవలెను- (౧) ఊపిరితిత్తులు, (౨) కాళ్లు.

ఐరోపామహాసంగ్రామము నాగరికతను కంపిసంవత్సరములు ముందునకు త్రోసినది. అటులనే అప్పుడుగల్గిన జలోత్పాతము జంతువికాసమును తీవ్రగతి నొసరించినది. ఊపిరితిత్తులకు బదులుగా మొప్పలలో వాయునాళమును, గాలితిత్తియు ఏర్పడి యుండును. మొట్టమొదట నేడు మనము చూచు "షార్కు" (Shark) అను చేపవంశము భూమిపై ప్రవేశించెను. వీని రెక్కలు కాళ్లుగా మారిపోయినవి.

ఆజంతువులే నేటికప్పలుగా మారిపోయెను. ఆ కాలమునే ఆస్ట్రియోపిడస్, బురద మిడతలు, పిరిగోఫైలామస్ మున్నగునవి జలచరభూచర జీవిత మారంభము కొనెను. ఇవన్నియు మాంసాహారులు. ఇవి కూడ సముద్రవృశ్చికములు, చేపలు మున్నగువానిని తిని జీవించుచుండెడివి. కప్పలవలె గ్రుడ్లను నీటియందే పెట్టి మామూలు పరిణామావస్థల నన్నిటిని బొందుచుండెడివి. కాని వీని వెన్నెముక అంత గట్టిది కాకపోవుటచేత కప్పలవలె గంతులు వేయజాలకపోయెడివి. వీని నోరు మొసళ్ల నోరువలె పొడుగుగా నుండెడిది. ఆహారముకుగూడ మొసళ్లవలెనే పైకొనెడివి.

మన మొకసారి కాలవాహిని కెదురీది తృతీయయుగములోని కార్బనిఫెరస్ శకములోనికి బోగలిగెనేని అక్కడ పృథ్వి బీభత్సదృశ్యము గోచరమవుతుంది. నేడు మనము చూచు ఫలపుష్పసమన్వితములై పృథ్విని శోభాయుత మొనర్చు తరులతాకుంజములు లేవు. ప్రాతఃసంధ్యాకాలములందు సూరితము లొనర్చుచు ప్రకృతిని పాటలతో నింపే పక్షులు లేవు. వసంతఋతువు నందలి కిసలయములు, పై మంతమందలి పండుటాకులు లేవు. ఋతుపరివర్తనము ప్రకృతి ఇంకా రూపొందించనే లేదు. ప్రత్యేకవ్యక్తిత్వముతో ప్రపంచసౌఖ్య సంపదకాస్పదములైన క్షీరయుత పశుస్వాస్థ్యులు లేవు. ఆ కాలములో ప్రకృతి నిస్తబ్ధగంభీరత వహించినది. నేడు మనము అందమునకై తొట్లయందు దుంచుకొను ఫెరను మొక్కలు మహావృక్షములై ఫలపుష్ప విహీనములై పెద్దగింజలలో బీభత్సదృశ్యము నొసంగుచుండెను. అప్పుడప్పుడు వానిమధ్య నీచరవముతో రెండుమూడడుగుల పొడవుగల బొద్దింకలు, నాల్గు అయిదు అడుగుల నిడివిగల వృశ్చికములు పోవుచుండెడివి. ఇంతలో వీ

చ్చగా పెరుగగలవు. అనాదియందు సరీసృపములు మిగుల సోమరిపోతులై పురుగులను, చేపలను తినుచు అప్పటి జలచర భూచరములవలె ఉండెడివి. కాని పృథ్వియందు వచ్చిన పరివర్తనలు, పర్వతనిర్మాణము మున్నగునవి వీని ఔన్నత్యమునకు మిగుల తోడ్పడినవి. పెర్మియన్ శకము చివరకి సరీసృపములలో అనేకులు శాకాహారు లయినవి. భూమియందు శాకాహారము విస్తారముగా నుండుటచే ఇది మిగుల అనుకూలముగ గన్పట్టినది. మనపూర్వులు శాకాహారులే యనివాదించు వారికి ఇదియొక ప్రబలనిదర్శనము. సరీసృపములలో మొట్టమొదటివి "కాటిలోసారులు." ఇవి పక్షులకు పసువులకు మనకుగూడ పూర్వులు. తరువాత "ఏల్జినియా" అను సరీసృపములు వచ్చినవి. వీనితలనిండా పెద్దపెద్దముల్లు ఉండెడివి. పిదప "పారిఘాసారులు" భూమిపైనుండి పొట్టను కాళ్ల ఆధారమున లేవనెత్త గల్గినవి. క్రమ్మరిగ "థెరియోడాంటులు" అను సరీసృపములు వచ్చినవి. పండ్లయందు కోరలు, దంతములు, కొరుకుడుపండ్లు అను విభజనలు వీనియందే ఏర్పడినవి. వీనితోకకూడ నేటిజంతువుల తోకవలెనే మిగుల చిన్నదిగా నుండెడిది. మెదడు మిగుల చిన్నది. కుక్క జాతిజంతువులన్నిటికి ఇట్టి పూర్వుని నుండియే ప్రారంభమయియుండవచ్చును. వీనినుండి "డైకినోడంటులు" వచ్చినవి. వీని యందు కోరలుతప్ప మిగిలిన పండ్లన్నియు పోయినవి. వీని పరిమాణము చిన్న ఎలుక నుండి పెద్దపులివరకు నుండెడిది. కొన్ని ఎడారులందును, శీత ప్రదేశములందును ఉండెడివి. "పెలికోసరులు" అను సరీసృపములు దానినుండి వచ్చినవి. వీని వీపు మీద అనుగు ఎత్తైన ముండ్లపొర యుండెడిది. పూర్వోక్త సరీసృపము తృతీయ యుగమందుండి చతుర్థయుగము ప్రథమ శకమునాటికి నశించిపోయినవి. సరీసృప ములు చతుర్థయుగము జూరాసిక్, ట్రయాసి యస్ శకములందు ఉచ్చదశనందినవి. ఆశకమునందే ఎగురు సరీసృపములు జన్మించినవి. అనగా ఖగరూప సరీసృపము నేటిపక్షులకంటె ౨౦౦ లక్షల ఏళ్ల ముందవతరించినది.

పునర్జలప్రవేశము—సరీసృప వికాసము నందు అత్యద్భుతవిషయ మొకటి జరిగినది. చతుర్థయుగ ప్రథమశకమునందు కొన్ని సరీసృపములు జలమునందు ప్రవేశించినవి. భూమిమీద వసించుటకు ఎక్కువబలము, మందమైనచర్మము, శీతోష్ణములకు తాళగల శక్తి కావలెను. భూమిమీదకివచ్చిన సరీసృపములకు ఇవన్నియు అలవడెను. అందు నీటియందలి జంతువులతో పోరాడి జయించుటకు మంచి యవకాశము గల్గెను. ఈ యవకాశము చూచుకొని అవి నీటిలోనికి బోయినవి. వీనిలో ఇక్థియోసారులు, మోసాసారులు మొదటివి. ఇవి చతుర్థ యుగములో జూరాసిక్ శకమునందు మెండుగా నుండెను. ఇక్థియోసారుకు డాల్ఫినుముక్కువంటి పొడుగైన ముక్కు ఉండెను. చేపలను తినుట కనుకూలముగా పండ్లుండెను. మొదట భూమిమీద చరించుటకు అనుకూలముగా నుండిన కాళ్లు నీటిలో ఈదుట కనుకూలమైన తెడ్లవలె నుపయోగించెను. ఇవి జలచర జీవితము ప్రారంభించినప్పటినుండియు భూమిమీద గ్రుడ్లు పెట్ట



౪. [మిసోసోజోయిక్ యుగమున భూమినుండి నీటియందు ప్రవేశించిన సరీసృపములు. ఎడమప్రక్కనున్నది యొకసముద్రమకరము. ప్రక్కనున్నది మోసాసారు. తరువాత ఇక్థియోసారులున్నవి. క్రిందను ప్లిసియోసారులు, సముద్రసర్ప మున్నది.]

నవసరము లేకపోయినది. పిల్లలనుకూడ సముద్రమునందే పెంచసాగినవి. వీని ఉపరశిథిలములు తమపిల్లలను తామే తినుచున్నటుల తెల్పుచున్నవి.

తరువాత ప్లెసియోసారు లనునవి ప్రాముఖ్యమునకు వచ్చినవి. ఇవి 30 అడుగులపొడుగున నుండెడివి. వీని నాలుగుకాళ్లును తెడ్లవలె నుపయోగించుచుండెడివి. వీనిమెడ చాలా పొడుగుగా నుండెడిది. ఇవికూడ ఇక్థియోసారులవలె తమపిల్లలను తామే తినుచుండెడివి. వీని శిథిలములు అక్కడక్కడ దొరుకుచున్నవి. మొసళ్లు, తాబేళ్లుకూడ ఇట్లనే జలగిత

## ఆకాశగమనము

నీటియందు జంతువులు నాలుగుప్రక్కలకు సంచరించుచుండెడివి. భూమిమీద రెండుదిక్కులుగా



౯. [ఆకాశగమనమునకై ఖరీ. వాయుచ్ఛత్రరీతిని క్రిందికి దిగుచుండుట గాననగును. రెండుకాళ్లకును రెక్కలుకూడ నున్నవి.]

తప్ప పైకి క్రిందికి పోవుటకు వీలులేదు. భూతలము పైన వాయుమహాసముద్ర మున్నది. ఈ మహాసముద్ర మునందీదుటకు జలమునందీదు అవయవములు పనికి రావు. అయినను జంతువులు ఎగురుటకు తీవ్రప్రయత్నములు చేసినవి. చేపలు, కప్పలు, పురుగులు, ఏబది అగువడి గజము లెగురుచుండెడివి. మానవుడు సహజముగా ఏమియు చేయజాలకపోయినను యంత్రముల నిర్మించుచున్నాడు. ఇవి ఎగురుటకు చేసిన ప్రయత్నములను అనేకవిధములుగా చెప్పవచ్చును. మొదటలో ఇవి ఆధునికులు వాయుచ్ఛత్రమును విమానములనుండి దిగుటకు (Parachute) నుపయోగించినటుల ఎగురుచుండెడివి. అంగులకుగాను అతిశీఘ్రముగా వ్యాకోచ, సంకోచములను బొందు కండరము లుండవలెను. ముందరకాళ్లను ప్రక్కలకు చాపినపుడు వానిమధ్య చర్మమునుండి వాయుచ్ఛత్రమువలె నుపయోగించెడిది. తరువాత ఈ చర్మము బాగుగా వెడల్పయినది. అప్పుడు తోక చుక్కానివలె నుండినది. మొదటలో ముందరకాళ్లు వెనుకకాళ్లుకూడ రెక్కలవలె నుపయోగించినవి. తరువాత ముందరికాళ్లే బలిష్ఠమయిన రెక్కలవలె నుపయోగించుటచే పక్షులకు కాళ్ళను ఇష్టమువచ్చినట్లుపయోగించుటకు వీలైనది. ఇదియే విహగములు జయించుటకు మూలకారణము.

పక్షులకు రెక్కలు ఎట్లు వచ్చినదియు పూర్తిగా పరిశోధించుటకు ఇంకను సరియైన శిథిలములు దొరకలేదు. ఈకలు రెక్కలతోపాటు వృద్ధి పొందుచు వచ్చినటుల గనబడును. ఈకలు జురాసిక్ శకము అంత్యమందు వచ్చినటుల గన్పట్టుచున్నవి. తరువాత క్రిటేసియస్ శకమునందు శీతలము వృద్ధియగుచుండుటచే ఉష్ణాధిక్యత నుంచుటకుగాను ఈకలు బాగుగా పెరిగినవి. ఈకలు వచ్చినప్పటినుండి యెగురుట మిగుల సులభమయ్యెను. వీని నెట్లుపయోగించినదియు, దానివలన పక్షు లెట్లు ప్రారంభమైనదియు సిద్ధాంతములుగూర్చి రెండభిప్రాయము లున్నవి. ౧. కొందరు "డైనోసారు"లను సరీసృపములయందు ముంకాళ్లు మిగుల చిన్నవియు శరీరముఖాకృతి నుండినవని చెప్పుదురు. (౨) మరికొందరు ముందరికాళ్లు వెడల్పుగను తెడ్లవలె నుపయోగించుటచే వచ్చినదందురు. దీనికి నిదర్శనముగా "ఆర్కియోప్టెరిక్సు" అను

## డైనోసారులు

మీసోజోయిక్ యుగములో ౩యియ్యలక్షల సంవత్సరములు ఇవి ఏకచ్ఛత్రాధిపత్యముగా పృథ్విని పాలించినవి. వీనిలో అనేకములు రెండు కాళ్ల మీదనే నడుచుచుండెడివి. వీనిలో కొన్ని చెట్లమీదకూడ వసించుచుండెడివి. వీనిలోకూడ మాంసాహారులు, శాకాహారులున్నవి. ఇవి ఒకదానికొకటి పోటీగా పెరుగసాగినవి. మాంసాహారులందు గోళ్లు బాగుగా పెరిగినవి. వీనిలో "టైరనోసారు" అనుదాని మోకాలు మాత్రము ఆరడుగు లుండెడిది. దాని మెడయు, తలయు ౨౦ అడుగులుండెను. ఈసరీసృపము ఆకాలములో లభ్యమగునిక మారణయంత్రముకంటె భయంకరముగా నుండెను.



౧౨. [చతుర్థ యుగము క్రెటేసియస్ శకమునందలి డైనోసారులు].

శాకాహారసరీసృపములుకూడ తక్కువ బీభత్సకరముగా ఉండెడివి కావు. వీనిలో "సారోపాడులు" అనునవి నలుబదియేబది టన్నులకంటె ఎక్కువ బరువుయుండెడివి. జిగాన్టోసారులు, బాన్టోసారులేబదిటన్నుల పైగా యుండెడివి. ముందరికాళ్లు వెనుకకాళ్లకంటె పొడుగుగా యుండెను. పెద్దమెడ తోకయునుండెను. "డిప్లొడికస్" అను సరీసృపమునకు ౪౦ అడుగుల తోకయుండెను. దీనితో తన శత్రువులను చావమోదుచుండెడిది.

సారోపాడులు జలమందును, భూమియందును గూడ వసించుచుండెడివి. బహుశః అవి ఈకాలపునీటి గుఱ్ఱములవలె నుండెడివి. వీని నోటియందు రంధ్రములుండుటచే నీటిలో తలను ముంచి నీరు పైకి చిమ్ముచుండెడివి. ఇవి క్రెటేసియన్ శకములో నశించి పోయినవి. కాని ఇవి నశించుటకు ముందు పొందిన మార్పులనుబట్టి వీనిని మూడుభాగములుగ విభజించిరి.

౧. ఇగ్వానొడన్లు—వీనివి శిలా శిథిలములు బెల్జియము బొగ్గుగనిలో ౧౦౦౦ అడుగులలోతున దొరికినవి. కాని ఈ శిథిలములందు పిల్లలు దొరకలేదు. ఆడవి మగవియుకూడ ఏమియు భేదము లేక యున్నవి. వీనికి రెండువరుసల దంతములును, జిరాఫీనాలుకవలె పొడుగైన నాలుకయు కలవు. దంతములకు పింగాణి యుండెడిది కాదు. అందువలన ఒకవరుస అరిగిపోవుటతోడనే మరియొకవరుస వచ్చుచుండెడిది. మొత్తముమీద ౨౦౭౨ దంతము లుండెడివి.

౨. స్టెగోసారులు—ఇవినాల్గుకాళ్ల మీదనడుచుచుండెడివి. వీని వీపుమీద రెండడుగులఎత్తున శల్యకవచముండెడిది. తోక ముళ్లగదవలె నుండెడిది. దానితో శత్రువులను చంపుచుండెడిది. దీనికి మెదడు చాలాచిన్నది.

3. కొమ్ములుగల డైనోసారులు:—వీనికి ఖడ్గమృగములవలె పెద్దకొమ్ము ఉండెడిది. మెడమీద శల్యకవచ ముండెడిది. ముక్కుదగ్గరనుండి మెడచివరికి ఎనిమిది అడుగులపొడ వుండెను. డైనోసారులలో ఇగిరే బాగుగా పరుగెత్తగలదు.

అమెరికా మ్యూజియము పరిశోధకసంఘము వారికి దానిగూడును, గ్రుడ్లనుగూడ భూగర్భమునందు దొరికినవి.

మాంసాహారమునుండి, శాకాహారమునకు జీవితమును మార్చుటకు డైనోసారులే ప్రథమప్రయత్నము చేసియుండెను. ఇవి వికాసపు నిర్మాతలని చెప్పవచ్చును.



౧౩. బ్రోంటోసారు. ఆకాలమందలి డైనోసారులలో మిక్కిలి పెద్దది. ఇది ౭౫ అడుగుల పొడవు ... టన్నుల బరువుండెడిది.

అయినను ... మెదడు చాలా తక్కువ. సగటున తెల్లని ... సహస్రపౌను లుండెను. నలుబది టన్నులు తూకముగల డైనోసారు మెదడు రెండుపౌనుల కంటె ఎక్కువలేదు. సగటున మానవులయందు ఏబది పౌనుల శరీరమునకు ఒకపౌను మెదడుండును. డైనోసారులందు ౨౫ వేల పౌనులకు ఒకపౌను మెదడు ఉన్నది. స్టీగోసారులు ౨౦ టన్నులున్నను ౨౪ ఔన్సులకంటె ఎక్కువ మెదడులేదు. అందు వానిలో ఆలోచనాస్మృతి పూర్తిగా శూన్యము. ఈవిజ్ఞాన వీచికలు పంచమయుగమగు సీనోజోయిక్‌నందు జాగృతమయినవి. అదే ఆధునికయుగము.

స్థూలసూక్ష్మాంతర సంగ్రామము:— ప్రకృతియందు అత్యంతస్థూలములగు సరీసృపములకును, తదితర సూక్ష్మజంతువులగు పక్షి క్రిమికీటకములకును సంగ్రామము ప్రారంభమయినది. స్థూలజంతువులు సూక్ష్మజంతువులకంటె అనేకవిధములయిన ఆయుధములను కల్గియుండెను. అయినను వానికి బుద్ధివికాసము తక్కువ. ఒకపక్షి పెద్దడైనోసారు తోకమీద కూర్చుండి మాంసము తినుచుండెడిది. ఆబాధ మెదడుకు చేరుటకు అనేకము అరగంట అయినను పట్టుచుండెను. ఇటులనే క్రిమికీటకములకు వీనికి నిరంతరసంగ్రామము జరుగుచుండెను. ఈపరిస్థితులలో ఆచ్ఛాదన, ఆలవాలము, అనురణములతో అంతేకాక సర్వాంగసంపూర్తి నొందిన శిశువులను వెలికి గొనివచ్చి పాలిచ్చి పోషించు బాధ్యతతో క్షీరాయుత చతుష్పాదములు ప్రకృతిలో ప్రవేశించినవి. వీని ప్రవేశమే మానవాగమనమునకు మున్నుడి అయినది.

## ప్రస్తుత యుగపరివర్తనము

సీనోజోయిక్‌యుగము ఆధునిక యుగము. ఈ యుగమునందు ఆధునికశకములో జీవించుచున్నాము. ఇంతకుపూర్వము నాలుగుశకములు గడిచిపోయినవి. ఆశకములందు మానవ ప్రవేశమునకై పృథ్విపై అనేక మార్పులు జరిగినవి. పర్వతనిర్మాణ మంతయు చతుర్థయుగమునందు జరిగినది. అప్పుడు మిగుల శీతలముగా నుండెను. ఆధునిక యుగప్రారంభమందు మరల పర్వతము లన్నియు క్రుంగిపోవుచు ఉష్ణాధిక్యము హెచ్చుచు సముద్రము కూడ ఎక్కువగు చుండెను. ఈయుగము ఇయోసీను, ఆలిగోసీనుశకములందు సమశీతోష్ణత, అనుకూలవసతి ఏర్పడెను. కాని మరల మయోసీనుశకమునందు తిరిగి పర్వతములు లేచుట, శీతలాధిక్యము భూకంపము ప్రారంభమయ్యెను. తరువాతి ప్లయోసీను శకముకూడ మయోసీను శకమువలెనే యుండెను. ఈ శకమునందే మరల పృథ్వి హిమాచ్ఛాదిత మయ్యెను. అప్పుడు మరల భూఖండము లన్నియు తారుమారు అయ్యెను. అప్పుడే వికాసవాహిని వివిధపథము లవలంబించినది. గత హిమకాలములో ఖండము లన్నియు



౧౪. [ఆధునికయుగము మొదటి శకమందలి కొన్ని క్షీరాయుత చతుష్పాదములు.]

నొకదాని కొకటి కలసియుండెను. ఈ హిమకాలములో మొదట ఆస్ట్రేలియా విడిపోయెను. ఉత్తర అమెరికా, దక్షిణఅమెరికాలకు గల భూభాగము సగము వరకు సముద్రములోనికి పోయెను. ఆఫ్రికా ఆశియాఖండములకు మధ్యభూఖండముకూడ సముద్రములోనికిపోయెను. అప్పుడే ఆఫ్రికాయందు సహారాఎడారి ఏర్పడినది. ఇటులనే ఈయుగమంతయు భూతలమున అనేక మార్పులతో, హిమకాలములతో నిండియున్నది. పదిలక్షల సంవత్సరములుండిన ఆహిమకాలము గడిచివచ్చిన తరువాత ఆధునికశకము, నాగరికత ప్రస్ఫుటితమైనది.

క్షీరాయుత చతుష్పాదములు— క్షీరాయుత జంతువులు మీసోజోయక్ యుగమునందే ప్రారంభమయినను సరీసృపముల దాటి రాగజాలకపోయినవి. అందుచే శిశురక్షణ కేమాత్రమును వీలు లేనందున పిండమును కడుపునందే యుంచుకొని శిశువు సర్వాంగసంపూర్తిబొందిన తర్వాత వెలికి గొనివచ్చి శిశుపోషణ చేయుచుండెడివి. వీనిలో "మారుసూపిలులు" మొదటివి. ఇవి శరీరమునం దొక తిత్తి నుంచుకొని దానిలో శిశురక్షణ చేయుచుండెడివి. ఈ యుగము మొదటిశకమునందు "ఆంబ్లిపాడ్" అను క్షీరాయుత మృగములు అత్యంత స్థూల పరిమాణమును పొందినవి. వీని యన్నిటియందు శరీరముతోపాటు మెదడు కూడ వృద్ధిపొందినది. ఇవన్నియు శాకాహారులుగా నుండెడివి. వీని యన్నిటికంటె పెద్దమృగము శిథిలములు మంగోలియాయందు దొరికినవి. దానిపుర్రె ౫ అడుగులు, ముందరికాళ్లు ౧౬ అడుగులు, మెడ ౧౨ అడుగు లుండెను. అది సుమారు ౨౦ టన్నుల బరువుండియుండును. కాని ఇవన్నియుకూడ హిమకాలములో నశించిపోయినవి.

భూమిపై ఇన్ని జంతువులు, వృక్షములు అనేక విధములయిన ఆకృతులు, అవస్థలు పొంది నశించిపోవడానికి కారణం గా అనిపిస్తుంది. దీని ఆధునిక మానవప్రవేశమే సమాధాన మనిపిస్తోంది. ప్రకృతి ఈ



[౧౫. బాలుకైతర్ అను క్షీరాయుత చతుష్పాదము. ఇది అన్నిటికంటె పెద్దది. ఇది సుమారు ౨౫ అడుగులుండి ౨౦ టన్నుల బరువుండెడిది. ఇది ఈయుగము రెండవశకములోనిది.]

మానవనిర్మాణానికి విపరీతప్రయత్నం చేసింది. మస్తిష్కాభివృద్ధికోసం నిరంతరకృషిసల్పింది. ఈ ఆలోచనాయుత మృగాన్ని సృష్టించడంకోసం జీవాన్ని విచ్చలవిడిగా ఖర్చుపెట్టింది. తత్ఫలితముగా ఆధునిక మానవుని పొందింది. ఈమానవత్వాన్ని తీవ్రపరిశోధనకై వినియోగిస్తోంది. మానవేతిహాసరూపమైన ప్రకృతి పరిశోధనాపృష్టముల పరికించి మానవుని మించిపోయిన జీవికై ప్రయత్నించుచున్నదా అను సందేహం కలుగకమానదు. దానికోసమేనా ఈభూకంపాలు !! తీవ్ర శీతోష్ణతరంగాలు !!!

[పటాలకు విషయాలకు కృతజ్ఞుడను.]

1. Ancient plants (By Dr. Mary Stopes)
2. Extinct Animals.
3. Scence of Life (Julian HuXley & H. G. Wells.
4. Hamsworth Populer Sciences, Vols. 1 & 3 By Arthur Mee Etc.



మదరాసు ఓడరేవు

D. P. R.

# తేనె

గుమ్మలూరి సత్యనారాయణ

తేనె నెరుగనివా రుండరు. దీని పరిచయ మౌషధ సేవగా తప్ప యితరవిధములలో నంతగా నున్నట్టులు గానబడదు. దీనికి కారణములు రెండు :— ౧. తేనెటీగల పెక్కు ఔషధగుణములు, ౨. ఎంతో యపురూపముగా చాల తక్కువ దొరకుట. ఎన్నో విధముల తేనె యత్యుత్తమమైన యాహారము. పెక్కు గుణముల నిచ్చు సాధ్యమైనపుడు, కొన్నివిధముల నవలంబించి తేనెను సంపాదించుటకు నవకాశము లున్నపుడు మన దేశములో తేనె మనుజునకు నొక్క ఔషధసేవకు తక్క ఆహారముగా నుపయోగించుకొనుటకు వీలు లేకుండుట శోచనీయము. పాశ్చాత్యదేశములలో తేనెను చాల విరివిగా పిల్లలకు చిరుతిండ్లు మొదలుకొని పెద్దల యాహారమువరకు నుపయోగించబడుచున్న దను విషయము నెరిగినపిదప మనయొపెలు మరింత ముంపకపోవు. ఈ దురవస్థకు కారణము మన దేశములో తేనె గలుగు బెంచి తేనె నొక 'పంట'గా కృషిచేయు విధానములు లేకపోవుటగాక యింకేమున్నది! అడవులలో నేచెట్టునో, యేపుట్టనో పట్టు తేనెటీగల పట్టులలోనుండి కోయలు, మన్యప్రదేశస్థులు, తగినగులు తేనెను పిండి యమ్ముచున్నారు. కాని యీ మన్యపుతేనె యనేక విధముల మంచిదికాదు. కనుక మంచితేనెను మనయింటనే తేనెటీగలవలన తయారుచేయించుకొనవలయును. ఈ కృషి విధానములను ముందు రాగలు వ్యాసములలో జూతము. ఆ తేనెను పండించుటకు ముందు తేనెయొక్క స్వభావమును, లాభనష్టములు, సుగుణనిర్గుణములు మొదలగు వాటి నిప్పుడు గ్రహింతము.

'తేనె' యనునది యొక మధుపాకము. ఇది పూలలోనున్న మకరందము నుండి తేనెటీగలవలన తయారు చేయబడినది. తేనెటీగలు పూలలోని పుష్పాడిని తిని, మకరందమును త్రాగును. ఇదియే వాని యాహారము. పుష్పాడిలో నత్రజని సంబంధమగు మాంసకృత్తులు గలవు. మకరందములో చెరకుపంచదార యెక్కువగా గలదు. ఇంకను మకరందములో జలము, తదితర సూక్ష్మక్షీరాంశములు, 'ఎంజైమ్సు' అను కొన్ని ధాతువులును గలవు. ఇట్లు పుష్పాడివలనను, మకరందమువలనను జీవించుటకు కావలయు నాహారపదార్థములను బొంది తేనెటీగలు వ్యవహరించుచున్నవి. మకరందము తేనెటీగల యాహారకోశమునకు బోయిన పిదప నంపలిగ్రంథుల సాలించబడి తేనెగా మారును. మకరందములోని చెరకుపంచదార యీ జీవద్రవ్యముల వలన 'ద్రాక్షపంచదార', 'పండ్లపంచదార' యను రెండు భిన్నములైన పంచదారలుగా మారును. దీనినే 'పంచదారమార్పు' అనుచున్నాము. ఈ పంచదార మార్పు తేనెటీగల జీర్ణకోశములో పూర్తిగా గాదు. ఇట్టి యసంపూర్ణమధుపాకమును తేనెటీగలు వాని పట్టులో గల గదులయందు గ్రక్కును. ఆగదులలో నటులు కొంతకాల మున్నపిదప మధుపాకము పూర్తియగుచున్నది. అప్పుడే మనము తినుటకు వీలుగానున్న తేనె యగుచున్నది. దీనినే పక్వతేనె యందుము.

అపక్వతేనెను తినగ తేనెటీగలు తిని దమరు పదార్థసంబంధమగు 'మైనము'గా జేయును. ఈమైనము వాటిపట్టుకట్టుకొనుట కత్యావసరము. ౬, ౮ పౌనుల తేనెను తిని, తేనెటీగలు ౧ పౌను మైనముగా మార్చుచున్నవి. ఈమార్పువలనను తేనెటీగల శరీరములోనే యగుచున్నది. ఒకసారి యిట్లు తేనెనుండి మైనము తయారైనపిదప నది మన చెవులలోని గులిమివలె, తేనెటీగల శరీరమునుండి బైటకు వచ్చును. ఆ వచ్చిన మైనమును కాళ్లతో గోకి, నోటికి దెచ్చి, ముద్దచేసి వాటికి కావలసిన యాకారములో నవి పట్టుకట్టును. తమ యవసరములకు తేనెటీగ లిట్లు తయారుచేసుకొనిన తేనెను, మైనమును మన మపహరించి యుపయోగించుకొనుచున్నాము.

తేనెలో ననేకపదార్థములు గలవు. వాని నీక్రింది పట్టిక దెలుపగలదు:

తేనెలోని రాసాయనికపదార్థతత్త్వములు. (ప్రతిశతములలో జూపబడినవి.)

| | |
|---|---|
| నీరు | ౨౦ |
| ద్రాక్షపంచదార<br>పండ్లపంచదార | ౭౦ |
| చెరకుపంచదార | ౩.౦ |
| భస్మములు | ౦.౫ |
| మైనపురవలు<br>జిగురులు<br>తైలామ్లపదార్థములు మొ.<br>వర్ణద్రవ్యములు బహుస్వల్పము<br>ములు కొన్ని | ౬.౫ |

పట్టిక విచారణ—

౧. పైదిపట్టికనుబట్టి తేనెయందు పంచదారలు గలవని తెలియుచున్నది. చెరకుపంచదారకన్న ద్రాక్షపంచదారయు, పండ్లపంచదారయు నతిసులభముగా జీర్ణమగును. ఏపిండిపదార్థముగాని, తదితర పంచదారలుగాని మనము తినునప్పుడు మన జీర్ణకోశములోని పెక్కు జీర్ణరసములవలన నేమి, జీవస్ఫటులవలన నేమి, తదితర జీవాంశములవలన నేమి తుదకు చిన్న ప్రేగులోనికి పోవు సరికి అన్నియును యీద్రాక్షపంచదారగా మారును. ఈయవస్థలోనే తినిన పిండిపదార్థములు మన శరీరతత్త్వములోనికి పోవుచున్నవి. ఇట్లు తుదియవస్థ ద్రాక్షపంచదార యగుటవలనను, ఆపంచదారయే తొలుత నాహారములో నుండిన, నది సులభముగా జీర్ణమగును. ఇందుమూలముగ రోగానంతరము త్వరలో దార్ఢ్యము గలుగుటకు కొందరు 'గ్లూకోజ్ ఫుడ్' (Glucose focd) అనగా ద్రాక్షపంచదార లుండిన యొక యాహారము'ను సేవింతురు. ఈపంచదార లిట్లు హెచ్చుగా తేనయందుండుటవలన తేనె సులభముగా జీర్ణమగు నొక యాహారమని తెలియుచున్నది.

౨. అందలి భస్మములలో భాస్వరములు, క్షారము, సోడియము, సున్నము, అయము మొదలగు నుపధాతువులును, ధాతువులును కలవు. ఇవన్నియు మన దేహనిర్మాణమున కత్యవసరము. భాస్వరములు మెదడునకు, నరములకు మంచివి. సున్నమువలన మన శరీరములోని 'రసకోశములు' బాగుగా పనిచేయుటయే కాక, యెముకలు, పండ్లు మొదలగునవి దృఢముగా నుండును. అయముగవలన రక్తము శుభ్రపడును. అందునకే మనము 'ఐరన్‌టానిక్' తీసుకొందుము.

౩. జిగురులు, తైలామ్లములు మొదలగువానివలన మనలో జీర్ణశక్తి కొంత హెచ్చయి, సుఖవిరేచన మగును.

౪. మనకోటియందలి ఉమ్మిలోగల జీవస్ఫటుల వలననే యిందులోనుండి కొన్ని భటులు కలవు. వాని వలన ద్రాక్షపంచదార త్వరలో కొన్ని పుల్లనిపదార్థములుగా మారి మనకు దుర్గుణము నిచ్చును. ఈయవస్థ వచ్చి తేనెను కొంతసేపుంచిన కాగలదు. అందుచేత పట్టులోనుండి తీసిన పచ్చితేనెను అరగంట వరకు వేడి నీటిలో కాచినపిమ్మట సీసాలలో పోసియుంచెదరు. ఈ కాచుటవలన జీవస్ఫటులు నాశనమగును. కను ద్రాక్షపంచదార కియిబ్బంది లేదు. కాని యీ జీవస్ఫటులు మనయాహారకోశములో కొన్ని సుగుణముల నిచ్చును. అవి చచ్చుటచేత నీ [illegible] పోవుచున్నది. చాలకాల ముంచుకొనవలె నన్న తేనెను కాచక తప్పదు.

౫. ఈ రెండుపంచదారలలో ద్రాక్షపంచదార చిన్నకణములవలె నుండును. పండ్లపంచదార ద్రవరూపమున నుండును. సీసాలో తేనె నుంచిన చాలకాలమునకు చిక్కనగానున్న భాగము ద్రవమునుండి వేరుపడును. ఈయవస్థలోనున్న ప్రాతతేనెను పుచ్చుకొనిన మనకు జీర్ణమగుట కష్టము. అప్పుడు సీసాను బాగుగా కదిపి కొంచెమునీళ్లతో పలుచనజేసి పుచ్చుకొనుట మంచిది.

పట్టికవలన దెలియు పైది విషయములే కాక యనుభవమునుబట్టి యితర గుణములు కొన్ని గలవు. తేనెను బొగ్గుగుండతో కలిపి పండ్లుతోముకొనిన నవి తెల్లగా, శుభ్రముగా నుండును. గుండెజబ్బులకు, కఫ

జ్వరములకు, కంటిరోగములకు ఇది యౌషధము. ఆయుర్వేదమునందు దీనిని చక్కని యనుపానముగా సేవింతురు.

## అనుబంధము

[నూతనముగా కొన్ని సాంకేతిక పదములను కల్పించిగాని, వాడుకలో లేని యితర ప్రయోగముల నుండి తెచ్చిగాని వ్రాయుచున్నపుడు తను వ్యాఖ్యానము లేకున్న నవి నిష్ప్రయోజనములను తలంపుతో నీశాస్త్రపరిచయములకు తుది ననుబంధములను జేర్చుచున్నాను. శాస్త్రపదములకు సరియగు తెలుగుపదములను కల్పించుట కష్టతరము. కావున నా కల్పితములగు పదములలో లోపము లుండగలవు. లోపము లున్న యెడల యీపదములకు తగుమార్పుల నితర మహనీయులు సలహా నిచ్చినప్పుడు వారికి నమస్కార పూర్వకముగా కృతజ్ఞతను దెలియజేసి ముద్రింపు నాసవరణల జేయ ప్రయత్నింతును.

పంచదారలు:-తీపినిచ్చు పదార్థములకు పంచదారలందురు (Sugars). ఇవి పండ్లు, మకరందము, దుంపలు, ఆకులు, పూలు, కాండములు మొదలగుభాగములలో కొద్దిగనో, గొప్పగనో యుండును. రసాయన శాస్త్రరీతిని దీనిలో బొగ్గు (Carbon) ఉదజని (Hydrogen), ఆమ్లజని (Oxygen), అను మూడు నుపధాతువులు (Non-metals) వేరువేరు పాళ్లలో నుండును. వాని పాళ్లనుబట్టి పంచదారల తీపిదనములో హెచ్చుతగ్గులు మారుచుండును. చెరుకుగడలోని పంచదార ద్రాక్షపండులోని పంచదారకన్నను, మిగిలిన పండ్లలోని పంచదారకన్నను ఎక్కువతీయగానుండును. చెరుకురసములోనుండి తీసిన పంచదారయు, తాటిబెల్లము కొబ్బరిబెల్లములలోనుండి తీసిన పంచదారయు నొక్కటే. దీనిని సాధారణముగా మనము పంచదార యనుచున్నాము. కాని శాస్త్రరీతిని మన మిక నెన్నో పంచదారల గురించి మాట్లాడు నవసరము తటస్థించు నపుడు సాంకేతికపదము లుండితీరవలయును. కావున్న 'పంచదారో'యనిన నేదైన కావచ్చును. అందుచేతను మనము సాధారణముగా తినుచున్న పంచదారను 'చెరకు పంచదార' యందుము (Sucrose). ఈ చెరకుపంచదార చెరకుగడలోను, తాటిచెట్టు, కొబ్బరిచెట్టులో గూడ నున్నదనుమాట. ఇటులనే పండ్లలోను, తేనెలోను కొంచె ముండినను చెరకుపంచదారయనియే యందుము. అనగా నేవస్తువలో నేరకపుపంచదార యెక్కువగా నున్న దాని కాపేరునిచ్చుట యుక్తము.

ఈవిధముగానే ద్రాక్షపంచదార. ఇది ద్రాక్ష పండ్లలో నెక్కువగా నున్నది. తొలుత నీపంచదారను ద్రాక్షరసములోనుండి తయారుచేయబడినది. ఈ ద్రాక్ష పంచదార (Glucose)యు, పండ్లపంచదారయు (Fructose) సుమారు సమానములే. పండ్లపంచదార అన్నిపండ్లలో నుండుటచేత దాని కే పండుపేరును లేదు. శుద్ధపు పాలలో గూడ నొకరకపు పంచదార గలదు. దానికి పాలపంచదార (Lactose) యందుము.

ఈపంచదార లొకరకములోనుండి యింకొక రకమునకు కొన్ని రాసాయనిక ప్రయోగములవలన నేమి, జీవద్ఘటులవలన నేమి మారగలవు.

పంచదారమార్పు— Inversion.

జీవద్ఘటులు—Enzymes. ఇవి రాసాయనిక చేతనములలో పాల్గొని, యా యవస్థను పూర్తిచేయుటకుగాని, మరొకరూపమునకు మార్చుటకుగాని ప్రయత్నించును. అట్లు పాల్గొనునపు డివి యెంతమార్గము సాధారణముగా నశింపని వింతస్వరూపములకు జీవద్ఘటు లనుచున్నాము.

భాస్వరము—(Phosphates or) Phosphorus
కారము— Potassium (Compounds)
అయము—Iron (,,)
సున్నము—Calcium (oxide)
జీవన్ముఖ్యములు— Vitamins, విటమినులు.*

ఇవి మనము జీవించుటకు సాధారణముగా దిను నాహార తత్వములకన్న యెక్కువ ముఖ్యము లగుటచే జీవన్ముఖ్యము లనుచున్నాము. కాని యొక్క జీవన్ముఖ్యములను దిని బ్రతుకగలమని భావింపరాదు.
తైలామ్లపదార్థములు—Fatty Acids.]

# 'సతీ అనసూయ'



మాతయని మాటవిని లోకమాతయంచు, తెలియకిటు పరీక్షించితి కలతబడితి
స్త్రీలమాటలవిని విమర్శించుకొనక, కార్యమున్ బూను టెవరికిగాని తగదు.

౧. మన్మథుడు అనసూయచే పరాభవింపబడి యామెను శరణువేడుట

# స్త్రీధనము - ధర్మశాస్త్రములు

చీమలకొండ వెంకటదీక్షితులు

## స్త్రీధన స్వరూపము - మనుస్మృతి

ఇంతవరకును జీవితకాలపుహక్కునుగూర్చి చెప్పి, మితాక్షరాన్యాయము ననుసరించు ప్రదేశములయందు దానిని వర్తింపజేయుట శాస్త్రవిరుద్ధమని చూపించితిని. ఈ జీవితకాలపు హక్కునకును, స్త్రీధన స్వరూపమునుగూర్చి మనన్యాయస్థానములయం దిప్పుడు అమలులోనున్న మఱియొక సూత్రమునకును అవినాభావసంబంధ మున్నది. స్త్రీకి గల ఆస్తియంతయు స్త్రీ ధన మని మనకోర్టు లంగీకరించుట లేదుగదా. 'పారిభాషిక స్త్రీ ధనము' లేక 'కోర్టుల దృష్టియందు స్త్రీ ధనము' అనుదానిని నిర్ణయించుట కొక పద్ధతి యున్నది. ఏ స్మృతికర్తయైనను నొకవిషయమును ఆస్తి స్త్రీధనమని స్పష్టముగ జెప్పిననేగాని అది స్త్రీధనము గాజాలదు. స్త్రీధనము కానిదానియందు స్త్రీకి జీవితకాలపు హక్కుమాత్రమే కలదు. పారిభాషిక స్త్రీధనమునందు జేర్చదగిన వివిధములగు ఆస్తులును లెక్కకు లోనైనవి. వీనిసంఖ్య తెలిసికొనుటకు మనము స్మృతులన్నిటిని దిరుగవేయవలెను. ఇది ప్రస్తుతస్థితి.

ఇట్టిస్థితికి మూలకారణము మనకోర్టులు జీవితకాలపు హక్కును గుర్తించుటయే. ఈ జీవితకాలపు హక్కు లేకపోయిన, స్త్రీచేతికివచ్చిన ప్రతిఆస్తియును ఆమెదే యనియును, వానియందు మరల భేదములు లేవనియును స్పష్టమేగదా. జీవితకాలపు హక్కు అను నదియే లేదని నిరూపించినపిదప, పారిభాషిక స్త్రీధన సూత్రముకూడ దానితో మాయమగును గాన, మఱల ఈ ప్రశంస యేల యని యడుగవచ్చును. ఇందుల కొక ముఖ్యకారణ మున్నది. స్త్రీధన మనిపించుకొనదగిన యాస్తుల నొకగణనకు లోనుజేసి, స్మృతికర్తలచే నట్లు పరిగణింపబడనివానిని వేరుచేయుటకు ప్రస్తుతము మనుస్మృతియందలి యొక శ్లోక మాధారముగా గైకొనబడుచున్నది. మనువు చెప్పినది మందని వేదమే చెప్పుచున్నది. స్మృతులయందుకూడ మనుస్మృతికి ప్రాధాన్య మీయబడినది.

'వేదార్థోపనిబంధృత్వాత్ ప్రాధాన్యంహి మనోఃస్మృతమ్,
మన్వర్థవిపరీతా యా సా స్మృతి ర్న ప్రశస్యతే.'

అని స్మృతివచనము. మనువునకు విరుద్ధమగు స్మృతులకే లెక్కలేనప్పుడు విజ్ఞానేశ్వరునివంటి నిబంధకారులమాట చెప్ప నక్కరలేదుకదా. కావున "స్త్రీధన మనిన స్మృతులయం దట్లు పరిగణింపబడిన యేవో కొన్ని యల్పసంఖ్యాకములగు ఆస్తులు" అను సూత్రమునకు మనుస్మృతియం దెంత యాధారమున్నదో చూచుటవసరము.

మనుస్మృతిని రచించిన మనువుతోగాని, అతని కాలముతోగాని మనకు నిమిత్తము లేదు. ఆస్మృతియందు రచయితకాలమునాటి విధులును, అతని యభిప్రాయములునేగాక అతఃపూర్వ మెప్పుడో యుండిన పరిస్థితులనుగూర్చి కూడ కొన్ని విషయము లున్నవి. స్మృతులలోకెల్ల మనుస్మృతి ప్రాచీనము. అందున్న కొన్ని సంగతులు మనువునాటికే ప్రాచీనములు. క్రింది శ్లోకమున వివరించియుండు విశేష మట్టిదే.

'భార్యా పుత్రశ్చ దాసశ్చ త్రయఏవాధనాః స్మృతాః,
య త్తే సమధిగచ్ఛంతి, యస్యైతే, తస్య తద్ధనమ్.'

భార్యయును, దాసుడును, పుత్రుడును నిర్ధనులు. అనగా స్వోపయోగమునకై స్వత్వసంపాదన వారు చేసుకొనరాదు. వా రేది యార్జించినను, అది యంతయు వారు ముగ్వురు నెవ్వరి యధీనమున నుందురో వారిదే యగును. ఈశ్లోకమునందలి భార్యాశబ్దము స్త్రీమాత్రోపలక్షణము. ఇది మనువునాటిసంగతి కాదనుట నిస్సందేహము. ఏమన, మనువు స్త్రీధన మాఱువిధములని మఱియొకస్థలమునందు చెప్పియున్నాడు.

'అధ్యగ్న్యధ్యావాహనికం దత్తంచ ప్రీతికర్మణి,
భ్రాతృమాతృపితృప్రాప్తం షడ్విధం స్త్రీధనం స్మృతమ్.'

అధ్యగ్ని, అధ్యావాహనికము, ప్రీతి దత్తము, సోదరుడు, తల్లి, తండ్రి - వీరిచే నీయబడినది యని స్త్రీధన మారువిధములు. అతడిట్లు స్త్రీధన మారువిధములని చెప్పుటచే, మనువుతో ప్రారంభమయిన ఈగణన మనేడు మన స్త్రీలహక్కులను సంకుచిత మొనర్చుట కాధారమయినది. మనువు స్త్రీధన మారువిధము లనుటచే, స్త్రీధనమునందు చేర్పదగిన యాస్తులు మిత సంఖ్యాకము లనియును, ఇతర స్మృతికర్తలొక్కొక్క రొకటొకటిగ ఈసంఖ్య నభివృద్ధిపరచిరేగాని, స్త్రీధన మెప్పటికిని యౌగికము కానేరదనియును నొక యభిప్రాయము విస్తరిల్లి న్యాయస్థానములందు ప్రాముఖ్యము వహించినది.

కాని సావధానముగ మనము మనుస్మృతిని గల కించితిమేని యిట్టి యభిప్రాయమున కందేమియును ఆధారములు లేవని తెల్లమగును. మనుస్మృతియందలి షడ్విధగ్రహణమున కేమియును ప్రాముఖ్యము లేదు. స్త్రీలు స్వోపయోగార్థము ధనమార్జించుకొన లేదను నట్లొక ప్రాచీన సంప్రదాయమో, అట్లే స్త్రీధన మారువిధములనుటగూడ నొక పురాతన సూత్రమే. మనువు స్త్రీధన మారువిధములని చెప్పినప్పుడు పై శ్లోకమునందు వలెనే 'స్మృతం' అను పదము నుపయోగించినాడు. పూర్వమునుండియు, ఈ ఆరువిధములుగ వచ్చిన ఆస్తి స్త్రీకి చెందినదిగా పరిగణింపబడుచుండెనని యీ శ్లోకముయొక్క అభిప్రాయము. అంతేకాని ఈ ఆరింటికి మించినదేదియును స్త్రీధనము కానేరదని కాదు. ఏలనన మనువు తల్లికిని, నాయనమ్మకును దాయాధికారము నిచ్చియున్నాడు.

'అనపత్యస్య పుత్రస్య మాతా దాయ మవాప్నుయాత్,
మాతర్యపిచ వృత్తాయాం పితుర్మాతా ధనం హరేత్.'

సంతానములేక మరణించిన యాతని తల్లి కాతని దాయము చెందును. తల్లికూడ మరణించిన నాయనమ్మ ఆ ధనమును పొందును.

మనుస్మృతియం దిచ్చటను స్త్రీకి కొన్ని ఆస్తులయందు యావజ్జీవానుభవము మాత్రమే కలదను నభిప్రాయము కానరాదు. ఆ సూత్రమే మనకవసరమైన మనుస్మృతి తరువాత కొన్ని శతాబ్దములు ముందునకు జరిగి కాత్యాయనుని సాయముననైనను బయటపడెను; అతడు కూడ మనకు తృప్తినీయనియెడల విజ్ఞానేశ్వరునకు పిమ్మట వచ్చిన జీమూతవాహనుని జూడవలెను. స్త్రీ ఆయమమాత్రమే యనుభవించుచు మూలమును మఱియొకని వారసులకై జాగ్రత్త పెట్టవలెనని మనువు అభిప్రాయమైనట్లు తోచదు. మనుస్మృతి ప్రకారము స్త్రీధన మారువిధములే యనుకొందము. అప్పుడు తల్లికిగాని, నాయనమ్మకుగాని దాయమువలన సంక్రమించిన యాస్తిగతి యేమి? అది స్త్రీధనమందు చేరజాలదు. మనువు స్త్రీహస్తమునందు స్త్రీధనమునకు భిన్నమైన వేరొక స్వత్వ ముండవచ్చునని చెప్పియుండలేదు. దాయరీత్యా సంక్రమించిన యాస్తి యస్పష్టమవ్యక్త స్వభావము గలదై త్రిశంకుస్వర్గము నొందవలసివచ్చును. కాని న్యాయశాస్త్రమున అవ్యక్తమునకు తావులేదు. కాబట్టి అది స్త్రీధనమే యనుట నిస్సందేహము. అట్లు కాదనుట పిల్లి కన్నులు మూసికొని పాలు త్రాగుటవంటిది

కావున మనుస్మృతి ననుసరించిచూడ స్త్రీహస్తములందలి పురుషాగతిదాయము స్త్రీధనమని తేలినప్పుడు మనువుయొక్క షడ్విధగ్రహణమునకు ప్రాముఖ్యము లేదనుట నిర్వివాదాంశము. వ్యాఖ్యానకర్తలందరును మనువు ఆరువిధములను వాస్తులను చేరొక్కని వానిని స్త్రీధనమని చెప్పుట, స్త్రీధనమందు చేర్పదగిన యాస్తులసంఖ్యను నిర్ణయించి, యంతకుపైన వేరేమియును చేర్పరాదని చెప్పుటకుగాక స్త్రీధనమునందీ యారువిధములగు ఆస్తులను తప్పక స్మరించవలయునని యు, సంతకుపైన మఱి ఎన్నింటినైనను చేర్చుట కభ్యంతరము లేదనియు జెప్పుటకును ఉద్దేశింపబడినదని పలుమారు చెప్పియున్నారు. కావున మనువుకాలమునందు గూడ స్త్రీధనము పారిభాషికము గాదని తేలుచున్నది.

ఈవిషయమును మన మొకింత చారిత్రక దృష్టితో జూచితిమేని స్త్రీధనస్వభావము మనకు

సులభముగా నవగతము కాగలదు. పూర్వ మొకప్పుడు స్త్రీ తనకొరకై ద్రవ్యార్జనము చేయరాదనుసూత్ర ముండెడిదని పైన జెప్పితినిగదా. కాని కాలక్రమమున పురుషు డీకాఠిన్యమును వదలి, స్త్రీ కొక ప్రత్యేకవ్యక్తిత్వ మొసగినాడు. స్త్రీ తనకొరకై ప్రత్యేకముగ కొన్ని విధములగు ద్రవ్యమును జాగ్రత్తపెట్టుకొని దానిని తన యిష్టమువచ్చినట్లు వ్యయ మొనర్చుకొనవచ్చునని యంగీకరించినాడు. ఇట్లు చేయుటకు కారణము ప్రేమయే. వివాహసమయమున బంధువులు వధువునకిచ్చు బహుమతులు మొట్టమొదట స్త్రీస్వామ్యమునకు లోనైనవి. పిదప నొకటొకటిగ అత్తమామ లిచ్చునవియు, సోదరుడు తండ్రి, తల్లి మొదలగువారు వివాహానంతర మొసగు ధనమును స్త్రీకి స్వంతమగు ఆస్తియైనవి. కాని హిందూదేశమున ఇప్పుడున్న సమష్టి కుటుంబ పద్ధతియే పూర్వమునుండియు వచ్చుచున్నది. అవిభక్త కుటుంబమున, ఎవరిదే యాస్తి యను విషయము విభాగ కాలమువరకును రానేరాదు. అప్పుడు కుటుంబములోని వారి కెవ్వరికైనను ప్రత్యేకపుటాస్తు లున్న వానిని ముందు వేరుపరచి, మిగిలిన యాస్తులన్నియును సమముగా పంచుకొందురు. ఇది మన మనుదినమును మన కుటుంబములయం దిప్పటికిని జూచుచున్నాము కదా. కుటుంబమునందలి స్త్రీలకుగూడ కొన్ని యాస్తులను ప్రత్యేకముగా నుంచుకొను నర్హత కలిగినపిదప, నవి యితరులు వ్యయ మొనర్పకుండుటకును, విభాగసమయమున వాని నేర్పాటుగా నొప్పగించుటకును వీలుగ, 'ఇది స్త్రీధనము' అని చెప్పవలసివచ్చినది. అంతేకాని 'స్త్రీధన' మని స్త్రీకి గల ఆస్తులలో కొన్నిటికి పేరు గాదు. స్త్రీధనమనిన ఎప్పుడును ఆమెదాని సొత్తే. ఈ విధముగా ప్రారంభమయిన స్త్రీ స్వామిత్వము క్రమముగా వృద్ధిపొందినది. కాలము జరిగినకొలదిని స్త్రీ తన స్వంతసొత్తుగా నుంచుకొనదగిన ఆస్తులసంఖ్య హెచ్చినది. స్మృతికర్త లొకరివెనుక నొకరుగ తమ కాలమున స్త్రీస్వామిత్వమునకు లోనైన యాస్తుల నేకరువుపెట్టసాగిరి. ఈ విషయ మిట్లుండ స్త్రీలకు దాయాధికార మొసగబడినది. ఇది యెప్పుడు ప్రారంభమైనదో మనము చెప్పజాలము. ధర్మశాస్త్ర గ్రంథములయందు మనకు లభించినవానిలో బహు ప్రాచీనమగు గౌతమసూత్రమునందుకూడ విధంతువు భర్తదాయమును బడయవచ్చునని యున్నది. కాని స్త్రీలకు దాయాధికార మిచ్చినప్పుడు, ఆవిధముగా వారికివచ్చిన యాస్తి స్త్రీధనమని నొక్కిచెప్పవలసినయవసరము లేకపోయినది. స్త్రీ ఒకనిమరణానంతర మాతనియాస్తి కధికారిణియా యనుప్రశ్నకు 'ఔను' ననుసమాధానము వచ్చిన పిదప సందేహమునకు తావే లేదు. ఏమార్గములవలన స్త్రీధనమును బడయవచ్చు ననునదియే సమస్య. కావుననే మనువు తల్లికిని, నాయనమ్మకును దాయాధికార మిచ్చినప్పుడు, అది వారి స్త్రీధనమనని చెప్ప నవసరము లేకపోయినది. అది స్త్రీయనుభవించెడి ధనముగాన స్త్రీధనముగాక మరేమి కాగలదు?

మనువు తల్లికిని, నాయనమ్మకును దాయాధికార మొసగినట్లే ఇతర స్మృతికర్తలు భార్యకు, కూతురునకు, సోదరికిని దాయాధికార మిచ్చియున్నారు. కాలక్రమమున జీవద్విభాగమునను, అజీవద్విభాగమునను గూడ, తల్లికి భాగము లభించినది. అట్లే అవివాహితయగు సోదరికి కూడ భాగార్హత వచ్చినది. (వీనిలో కొన్నిహక్కు లిప్పుడు మనప్రాంతములయందు నశించినను, ఉత్తరమున కొన్నిచోట్లయం దవి యాచరణలో నున్నవి.) ఇట్లు స్త్రీలహక్కు లభివృద్ధి పొంది, యేయొకటిరెండువిధములుగనో తప్ప కొంచె మించుమించు పురుషునితో సరిసమానముగ స్త్రీకూడ ద్రవ్యసముపార్జన గావించుకొనుటకు అర్హతను బొందుట చేతనే కాత్యాయనుడు శిల్పప్రాప్తమును, బాంధవేతర దత్తమును దక్క మిగిలిన స్త్రీయొక్క ఆస్తులన్నియును స్త్రీధనమేయని చెప్పియున్నాడు. ఇందు మనుస్మృతికిగాని, మనువు ఉదాహరించిన షడ్విధగ్రహణమునకుగాని విరుద్ధమైన దేదియును లేదు.

## స్త్రీధనస్వరూపము - విజ్ఞానేశ్వరుడు

ఇట్లు స్త్రీల హక్కులయందుగలిగిన యీసంపూర్ణాభివృద్ధిని మన కతిక్లుప్తమగు మాటలలో చెప్పగలిగిన

వాడు విజ్ఞానేశ్వరుడు. వ్యాఖ్యానకారులలో విజ్ఞానేశ్వరుడు చుక్కలలో చంద్రునివంటివాడు. కావుననే యాతడు 'స్త్రీధనశబ్దో యౌగికః' యని ఒక్క మాటలో తేల్చివేసినాడు. స్త్రీ స్వామ్యమునకు లోనైన సొత్తంతయును స్త్రీదే. ఆ విషయమై సందేహముల కేమియు చోటు లేదని చెప్పినాడు. కాని కాలవశమున నాతనిమాటలు న్యాయస్థానములందు తగిన గౌరవమును బడయలేకపోయినవి. తెల్లవారు మొట్టమొదట మనదేశమునకు వచ్చినప్పుడు ఇంగ్లాండునందలి స్త్రీలహక్కు లత్యంతము సంకుచితములుగ నుండెడివి. ఆకాలమున వారిస్త్రీలకు భర్తతో నైక్యము తప్ప ప్రత్యేకవ్యక్తిత్వ ముండెడిదికాదు. కావుననే ప్రివీ కౌన్సిలువారు విజ్ఞానేశ్వరుని యభిప్రాయము నంగీకరింపక త్రోసివేసిరి. కాని విజ్ఞానేశ్వరుడు చెప్పినదంతయును శాస్త్రసమ్మతము. స్త్రీధనమును గూర్చి యాతడు చెప్పినది కొంతవరకు విస్తరించి యిట తెలియ జేయుదును.

విజ్ఞానేశ్వరుడు యాజ్ఞవల్క్య స్మృతిపై తన మితాక్షరావ్యాఖ్యను రచించెను. యాజ్ఞవల్క్యస్మృతి యందు స్త్రీధనమునుగూర్చి యిట్లున్నది:

"పితృమాతృపతిభ్రాతృదత్త మధ్యగ్న్యుపాగతమ్,
ఆధివేదనికాద్యంచ స్త్రీధనం పరికీర్తితమ్.
బంధుదత్తం తథా శుల్కం మన్వాధేయక మేవచ.

తండ్రి, తల్లి, భర్త, సోదరుడు వీరలచే నియ్యబడినది, వివాహకాలమున అగ్నిసన్నిధియం దీయబడినది, రెండవవివాహము చేసికొనునపుడు భర్త మొదటి భార్యకిచ్చినది మొదలగునవియును, అవిధముగనే బంధువులచే నీయబడినది, శుల్కము, వివాహానంతర మీయబడినదియును స్త్రీధన మని చెప్పబడుచున్నవి" అని యీశ్లోకభాగముల కర్థము.

విజ్ఞానేశ్వరుడు మొదటి పాదమునకును రెండవ పాదమున ఆధివేదనికమువరకును వివరణము వ్రాసిన పిదప ఆద్యశబ్దము నెత్తుకొని,

"ఆద్యశబ్దేన రిక్థక్రయసంవిభాగపరిగ్రహాధిగమప్రాప్తం. ఏతత్ స్త్రీధనం మన్వాదిభి రుక్తం. స్త్రీధనశబ్దో యౌగికః న పారిభాషికః, యోగసంభవే పరిభాషాయా అయుక్తత్వాత్" అని వ్రాసి పిదప మిగిలిన బంధుదత్త శుల్కాన్వాధేయము లన నేమియో చెప్పి, ఇవన్నియును స్త్రీధనమే యని ముగించినాడు. ఆతడు చెప్పిన పైసంస్కృత వివరణమున కర్థ మిది: "ఆద్య (మొదలగునవి) శబ్దమువలన దాయము, క్రయము, విభాగము, పరిగ్రహము, అధిగమము. వీనిలో దేనివలన వచ్చిన ధనమైనను అది యంతయును స్త్రీధనమని మనువు మొదలగువారిచే జెప్పబడినది." స్త్రీకి భర్త మొదలగువారి యాస్తి దాయరీత్యా రావచ్చును. లేక ఆమె తననగలు మొదలగువాని నమ్ముకొనిగాని, తల్లి, తండ్రి మొదలగువా రిచ్చిన ద్రవ్యముతో గాని ఇతర ఆస్తులను కొనవచ్చును. కుటుంబాస్తి విభజించుకొనబడినపు డామెకు భాగ ముండవచ్చును. లేక ఆమె అడవియందలి తృణకాష్ఠములవంటి అస్వామిక మగు పదార్థముల నేరితెచ్చుకొనిగాని, ఇతరుని ఆస్తి స్వాధీనము చేసికొని పన్నెండేండ్లును తనవశమునం దుంచుకొనిగాని స్వామ్యమును సంపాదించుకొనవచ్చును. ఇదియే పరిగ్రహము. ఆమె కొకనిధి దొరకవచ్చును. (పూర్వము నిధి దొరకిన ఇప్పటివలె నది ప్రభువునకుగాక ఎవనికి దొరకినదో వానిదే యయ్యెడిది.) ఇది యధిగమము. ఇవన్నియును సర్వసాధారణము లగు స్వామ్యకారణములు. విజ్ఞానేశ్వరుడు వీనిని గౌతమ సూత్రము నుండి గ్రహించినాడు "స్వామీ రిక్థక్రయసంవిభాగపరిగ్రహాధిగమేషు" అని గౌతమవాక్యము. విజ్ఞానేశ్వరుని కాలమున స్త్రీకీస్వామ్యకారణము లన్నియును లభ్యములే. ధనార్జనవిషయమున ఈరీతిగ స్త్రీ పురుషులకుగల భేదమంతయును నశించిపోయినది. పూర్వమొకప్పుడు వ్యక్తిత్వములేక, తానే ఇతరుని సొత్తుగా పరిగణింపబడిన స్త్రీ, క్రమముగ ఆబానిసత్వమునుండి విడువడి స్వయంవ్యక్తిత్వమును దాల్చి, పురుషునితో సమానురాలయినది.

పైన పేర్కొనిన గౌతమ సూత్రమునందు చెప్పబడిన స్వామ్యకారణము లన్నియు విజ్ఞానేశ్వరుని కాలమునాటికి స్త్రీకి లభ్యములే యనుట నిర్వివాదాం

శము. గౌతమసూత్రము రిక్థ క్రయ, సంవిభాగ, పరిగ్రహ, అధిగమములను సూచించుచున్నది. గౌతముని కాలమునుండియు స్త్రీకి భర్తఆస్తియందు వారసత్వము గలదు; అట్లే తల్లి మొదలగువారి స్త్రీధనమునందుగూడ దాయార్హత యుండెడిది. రిక్థమనిన ఈ వారసత్వపు రీత్యా వచ్చినఆస్తియే. యాజ్ఞవల్క్యుడు తల్లి, అవివాహిత యగు సోదరి మొదలగువారికి విభాగసమయమున కుటుంబాస్తియందు భాగము గైకొను నధికారమిచ్చియున్నాడు. దేవలుడు స్త్రీకి "లాభము"*వలన వచ్చిన ఆస్తియంతయు స్త్రీధనమని చెప్పినాడు. లాభమనిన అధిగమపరిగ్రహములచే వచ్చిన యాస్తి, అనగా నిధిప్రాప్తిచేగాని, వ్యతిరేకభుక్తముచేగాని (Adverse possession) వచ్చినది అని అర్థము చేసుకొనదగును. ఇక క్రయముపొందినఆస్తి స్త్రీధనమనుటకు సందేహమే లేదు. ఏమన కాత్యాయనుడే స్త్రీలకు సౌదాయకస్త్రీధనమును † తమయిచ్చవచ్చినట్లు వ్యయమొనర్చుటకు హక్కుగలదని చెప్పియున్నాడు. అట్టి యాస్తిని విక్రయించగా వచ్చిన ధనముతో నామె మరల క్రొత్తఆస్తినికొనుట కభ్యంతరముండదుగదా. కావున విజ్ఞానేశ్వరుడు ఆద్యశబ్దమునకు చెప్పిన యర్థము సరియైనది ఈ విషయమును నిరూపించుట కింతకుమించి వేరుప్రయత్నము లేవియు నవసరము లేదు.

ఈసందర్భమున నింకొక విషయము గమనింపదగును. కాత్యాయనుడు స్మృతికర్తలలో చాల కడపటివాడని చెప్పితిని గదా. అతనికిని విజ్ఞానేశ్వరునకును సామీప్య మెక్కువ. విజ్ఞానేశ్వరుడు స్త్రీధనము యౌగికమని వ్రాసినప్పుడు కాత్యాయనుని

ప్రాప్తం శిల్పైస్తు యద్విత్తం
ప్రీత్యాచైవ యదన్యతః,
భర్తుః స్వామ్యం సదా తత్ర
శేషంతు స్త్రీధనంస్మృతమ్.

అను శ్లోకమును దృష్టిపథమం దుంచుకొనియుండనోపును. కాని దాని నాతడుదాహరించియుండలేదు. ఏమన, ఆకాలము నాటికి స్త్రీలీ రెండువిధములుగ గూడ ధనార్జనము చేయరాదను విషయము సందేహమునకు దావొసగియుండవచ్చును. కావునే మితాక్షరయందు స్త్రీకి గల ఆస్తియంతయు స్త్రీధనమని చెప్పబడియున్నది. కాత్యాయనుని "శేషంతు స్త్రీధనం స్మృతం" అను పదములను విజ్ఞానేశ్వరుని "స్త్రీధనశబ్దో యౌగికః నపారిభాషికః" అనువాక్యమును ఇంచుమించు సమానార్థప్రతిపాదకములే. ఆరెండింటియొక్క పర్యవసానమును స్త్రీకిగల ఆస్తియంతయు స్త్రీధనమనియే.

విజ్ఞానేశ్వరుని యనంతరము మితాక్షరాసిద్ధాంతముల ననుసరించిన మాధవుడును, దేవన్నభట్టును తమ గ్రంథములయందాతని యభిప్రాయములనే విస్తరించి వానిని విస్పష్ట మొనర్చియున్నారు. ఒక్కదాయభాగసిద్ధాంతము ప్రబలియున్న బెంగాలునందుదప్ప మిగిలిన హిందూదేశమునందంతటను, అందునను ముఖ్యముగ మన యీదక్షిణదేశప్రాంతములందును, స్త్రీకిగల యావదాస్తులును స్త్రీధనమే యనుటయు, ఆమె వానిని సంపూర్ణాధికారములతో ననుభవించి తనయనంతరము తనస్త్రీసంతానమునకే చెందజేయగలదనుటయు శాస్త్రసమ్మతమగు నిర్వివాదాంశములు.

## ౪

## ఆక్షేపణలు - సమాధానములు

విజ్ఞానేశ్వరుని యభిప్రాయము మనకోర్టు లంగీకరింపలేదని ఈవరకే చెప్పియుంటిని. కోర్టులేకాక కొందఱాధునిక న్యాయవేత్తలును, పండితులునుగూడ విజ్ఞానేశ్వరుని యభిప్రాయము సరియైనది కాదని నొక్కి చెప్పియున్నారు. ఈవిషయమై యొనర్పబడిన యాక్షేపణలు రెండున్నవి. వాని నీక్రింద నుదాహరించుచున్నాను.

* వృత్తిరాభరణం శుల్కం లాభశ్చ స్త్రీధనం స్మృతమ్.

† సౌదాయకమనగా స్త్రీకి తన బంధువులచే నీయబడిన యాస్తి.
సౌదాయికే సదా స్త్రీణాం స్వాతంత్ర్యం పరికీర్తితమ్.
విక్రయేచైవ దానేచ యథేష్టం స్థావరేష్వపి.

౧. విజ్ఞానేశ్వరుడు "ఆద్య" శబ్దమున కిచ్చిన యర్థము సరియైనది కాదు. ఆపదమున కంతవిశేషార్థముండియుండదు.

౨. ఒకవేళ విజ్ఞానేశ్వరుని యభిప్రాయము సరియైనదేయైనను ఆతనిసిద్ధాంతముల ననుసరించి యాతనికి పిమ్మట ధర్మశాస్త్రగ్రంథములను వ్రాసిన దాక్షిణాత్యులగు మాధవుడును, దేవన్నభట్టును ఆతని యభిప్రాయములతో నేకీభవించక పారిభాషిక స్త్రీధనమునుమాత్రమే స్వీకరించిరి.

ఈరెండు అభిప్రాయములును సరియైనవి కావనుట కేమియు సందేహము లేదు. ఇందు మొదటిది బ్రిటిషుకోర్టులతో ప్రారంభించినదై తెల్లజడ్జీల సంస్కృతజ్ఞానరాహిత్యముచే గలిగిన దుష్ఫలితమని ఇదివరలో జెప్పియుంటిని. రెండవదానికి నారు వోసినవాడు కలకత్తా హైకోర్టులో నొకప్పుడు న్యాయమూర్తిగా నున్న సర్ గురుదాసుబెనర్జీ యను వంగీయుడు. దానికి దోహదమొనర్చి వృద్ధిగొందించిన జర్మనుదేశీయుడగు జాలీపండితుడు. సంస్కృతపండితుడేయైనను ఏలనో బెనర్జీపడిన తప్పుటభిప్రాయమును గురించి దానిని తొలగించుటకై యత్నింపలేదు. జాలీ యభిప్రాయములు బెనర్జీ చెప్పినదాని కనుకరణములే.

వీ రుభయులును చెప్పునదేమన * 'స్త్రీధన శబ్దము యౌగికమే యైనయెడల ఋషులు ఈయియాయాస్తులు స్త్రీధన మని కొన్నిటిని వక్కాణించిన వాక్యము లర్థరహితము లగును. కాత్యాయనుడు స్త్రీధనమునుండి రెండువిధము లగు ఆస్తులను తొలగించుటచే విజ్ఞానేశ్వరుడు చెప్పినట్లు స్త్రీధన శబ్దము యౌగికము గానేరదు. యాజ్ఞవల్క్యుని శ్లోకమున "ఆద్య"శబ్దము సరియైనపాఠము కాకపోవచ్చును. అది సరియైనదేయైనను ఏవో కొన్నిటిని చెప్పి పిమ్మట "మొదలగునవి" (ఆద్య)అని చెప్పినప్పుడు ఆ పదము ఇదివరకు పేర్కొనబడినవానితో సమానమగు స్వభావము గలవానికే వర్తించునుగాని స్త్రీ స్వామ్యమునకు లోనైన ఏయాస్తికైనను వర్తించదు. ఇంతేకాక మాధవుడు "ఆద్య"శబ్దమున కిచ్చినయర్థము సంకుచితముగానుండి పారిభాషికార్థమునే స్ఫురింపజేయుచున్నది. దేవన్నభట్టుగూడ స్త్రీధనశబ్దమును పారిభాషికముగనే పరిగణించియున్నాడు.'

ఈయాక్షేపణలు రెండును స్త్రీధన చారిత్రమును సరిగా తిలకింపక జీవితకాలపుహక్కు అను సూత్రమునందు నిమగ్నులై స్మృతిచంద్రిక మాధవీయముల యందలి వాక్యముల నపార్థము చేసుకొనుటచే కలిగెనవి.

కాత్యాయనుడు స్త్రీధనమునుండి రెండువిధములగు ఆస్తులను తొలగించుటకు గలకారణ మిదివరకే చెప్పియుంటినిగాన ఆవిషయమగు ఆక్షేపణ అర్థవంతము గాదు. ఆద్యశబ్దమునకు విజ్ఞానేశ్వరుడు చెప్పిన యర్థ మెట్లు సరియైనదో స్త్రీధనచరిత్రమునుబట్టి పైన జూపితిని. ఇక ఆద్యశబ్దము యాజ్ఞవల్క్యుని శ్లోకమునందు పేర్కొనబడిన యాస్తులను పోలినవానికే గాని తద్వ్యతిరిక్తములగు స్త్రీకి గల ఏ ఆస్తికైనను వర్తింపదనుట సారము లేనిమాట. మనుస్మృతియందువలెనే యాజ్ఞవల్క్యస్మృతియందుగూడ జీవితకాలపుహక్కునకు సూచనలేదు. యాజ్ఞవల్క్యుడు స్త్రీలకు దాయాధికారమును, భాగగ్రహణాధికారమును ఒసగినాడు. ఈ ఆద్యశబ్దమే లేకున్న వానిస్వభావ మేమికాగలదు? భాగమువలన వచ్చినయాస్తి స్త్రీధన మగునని యాజ్ఞవల్క్యుడే సూచించియున్నాడు. ఇంతేకాక ఇక నొకముఖ్యాంశ మున్నది. యాజ్ఞవల్క్యస్మృతిపై అపరార్కుడనుప్రభు వొక వ్యాఖ్యానమును రచించియున్నాడు. అతడు స్త్రీధనమును గూర్చినశ్లోకమునకు విజ్ఞానేశ్వరుడు గ్రహించిన "ఆద్యంచ" యను పాఠమునకు బదులుగ జీమూతవాహనునివలె "చైవ" యను నిర్దిష్టార్థముగల పాఠమును గ్రహించియు దుప కా

* See Banerjee. Marriage and Stridhana, 3rd edition. pp. 286 and 289. Jolly. Tagore Law lectures, 1883. p 244.

శ్లోకమునకు విజ్ఞానేశ్వరు డిచ్చిన యర్థమునే యొసగి నాడు. అతడు గైకొనినపాఠ మిది:

పితృమాతృపతిభ్రాతృదత్త మధ్యగ్న్యుపాగతమ్,
ఆధివేదనికంచైవ స్త్రీధనం పరికీర్తితమ్.

అతడనన దేమన *“‘చ’.శబ్దము ఆద్యర్థముకలది. దానివలన ఇతరవిధములగు స్త్రీధనములు, అనగా విభాగము, దాయము మొదలగువానివలన వచ్చినయాస్తులును, ఇంకను స్త్రీస్వామ్యమునకు లోనైన ఇతర ఆస్తులును చేర్కొనబడినవి.” విజ్ఞానేశ్వరుడును, అపరార్కుడును సమకాలికులు. అందొకడు ఒకరాజుకొలువున పండితుడు. రెండవవాడు తానపరిసరప్రాంతములందలి ప్రభువు. ఈయిరువురును యాజ్ఞవల్క్యుని శ్లోకమునకు పరస్పరవిరుద్ధములగు రెండుపాఠముల నెత్తుకొని సమానార్థములగు వ్యాఖ్యానములను రచించుటచే వారికాలమున స్త్రీధనస్వరూపమువిషయమున సందేహము లేదనియు, స్త్రీధనశబ్దము యౌగికముగనే పరిగణింపబడెడిదనియు స్పష్టమగుచున్నది.

ఇక మాధవుడును, దేవన్నభట్టును విజ్ఞానేశ్వరుని యభిప్రాయములను మన్నించినారా, లేక త్రోసి రాజనిరా యనువిషయ మాలోచింతము.

మాధవుడు తనపరాశరమాధవీయమున స్త్రీధనమునుగూర్చిన చర్చయందు మితాక్షరా సిద్ధాంతముల నంగీకరింపలేదనుట సమంజసము కాదు. యాజ్ఞవల్క్యుని శ్లోకమును మూలముగా గైకొని యాతడు ఆధివేదనికమువరకును వివరణమొనర్చి పిమ్మట “ఆద్య శబ్దేన “అధ్యావాహనికరిక్థ క్రయాదిప్రాప్తం” అని వ్రాసి యున్నాడు. మిగిలినచర్చయంతయును మితాక్షరనను సరించియే యున్నది. విజ్ఞానేశ్వరునివలెనే ఈతడును స్త్రీకిగల ఆస్తియంతయు స్త్రీధనమే యని యభిప్రాయపడుటచే ప్రమాదమేమియు లేకుండుటకై స్త్రీకి ఎరవుగా నిచ్చినదియు, దాచనిచ్చినదియు స్త్రీధనము కానేరదని చెప్పియున్నాడు. సర్ గురుదాసు బెనర్జి ఆద్యశబ్దమునకు మాధవు డొనర్చిన వివరణమును సరిగా అర్థము చేసుకొనలేదు. “ఆద్యశబ్దేన అధ్యావాహనికరిక్థ క్రయాదిప్రాప్తం” అనుదాని కాత డిట్లు అర్థము వ్రాసినాడు. “ఆద్యశబ్దమువలన అధ్యావాహనికరిక్థముతో కొనబడినవి మొదలగు ఆస్తులు స్త్రీధనమందు చేరుచున్నవి.” అనగా ఒకస్త్రీ తన అధ్యావాహనికధనము నమ్మివేసి దానితో వేరొకఆస్తిని కొనినట్లయిన నది ఆమె స్త్రీధన మగునని యర్థము. ఆవాక్యమున కిట్టి యర్థము చెప్పుట శాస్త్రవిరుద్ధమును, వ్యాకరణవిరుద్ధమును గూడ. అధ్యావాహనికరిక్థము స్త్రీలదయినపుడు దాని వినియోగమువలన వచ్చినఆస్తికూడ వారిదే యని చెప్పవలసిన యగత్య మెక్కడిది? అంతేకాక సంస్కృతమున అమ్ముటను విక్రయమను కొనుటను క్రయమను సూచించును. బెనర్జి చెప్పినట్లు అధ్యావాహనికరిక్థక్రీత మని యుండవలెను గాని అధ్యావాహనికరిక్థముతో కొనిన ఆస్తి అనునర్థము రావలెననిన అధ్యావాహనికరిక్థక్రయ మనియుండరాదు. ఒక్క అధ్యావాహనికరిక్థము వలన కొనినఆస్తి స్త్రీధనమగునని ప్రత్యేకముగా సూచించవలసిన యవసరము మాధవున కేల గలిగెనో మనకు దెలియరాదు.

నిజమేమన బెనర్జి స్త్రీధనశబ్దము పారిభాషికమను భావమునకు లోనై మాధవుని వాక్యము సరిగా నర్థము చేసికొనలేదు. మాధవుడు చెప్పినదానికి సరియగునర్థ మిది. “ఆద్యశబ్దమువలన అధ్యావాహనికము, దాయము, క్రయము మొదలగువానివలన వచ్చిన యాస్తులు చేర్కొన బడుచున్నవి.” ఇందు విజ్ఞానేశ్వరుని యభిప్రాయమునకు భిన్నముగ నేమియును గానరాదు. ఆద్య శబ్దార్థమును బాగుగా విశదీకరింపనెంచి యాజ్ఞవల్క్యునిచే గాక మనువుచే చేర్కొనబడిన అధ్యావాహనికమును మొదట

* చ శబ్ద ఆద్యర్థః, తేనచ స్త్రీధనాంతర పరిగ్రహః, తద్యథా, కార్యాః పత్న్యః సమాంశికాః, మాతా ప్యంశం సమం హరేత్, స్వాత్స్వా దంశాచ్చతుర్భాగం, మాతుః పారీణహ్యం స్త్రియో విభజేరన్, అన్యదపి యత్ స్త్రీస్వామికం తత్ స్త్రీధనమితి మన్వాదిభిః పరికీర్తితం.

చెప్పి, పిమ్మట విజ్ఞానేశ్వరుడు గౌతమసూత్రమునుండి గ్రహించినదంతయు మరల చెప్పుట అనవసరమని తలచి "రిక్థక్రయసంవిభాగ పరిగ్రహాధిగమప్రాప్తం" అను దానిని "రిక్థక్రయాదిప్రాప్తం" అని క్లుప్తీకరించి, "అద్యశబ్దేన అధ్యావాహనికరిక్థక్రయాది ప్రాప్తం" అని చెప్పినాడు. ఇంతమాత్రముచే మాధవుని యభిప్రాయమున స్త్రీధనము పారిభాషిక మెట్లగునో బెనర్జీకే ఎరుక. జాలీపండితుడు తనయుపన్యాసములను బెనర్జీ తరువాత నిచ్చియున్నాడు. కాని యాతడు బెనర్జీయందలి భక్తిగౌరవములచేతనో, మరేకారణముననో ఈపొరపాటును సవరింపక బెనర్జీ చెప్పినదానినే బలపరచినాడు.

దేవన్నభట్టు తనస్మృతిచంద్రికయం దేమిచెప్పినాడో మన మిప్పుడు చూడవలెను. అతడు స్త్రీధన స్వరూపమును నిర్ణయించు సందర్భమున యాజ్ఞవల్క్యునిశ్లోకమునుగాక "షడ్విధం స్త్రీధనంస్మృతం" అని మనువు చెప్పిన శ్లోకము నెత్తుకొని షడ్విధ గ్రహణము అంతకుతక్కువ సంఖ్యను నిరసించుటకే గాని యంతకెక్కువసంఖ్యను నిషేధించుటకు గాదని నొక్కిచెప్పి, పిమ్మట ఈ హేతువుచేతనే యాజ్ఞవల్క్యుడు ఆద్యశబ్దమును గైకొనినాడని చెప్పినాడు కాని అత డీసందర్భమున స్త్రీధనము యౌగికమనిగాని, దాయమువలన వచ్చిన ఆస్తి స్త్రీధనమనిగాని చెప్పియుండలేదు. ఈకారణముచే దేవన్నభట్టు స్త్రీధనశబ్దమును పారిభాషికముగా బరిగణించెనని కొంద రభిప్రాయ పడవచ్చును. కాని స్మృతిచంద్రికయందలి దాయభాగప్రకరణమునంతను జాగ్రత్తగా చదివితిమేని అట్టియూహకు తావుండదు. మిగిలిన నిబంధనలలోవలెగాక స్మృతిచంద్రికయందు స్త్రీధనప్రకరణము అపుత్రకుని ఆస్తికి దాయక్రమమును సూచించుప్రకరణమునకు ముందున్నది. కావుననే స్త్రీకి దాయమువలన వచ్చిన యాస్తి స్వభావమును దేవన్నభట్టు దాయక్రమమును గూర్చిన చర్చయందు చెప్పియున్నాడు. ఆవిషయమున నాతడు చెప్పినమాటలలో సందేహమున కేమియు నవకాశము లేదు. అపుత్రకుని యాస్తికి ముందుగ తండ్రి వారసగునా, తల్లి వారసగునా యనుసమస్య వచ్చినది. దానికి శంభుడనువాత డొకయుక్తియుతమగు సమాధాన మిచ్చియున్నాడు. దంపతు లుభయులకును బిడ్డలయందు సమానమగు హక్కులున్నవి గాన వారిరువురిలో దాయము నెవ్వరు గైకొనినను సరి యిరువురిలాభము నిమిత్తమే యగును గాన దాయక్రమమును నిర్ణయింప నవసరము లేదని శంభుని యూహ. దేవన్నభట్టీవిషయమున శంభుని యూహ అయుక్తమని ఇట్లు చెప్పినాడు.

> యత్తూక్తం శంభునా - మధ్యకధనత్వాత్ దంపత్యో ర్యేన కేనచిత్ గృహ్యమాణ మితి న విశేషో వక్తవ్య ఇతి, (తి దయుక్తమ్.
>
> మాత్రా గృహ్యమాణం మాత్రర్థ మేవ. అధ్యగ్న్యాద్యాది స్త్రీధనవత్. నోభయార్థ మితి విశేషో వక్తవ్య ఏవ, సోఽభిధీయతే.)

ఇందు కుండలీకరణమునందలి భాగమున కర్థ మిది. "తల్లి గైకొనుధనము అధ్యగ్న్యాదిస్త్రీధనమువలె తల్లిధనమే యగును. ఇరువురినిమిత్తముగా గాదు." దీనివలన దాయమునకువచ్చిన యాస్తి స్త్రీధనమని తేలుచున్నది. ఇకవిభాగపు ఆస్తివిషయమునసన్నో దేవన్నభట్టు తల్లి మొదలగువారికి భాగార్హతను గాక భృతి కనువగునంత ధనమునుమాత్రమే స్వీకరించుహక్కు నొసగియున్నాడు. కాని యాతడు స్త్రీధనవిశేషములంగూర్చి చెప్పునప్పుడు వృత్తిహాడ స్త్రీధనము యని దేవలునిశ్లోకము నుదాహరించినాడు. కావున దేవన్నభట్టు స్త్రీధనమును పారిభాషికముగా గణించెనని చెప్పవీలులేదు. సర్ గురుదాసుబెనర్జీ స్మృతిచంద్రికయొక్క మద్రాసు ప్రాంతముల ప్రతులలోతప్ప బెంగాలీప్రతులందు పైన ఉదాహరించిన వాక్యములు (కుండలీకరింపబడినవి) గానరాకుండుటచే నవి ప్రక్షిప్తములేమో యను నభిప్రాయమును సూచించి తన యాక్షేపణమును సమర్థించుకొనగోరినాడు. కాని దేవన్నభట్టు దాక్షిణాత్యుడగుటచే నాతని గ్రంథముయొక్క దక్షిణదేశపుప్రతులే ప్రామాణికమైనవని మనము చెప్పవలెను.

దీని కంతకును ఫలితార్థ మిది. స్త్రీధన శబ్దము యౌగిక మను విజ్ఞానేశ్వరుని యభిప్రాయము సరియై

నది. మాధవుడును, కేశవన్నభట్టును మితాక్షరా సిద్ధాంతములనే యనుసరించిరిగాని తద్భిన్నముగ స్త్రీధనమును పారిభాషికముగ పరిగణింపలేదు.

ఇక నొకమాటచెప్పి యీవిషయమును ముగించెదను. స్త్రీహస్తమునందున్న యావదాస్తులును స్త్రీధనమే యనిచెప్పుటలో రెండుభావము లిమిడియున్నవి. అందు మొదటిది ఆమెకు దానిపై సంపూర్ణాధికారములు గలవనుట. రెండవది స్త్రీస్వామినియనంతర మాయాస్తి మొట్టమొదట పుత్రసంతానమునకుగాక స్త్రీసంతానమునకే చెందుననుట. ఆదినుండియును స్త్రీల ప్రత్యేకోపయోగమునకై యీయబడిన ఆస్తి స్త్రీసంతానమునకే చెందుచుండెడిది. మనధర్మశాస్త్రగ్రంథములన్నింటియందును దాయవిభాగప్రకరణమున పురుషుని వారసులు, స్త్రీవారసులు అను రెండు ప్రత్యేకవిషయములున్నవి. పురుషదాయము పోవురీతి వేరు. స్త్రీదాయము పోవుపద్ధతి వేరు. కావున అనంతరవారసత్వమని మనము సాధారణముగా వ్యవహరించుభావమునకు ధర్మశాస్త్రమున నాధారము లేదనుట వ్యక్తము. పురుషుని యాస్తి మొట్టమొదట పురుషులకు బోవునట్లే స్త్రీయాస్తి మొట్టమొదట స్త్రీలకు బోవును. దీనినిబట్టి మితాక్షరాసిద్ధాంతము స్త్రీల కెంతో యున్నతస్థానమొసగినదియును, ఇప్పు డమలులోనున్న స్త్రీల హక్కులకును శాస్త్రసమ్మతములగు స్త్రీలహక్కులకును ఎంతభేదమున్నదియును యూహించుకొనవచ్చును.

౫

## పర్యవసానము

స్త్రీధనశబ్దము యౌగికమనువిషయమును గమనించి స్త్రీలఆస్తివిషయమున అనుదినమును మనల నెదుర్కొనుచున్న వివిధసమస్యలకును తదనుసారముగ ప్రత్యుత్తర మిత్తుమేని స్త్రీలయభివృద్ధి కధికముగ తోడ్పాటు కలుగుటయేగాక "హిందూలా" చాలసులభముగను, క్లుప్తముగను పరిణమించును. అప్పుడు స్త్రీలకు చేకూరులాభములలో గొన్నిటి నీక్రింద నుదాహరించుచున్నాను.

స్త్రీకి పురుషునియనంతరము వచ్చిన దాయమునందు సంపూర్ణాధికారములు లభించును. ఆవిధముగ స్వత్వసంబంధమగు స్త్రీలస్థితి యభివృద్ధిగాంచగా, సంఘమునందు వారికున్న గౌరవము పెంపొందును. ఇప్పుడున్న జీవితకాలపుహక్కు పోయి, తత్స్థానమున పూర్ణస్వామ్యము సమకూరుటచే స్త్రీకి ఇప్పటికంటె స్వాతంత్ర్యము హెచ్చి, ఆమె కిప్పుడున్న కేవలపురుష ప్రాధాన్యమునకు మాఱుగ ఆత్మప్రాధాన్యము నెలకొనును.

స్త్రీయాస్తియంతయు స్త్రీధనమే యైనయెడల, స్త్రీసంతానమునకున్న వారసత్వపుహక్కు లధికమగును. ఒకడు మరణించునప్పటి కాతని నాయనమ్మయును మేనత్తయును నున్నారనుకొందము. ఆతనియాస్తి మొదట నాయనమ్మదగును. అది యామె స్త్రీధనముగాన ఆమెయనంతర మామెపుత్రికకు, అనగా మృతినొందినవాని మేనయత్తకు చెందును. ఈవిధముగనే, ఇప్పుడు పురుషవారసుల కున్నంతప్రాముఖ్యము స్త్రీవారసులకుగూడ కలుగును. ఇప్పుడు మేనత్తకు దాయమురావలెనన్న, సకులమునం దేడుతరములవరకు నెవ్వరు లేకుండబోవలెను. కాని యావజ్జీవస్వత్వమును తీసివేసినయెడల, ఆస్తి మేనత్తవంటి దగ్గరబంధువులకు చేరుట కవకాశము లెక్కువగును. అట్లే దౌహిత్రివిషయముజూడుడు. ఇప్పుడు ఒకపురుషునియాస్తి ఆతనికి పుత్రసంతానము లేకుండబోయిన, ప్రథమమున భార్యకును, పిదప కూతురునకును, అటుపిమ్మట కూతురుకొడుకునకును వరుసగా వెళ్లును. కాని ఆకూతురునకు కొడుకులు లేనియెడల, ఆయాస్తి కూతురుకూతురునకుగాక సాధారణముగా సోదరులు మొదలగువారి సంతానమునకుగాని, అంతకంటె దూరపువారికిగాని చెందుచున్నది. ఇది జీవితకాలపుహక్కుయొక్క ఫలితము. స్త్రీకి దాయమువలన వచ్చిన ఆస్తియందు సంపూర్ణస్వామ్యమే యున్నట్లయిన ఆ ఆస్తి కూతురు మరణించినతరువాత కూతురుకూతురునకు చెందును. ఈమధ్య గావించిన సవరణ ననుసరించియైనను దౌహిత్రికి తాత తరువాత గాని దాయాధికారము లేదు. కావున నిట్టి ఫలితము చాల ఆదరణీయమైనది.

స్త్రీలకుగల న్యాయాధికార మీతీరున నభివృద్ధి గాంచుటచే, ఇప్పుడు పురుషసంతానమునకును, స్త్రీ సంతానమునకును స్వత్వవిషయమున గల యంతరము కొంతవరకైనను తగ్గి యొకవిధముగ సమత్వము గలుగుట కవకాశమున్నది.

స్త్రీకి భర్తయాస్తియందు సంపూర్ణాధికార మున్నయెడల వితంతువులస్థితి యొకింత మారగలదు. ఇప్పుడు వితంతువు పునర్వివాహము చేసుకొనినట్లయిన తక్షణమే యామెప్రథమభర్తవలన వచ్చినఆస్తియంతయును అక్రనివారసులకు బోవును. ఇది వితంతూద్వాహము లభివృద్ధి జెందుట కొకయాటంకముగా నున్నది. యావజ్జీవ స్వామ్యమువలన వచ్చిన ఫలితములలో నిది యొకటి. భర్తయాస్తియం దామెకు సంపూర్ణాధికార మున్న పునర్వివాహమువలన ఆస్వామ్యము తొలగిపోదాలను. అప్పు డవసరమైన చట్టమును గూడ సులభముగ మార్చవచ్చును.

వృత్తివిషయమున గూడ స్త్రీల కధికారము హెచ్చును. వృత్తి కవసరమే లేకుండ బోయినను బోవచ్చును. ఏమన దత్తతయొక్క పారమార్థికప్రయోజనము భర్తపరలోకసౌఖ్యమేయైనను, మనకు సాధారణముగా గోచరమగుచున్న ప్రయోజనము కేవల మైహికమే. భర్తవలన వచ్చిన తన అసంపూర్ణమగు హక్కునకు సంపూర్ణత నిచ్చి ఆహక్కు నొకనికి గట్టిపెట్టి ఆవిధముగ తనచుట్టు నొక కుటుంబమును జేర్చుకొని, వృద్ధాప్యమున తనకు సౌఖ్యమును గలుగజేసుకొనుటకే యీదత్తత యుపయోగించుచున్నది. మొదటనే స్త్రీకి సంపూర్ణాధికారము లున్నట్లయిన ఈపాట్లనవసరము. అనుజ్ఞకై సపిండులను యాచించుట కవసర ముండదు.

ఒకవేళ పెంచుకొనినను దత్తపుత్రుడు చెప్పినమాట విన డేమో యనుభయ ముండదు.

పైన జెప్పినవన్నియును మనకు సులభముగా గోచరమగు ప్రయోజనములు. ఇట్టి వింకను మఱికొన్ని యున్నవి. కాని వీనిమాట యటుండ, యావజ్జీవస్వత్వమును పోగ్రోలుటవలన మనకు కొంతశాంతి లభించును. జీవితకాలపుహక్కుతోబాటు అనంతర వారసత్వమును బోవును. అప్పుడు పురుషుని దాయాదులకును స్త్రీచేతియందలి యాస్తికిని సంబంధ ముండదు. అందువలన దత్తత, సపిండులయనుజ్ఞ, వితంతువుచే గావింపబడిన అన్యాక్రాంతములు, అనంతర వారసత్వము మొదలగు విషయములనుగూర్చి ప్రతి ఘటియయందును న్యాయస్థానముల కెక్కుచున్న యనంతము లగు వివాదములు పరిసమాప్తి జెంది ముందెన్నడును తల నెత్తకుండ బోగలవు.

పైన జెప్పినలాభములన్నియు స్త్రీలకు సమకూర వలెననిన నొక్కటే మార్గము కలదు. న్యాయసమ్మతముగ విధముగా వచ్చిన ప్రతియాస్తియందును స్త్రీకి గూడ పురుషునికివలెనే దానాదమనవిక్రయాద్యధికారములుగల సంపూర్ణస్వామ్యము, గలదనియు నామె యనంతర మాయాస్తి స్త్రీధనవారసులకే చెందుననియు నొకచిన్న చట్టమును గావింపవలెను. భారతశాసనసభలో నెట్టిచట్టము గూర్పాందుట వాంఛనీయము. అట్లుచేయుటకు సాధ్యముగాకున్న రానున్న రాష్ట్రస్వాతంత్ర్యము (Provincial Autonomy) గల రాష్ట్రసభలలో నిరాష్ట్రమున కారాష్ట్రమైనను నిట్టిచట్టమును గావించుట యుచితము.

నది. ఒక స్వతంత్ర దేశపు మహారాణిగారికిని, వేరొక్కచోట, పైన చెప్పిన మహారాజుగారి కినిగూడ చంద్రస్థానములో లెక్కింపలేనన్ని చిన్న చిన్న నక్షత్రము లున్నవి.

బుధస్థానములోను, కుజస్థానములోను గూడ నక్షత్రములు శుభచిహ్నములని బెనహాము చెప్పుచున్నాడు. కొందరు పాశ్చాత్యులు నక్షత్రము లెక్కడనుండినను శుభచిహ్నములే యని తెల్పుచున్నారు. మరికొందరు నక్షత్రములు ఎక్కడనున్నను చెడ్డవే యని చెప్పుచున్నారు. పాశ్చాత్యులలో నీభిన్నాభిప్రాయములు పెరుగుచున్నవి

గ్రహస్థానములలో నున్న యీయశుభ చిహ్నముల నగ్గరకు జీవితరేఖకడనుండి చిన్న చిన్న రేఖలు పోవుచుండును. ఆ రేఖను



పటము ౫

బట్టి జీవితములో నేసంవత్సరమున ఏగ్రహస్థానమునకు సంబంధించిన జబ్బు చేయునో తెలిసికొననగును. (చూ. 5-వ పటము)

ఇంతియకాక జాతకుని అనారోగ్యమును గమనించుటకు ఇంకను కొన్ని సాధనములు గలవు. వానిలో చేతిగోళ్లు ముఖ్యము.

గోరుపై 6-వ పటములోవలె సన్నని నిలువుగీతలు కనబడిన అది నరముల బలహీనతను నిరూపించును.



పటము ౬

ఇట్టి గీతలు గలిగి గోరుచివరభాగము వెనుకకు మరలిన అది పక్షవాతలక్షణము.



పటము ౭

గోరుపై 7-వ పటములోవలె సన్నని అడ్డగీతలు కనబడిన అవి అధికమైన రోగము వచ్చి తగ్గినలక్షణము.



పటము ౮

గాజుబుడ్డివలె వ్రేలికొండమీదికి వంకరగ వంగియుండుగోరు క్షయరోగసూచకము.

(చూ. 8 వ పటము)



పటము ౯

గోరుపైన వంకర గలిగి ముందునకు కొంచెము వంపుగలిగినట్లున్న నది ఊపిరితిత్తుల సంబం[illegible]చును.

మొదటివేలిగోరు ముందు భాగములో



పటము ౧౦

చర్మమువైపున కెక్కువగ లోనికి వంగిన గండమాల, క్షయవ్యాధులు గలుగును.

(చూ. 10. వ పటము)



పటము ౧౧

త్రికోణాకారము గల గోరు పక్షవాత రోగమును తెచ్చును.

(చూ. 11. వ పటము)



పటము ౧౨

గోరు పొట్టిగను, చతుష్కోణముగను, నీలవర్ణమును గలిగిన అది హృద్రోగసూచకము (చూ. 12 వ పటము)



పటము ౧౩

సన్నముగను, వంకరగను, పొట్టిగను నున్నగోరు వెన్నెముకకు సంబంధించిన రోగముం దెచ్చిపెట్టును. (చూ. 13 వ పటము)

తెల్లటి మచ్చలు అర్ధచంద్రవంకలవలె నున్న అది రక్తహీనతను, బలహీనతను, కొన్నిచోట్ల అజీర్ణమునుగూడ నిరూపించును. (చూ. 14 వ పటము)

గోరు మొదటినుండి చివరవఱకు పెరుగుటకు ఆరు మాసములు పూర్ణముగ



పటము ౧౪

పట్టును. కొన్ని వ్యాధు లెప్పుడు వచ్చినవి సరిగ చెప్పవచ్చును.

గోరు నొక్కి చూచునప్పుడు రక్తము ఒక్కసారి పైకి ఉబుకునట్లు కనుపించును. అట్లు కనపడునప్పుడు ఈ క్రింది విషయముల ముఖ్యముగ జ్ఞాపకమునందుంచుకొనవలెను. గోరులో నెఱ్ఱనైన రక్తము తగ్గినప్పుడు రక్తహీనత, అందునుండి ఉబ్బు లేక నంజువ్యాధి కలుగు. ఈ రక్తహీనత కనురెప్పలలోగూడ చూడవచ్చును. గోరులో నీలిరంగు రక్తము కానుపించిన హృద్రోగము. ఆ రం గెంత యెక్కువగనున్న అంత రోగాధిక్యము కానుపించును. గోరులో పసుపు



పటము ౧౫

రంగు కానుపించిన అది కామెర్లరోగమును సూచించును. పసరు నెత్తురును విఱచును.



ఇండోనీసిలోను వింత ఆచారము: భక్తులు సూదులతో శరీరమును గ్రుచ్చుకొనుట అచ్చట ఒక ఆచారమయినది. ఒకభక్తుడు సూదులతో వీపును గ్రుచ్చుకొనియుండుట చిత్రమున గానవగును. G. S. A.




౨. పతిపూజకై అనసూయ పూలుగుచ్చుట

అందుచే రక్తము పసుపువర్ణమును గలిగి యుండును.

ఈపైన నుదాహరించిన సర్వవిషయములు జ్ఞప్తియం దుంచుకొని రోగనిర్ధారణ చేయవలెను. రోగాధిక్య లక్షణము కానుపించునప్పుడు ఆయుర్దాయవిషయ మాలోచింపవలసినదే గదా! కొందఱు చేతిమణికట్టు రేఖలంబట్టి ఆయుర్దాయము చెప్పుదురు. ఆ రేఖలు సాధారణముగా మూడుండును. రేఖకు 27 సం॥ ప్రమాణము చెప్పుదురు. అందుచే మూడు రేఖలు పూర్తిగ నుండిన వారికి 81 సం॥లు, 2 రేఖలుండిన 54 సం॥, ఒకరేఖయేయుండిన 27 సం॥ను వయస్సని తెల్పుదురు. ఈ రేఖలనే మణికట్టురేఖలని కొందఱందురు. మొత్తముమీద మూడు రేఖలు గొలుసుకట్టుగ పూర్తిగనుండిన దీర్ఘాయుర్దాయమని చెప్పవచ్చును. కంకణరేఖలకు చూ. 15-వ పటము.



'సాధు' K. R. S.

# సువర్ణము

'కుమారదేవ

(గతసంచిక తరువాయి)

మలినము మట్టితోఁ గలసి మాసినవు లంటఁగ రాకనుండి, నిర్
జలమును, పారదంబు నిడి క్షాళనముం బొనరించి, మీఁద ను
జ్జ్వలత రహింపఁజేయఁగను బావకు నేస్తముఁ గూర్చ నాతఁడున్
సలలిత మానసుండగుచు సంస్కరణంబొనఁగూర్చెఁ బ్రీతితోన్.

నిను గని ముదమందుచు నయ్యనఘుం డటంకశాల కనుప నచ్చట నీకున్
ఘనులు శ్రమకోర్చి యక్షరతను గలిగించిరి నికృష్టతను బాసి దయన్.

అడవిం బొల్చిన నెల్లికాయను, మఱిం గర్ణోనిధిం బొల్చు ను
ప్పొసఁగూర్పంగలవై వచిత్ర మెటులో హా! వహ్ని కారుణ్యమున్
గడఁజేసెన్ మన బంగరయ్య యయినన్ వహ్వా మహాయోగ మి
ట్లపరంగావలదే యటంచుఁ గనువా రబ్రంబునుం బొందఁగన్.

బంగారం బంగారం - బంగారం జేరినంత హంగొందును బ
ల్సింగారంబును నగుఁ గీర్తిం గాంచఁగఁ గోరె నగ్ని దేవుం డదిరా!

పేఁడిన వేడి దాఁకియును వేడిమి వేల్పుల వేడికోలు కి
గ్గాడిద గాఁకటంచు మది గాటపు విశ్వసనంబు వ్రాని మా
గాడిదవన్నెతోడఁ బలుగాకులపాలయిపోవుచున్న లోఁ
కైడిచెలంగువాని దనపాటికళల్ మెఱుఁగూన్ప నెంచియున్.

ప్రవరాఖ్యాది మహామహావళి సమర్చా పాత్రుఁడైనట్టి హ
వ్యవహుం డీపని సేయుటన్ మనము నైజాలోచనంగాదు నా
నవునా? యూతని పారమార్థికత యేమాయంచు నింతెంచవ
ద్దె? విభాత్వం బెది బంగరంబునకు సంధింపన్ మదిం బూనునో!

జ్వాలాజాల జటాల నైజవిభవస్ఫాయత్ప్రకారంబు సో
ద్వేలాడంబరమై చెలంగినపు డెంతే పూన్కి వైశ్వానరుం
డాలా గాయటవీస్థలిన్ శిలవలెన్ హార్ద్వందు బంగారమున్
హేలం గాంతులఁ గూర్పసాగ తనదై వైకప్రయత్నంబునన్.

పలుకాకల కోరిచి దెబ్బల కోరిచియుంటఁ జేసి ఫలముగనితి వీ
వల రత్నంబులకును మేల్లలి గూర్పఁగఁజాలి వన్నెలంగాంచి తహో.

విద్దియచే గర్వంబును - బెద్దల హసియించుటయును వృద్ధియగు లలిఁ
పెద్దమ్మా నీ యిప్పటి - పెద్దఱికము చేత నిట్లు బెడిసిపడియెదే!

త్రోపుత్రోపున కొనరంగ దొర్లిదొర్లి - దెబ్బదెబ్బకుఁ దలకాయ దిమ్మవట్ట
నోర్పికొని మోటుఱలాయె నుర్విఁబూజ్య-విగ్రహము లోర్మిపంక్తికు వెలలుగలవె?

నినుమించిన యపరంజిఁ గని నిరక్షరకుక్షివనుచు నిందింపకు నీ
చుని సాంగత్యముచేఁ గలిగిన దోసముసుమ్మి నాలకింపుము పైపఁ.

అపహాసంబును జేతువే యిపుడు నీచాత్మకసంబంధివై
యపరంజిం గని గ్రుడ్డునుం గదిసి "హీ యందంబె లే" దనుచుఁ బ
ల్లపరీభావము సేసినట్లు జగతిన్ లావణ్యగర్వాంధులి
ట్లపహాసంబును జేతు రార్యజనసమ్మాచార వేషంబులన్.

అక్షరములు నాలు గలవడినంతనే చిననాటి సుహృదయమును సహించు
సౌందర్య మొక్కింత యందినయంత, నిరాడంబరత్వ ప్రహరణ మొసఁగు
జనులలోఁ దిరుగాడుటను గాంచినంతనే స్థైర్యంబు గంగలో జారవిడుచు

జనమనోవశ్యంబుఁ జవిగొన్నయంతనే హెచ్చుతగ్గులరీతి విచ్చిపాఱు
క్రమముగా నిట్లు పైగుణరాశి కలుగ-నధమసహవాసమున నైచ్య మలవడుఁగద?
కొంచెపు న్నరు సంగతి కూర్పఁగావె - సొంపు బోఁద్రోసి దురితపరంపరలను?

చంచలభావమున్ మఱఁగి సర్వజనంబుల కూడుఁ గుడ్వఁగా
నించుకనైన జంచువిడి యొందఱిచేతులో మాఱి మాఱలం
ఘించుచు నాసలున్ జిగురులెత్త నశింపఁగఁ గైతవప్రమో
దాంచితమౌ విలాసపు విహారము స్వైరవిహారముం గనన్.

ఇటు మాఱుచుఁ బోఁగాఁ గో-మటిసౌకా రొకఁడు లోహమంజూష నిడెన్
పటుతరమౌ తాళంబుల-నటుపై బిగియించె నూపిరాడని రీతిన్.

త్రుళ్ళిపడి తలబిరుసెక్కి గ్రేళ్ళురుకుచు-మిట్టిపడువార లెన్నాళ్ళు నెట్టికొందురు?
పరిచేతనో సేనాఁడో యెట్టి ప్రతిఫ-లంబునందుదు రద్ది కాలంబ యెఱుఁగు!

త్రుప్పుకంపును గాలిలేమిని దుర్భరంబగు గాలిలో
'గప్పుచిప్పు'ని కుయ్యకుండఁగఁ గ్రాలుచుంటివిగాదె? బ
చ్చెప్పుడేనియుఁ దల్పుతీయఁగ నింత వీచెడు గాడ్పుచేఁ
దప్పుకొంటివి ప్రాణహానిని ధారుణించబడు పాట్లకై.

అందుండి విమోచనమును - బొందితి వొక భూషణార్థిప్రాప్తిమెయిన్ నీ
బందముఁ దొలగింపఁగ నా-నందము సత్ప్రయోజనంబు కలుగఁగాన్.

నిప్పున వేయఁ బావకుఁడు నీవగు శైశవ మాదినుండి నీ
యిప్పటి దుర్గతింగని మహిన్ జెమువారిని జేరఁగా నిం
బిప్పగిదిన్ లభించునని యేర్పడ గాథలు సుద్ద లెంకయున్
జెప్పుచు నీదుస్నేహితుని జెచ్చెరఁ ద్రోలఁ బ్రయత్నముంబడెన్.

గరుడమునుగూర్చి నాకొఱగాని నాలు-గక్షరంబుల చదువంచు నాయక్షరముల్
మొదట నీ స్వాది పరువత్తిపోవఁజేసి - అఱగొఱచదువుకన్న నూన్యతయె మేలు!

వింద్రోపథ్యములైన వాక్యముల గర్వీభూతచేతస్కులున్
గంద్రో సత్యములైన మార్గముల దాష్ట్యార్యాప్త వ్యాపారులున్
వేంద్రప్రంబంది యథార్థముల్ తెలిపి యజ్ఞానప్రబోధాత్ములై
తింద్రింతుంగద? మంచిచెడ్డలరయం జెల్వొం బ్రయోగింతురే?

సినేస్తకాని వీడం-గా నింతే నిచ్చగింపక తనకు నీతుల్
పగాని వచించెడు నాపై-శ్వానరు వాక్కులఁ బెడచెవిఁ బెట్టితివి కదా?



# పురాతత్వశాస్త్రము

డా. పి. శ్రీనివాసాచార్యులు

ఏ దేశమునందలి ప్రజలకయినను జాతీయతాజ్ఞాన మేర్పడుటకు ఆదేశపు ప్రజలకు అనాదినుండి వచ్చిన నాగరికతయొక్క వ్యక్తిత్వమే కారణము. తన దేశముయొక్క పురాతనచరిత్ర, నాగరికతలయొక్క జ్ఞానమువల్లనే మనుజునికి తనయందును, తన దేశమునందును విశ్వాసమును, ఆత్మగౌరవమును నుదయించును. ప్రాచీనచరిత్ర, నాగరికతల జ్ఞానమునకు కారణభూతము లయినవానిలో ముఖ్యమయినది పురాతత్వ శాస్త్రము.

పురాతత్వశాస్త్ర మన నేమి? దానిని పరిశీలించుటవలన కలుగు ఫలమేమి? ఇంతవరకు పురాతత్వ విషయమున మనదేశమున ఎంతపని జరిగినది? ఇంకను ఏమిచేయవలసియున్నది? — ఇత్యాది విషయములు విమర్శనీయములు.

పురాతన నాగరిక జిజ్ఞాసయే పురాతత్వశాస్త్ర ప్రయోజనము. ఈశాస్త్రము వివిధభాగబహుళము. ఈ విభాగములలో నొక్కొకటి ఒక్కొకస్వతంత్రశాస్త్రముగ వికాసము చెందుచున్నది; ఉదాహరణమునకు: (౧) శాసనశాస్త్రము, (౨) నాణకశాస్త్రము, (౩) నిర్మాణవాస్తు, శిల్పశాస్త్రములు, (౪) ప్రతిమాశాస్త్రము, (౫) చిత్రలేఖనము మొదలయినవి. మరియు పురాతత్వశాస్త్రమునకును, మానవ్యకశాస్త్రమునకును (Anthropology), మానవజాతిశాస్త్రమునకును (Ethnology) అత్యంతసంబంధము కలదు.

ఆధునికకళలందును, విద్యలందును, వ్యవహారాదికములందును పురాతనశాస్త్ర, కళా సంప్రదాయాదుల ప్రాబల్య మెంతవరకుగలదో, వాని పరిణామవికాసములకు పురాతత్వశాస్త్ర మెంతవరకు తోడ్పడినదో ఆశాస్త్రపఠనమువలన మనకు తెలియగలదు.

ఆధునిక భారతీయకళావిన్యాసము నొకమారు గమనింపుడు. ఆంధ్ర, బంగాలీ చిత్రకళావిన్యాసములందేకాక పశ్చిమదేశకళాసంసర్గమువలన మార్పుచెందక హైందవవ్యక్తిత్వమును నిలుపుకొన్న ప్రతిరాష్ట్రీయ చిత్రకళావికాసమునందును అజంతా చిత్రకళాప్రభావము గోచరము కాగలదు. అజంతాచిత్రకళ ఒరవడిగ ఆయారాష్ట్రీయ చిత్రకళాసంప్రదాయములు కాలానుగుణముగా వికాసము చెందినవని చెప్పవలెను.

పురాతత్వశాస్త్రమున ప్రధానమయిన విభాగములు మూడు: (౧) శాసనశాస్త్రము, (౨) నాణకశాస్త్రము, (౩) పురాతత్వశాస్త్రము (Archaeology proper).

శాసనశాస్త్రము:—శాసనములు త్రివిధములు: (౧) శిలా స్తంభములమీదను, దేవాలయపు గోడలమీదను, చెలువుకట్టలమీదను, స్తూపములమీదను చెక్కబడిన శాసనములు, (౨) రాగిరేకులమీద చెక్కిన శాసనములు, (౩) నాణెములమీదనున్న శాసనములు. ఇవికాక ముహరులపైనను, ఇటికలమీదను ఉన్న శాసనములు, బౌద్ధభిక్షువుల శారీరకధాతువులు, భస్మము ఉంచిన బరణులు, కుండలు మొదలగువానిమీద నున్న శాసనములుకూడ ముఖ్యమయినవే.

హిందూమహాయుగచరిత్ర నిర్మాణమునకు శిలా, తామ్ర, నాణకశాసనములే ముఖ్యాధారములు. ఆముష్మికసుఖాసక్తులైన ఆనాటి హైందవులు చరిత్రలు వ్రాసియుంచలేదు. వారువ్రాసిన గ్రంథములలో నచ్చటచ్చట కొలదిగ దొరకు కొన్ని చారిత్రకాంశముల్తక్క మిగిలిన చరిత్రనిర్మాణమంతయు శాసనములమీదనే యాధారపడియున్నది. ఈ గ్రంథములందు లభించు చరిత్రాంశముల యాథార్థ్యమునుగూడ శాసనముల యాధారముననే తెల్పుకొనవలసియుండును.

శిలాశాసనలభ్యములయిన విషయములను వదలివేసి మనము హిందూమహాయుగ చరిత్రమును వ్రాయబూనుకొనినచో అశోకచక్రవర్తి చరిత్రమునంతను వదలవలసియేవచ్చును. శాసనములే లేనిచో సింహళదేశ

చరిత్రలైన దీపవంశ, మహావంశములపై నాధారపడే, అశోకుడు బహుప్రసిద్ధుడై తన యన్నదమ్ముల నందరను జంపెననియు, బౌద్ధమతము నవలంబించినంతనే చాల సాధువై రాజర్షి యయ్యెననియు, ఇంక నెన్నో యిటువంటి పుక్కిటిపురాణములను నమ్మవలసివచ్చును.

కళింగఖారవేలుడు, మధురక్షత్రపులు, నహపానుడు, రుద్రదాముడు, సముద్రగుప్తుడు, రెండవ చంద్రగుప్తుడు, యశోధర్ముడు, వల్లభీరాజులు, పరమారులు- వీరందరి చరిత్రమును సమగ్రముగ శాసనములమీదనే యాధారపడియున్నదని చెప్పవచ్చును. ఇక దక్షిణాపథమున శాతవాహన, పల్లవ, చోళ, పాండ్య, రాష్ట్రకూటు, చాళుక్యవంశములవారి చరిత్రములు, కాకతీయులు, రెడ్లు, విజయనగరాధీశులు, వీరి చరిత్రములు, అన్నియు శాసనాధారముననే రూపొందుచున్నవి.

ఆంధ్రశాతవాహనుల చరిత్రకు నాణెక, శిలాశాసనము లెంతముఖ్యమయినవో యించుక గమనింతము. వారి చరిత్రమునకు నానాఘాటునందును, నాసికయందును (ముఖ్యముగా ఆంధ్రశాతవాహనరాణియగు బాలశ్రీశాసనము) ఉన్న శాసనములును, గౌతమీపుత్రుని వైజయంతీశాసనమును ముఖ్యతమములు. ఖారవేలుని హాథీగుంఫాశాసనముకూడ చాలవఱకు నీవిషయమున మనకు సాయపడును.

ఆంధ్రశాతవాహనరాజ్యవిస్తీర్ణనిర్ణయమునకు శిలాశాసనములును, నాణెములును దొరకినస్థలములే యాధారములు. ఆంధ్రశాతవాహనుల రాజ్యము పశ్చిమసముద్రమువఱకును వ్యాపించెను.

బాలశ్రీ తన మనుమడగు వాసిష్ఠీపుత్రపులుమాయి కాలమున, తన కుమారుడగు గౌతమీపుత్రశాతకర్ణి విజయముల నభివర్ణించుచు నొకశాసనమును చెక్కించెను. గౌతమీపుత్రుడు శకులను, యవనులను, పహ్లవులను ఓడించెననియు, క్షత్రపులను రూపుమాపెననియు, ఆంధ్రవైభవమును పెంపొందించెననియు ఆశాసనము చెప్పుచున్నది. ఇందు దాతడు జయించిన రాజ్యముల పట్టికకూడ కలదు. గుజరాత్ (సౌరాష్ట్రము), మాళవము, మధ్యహిందూదేశమునందలి కొన్నిభాగములు, బేరారు (విదర్భ), నాసిక, పూనాప్రాంతములు — ఇవన్నియు గౌతమీపుత్రునికి వశమగుటచేత, నితడు నహపానుని రాజ్యమునంతయు నాక్రమించెనని విశదమగుచున్నది. క్షత్రపులను గౌతమీపుత్రుడు రూపుమాపెనని చెప్పిన ఇతని తల్లిమాటలు వట్టియత్యుక్తులై యుండవు.

గౌతమీపుత్రుని వైజయంతీశాసనము అతని పదునెనిమిదవరాజ్యవత్సరమున చెక్కినది. బహుశః నహపానుని ఓడించివచ్చుచు మార్గములో ఈశాసనమును చెక్కించెనేమో.

ఇతని కొడుకగు వాసిష్ఠీపుత్రపులుమాయికాలమున ఆంధ్రశాతవాహనులు రుద్రదామునిచేత పరాజితులైరి. రుద్రదాముడు వాసిష్ఠీపుత్రపులుమాయిని రెండుసారు లోడించినను అతనిని తుదముట్టించలేదు. ఇందుకు కారణము అతనితోడి సంబంధబాంధవ్యమే. బౌల శ్రీరాణిశాసనమునందే రుద్రదాముని కొమార్తెను వాసిష్ఠీపుత్రపులుమాయి పెండ్లాడెనని చెప్పబడియున్నది.

గౌతమీపుత్ర శ్రీయజ్ఞశాతకర్ణినిగుఱించి మనకు తెలియవచ్చిన దంతయు అతని శాసనములవలననే.

నాణెములు:— నాణెములుకూడ శాసనోక్తవిషయములను స్థిరపఱచుచుండును. ఆంధ్రశాతవాహనుల నాణెములు మన కనేకములు దొరకినవి. వీనిలో చాల భాగము సీసపునాణెములు. ఈనాణెములన్నియు ఫలానరాజులవని దృఢముగ చెప్పవీలులేకున్నను కొన్నికొన్ని ప్రత్యేకలక్షణములనుబట్టి వానిని కొన్నికొన్నిరకములుగ విడదీసి వానికాలమును నిర్ణయింపవచ్చును.

ఈ నాణెకశాసనములభాష ప్రాకృతము. ఆంధ్రశాతవాహనులు ప్రాకృతభాషాభిమానులనియు, వీరికాలమున ప్రాకృతభాష కత్యంతప్రాముఖ్యము, నభివృద్ధియు కలిగెననియు, 'సత్తసాయి' (సప్తశతి), బృహత్కథ — ఇత్యాది ప్రాకృతగ్రంథములు రచియింపబడిన వనియు దేశమున గల యైతిహ్యమును వీరి శాసన, నాణెకభాష బలపఱచుచున్నది.

గౌతమీపుత్రుడు నహపానుని ఓడగొట్టి వాని రాజ్య మాక్రమించి, క్షత్రపులను నిర్మూలించెనన్న విషయమును నాణెములు ఇంకను ధ్రువపఱుచుచున్నవి. నాసికవద్ద జోఘల్తెంబిలో ౧౯౦౬-వ సంవత్సరమున రమారమి ౧౩,౦౦౦ ల నాణెములు దొరకినవి. వీనిలో ౪,౦౦౦ నహపానునివి; మిగిలిన ౯,౦౦౦ ను నహపానునివే కాని వానిమీద గౌతమీ పుత్రుని లాంఛన, చిహ్నములు మరల ముద్రింపబడినవి. గౌతమీ పుత్రుడు నహపానుని జయించి, వాని నాణెముల నన్నిటిని సేకరించి వానిమీద మరల దనముద్ర కొట్టించెనని దానివలన దెలియుచున్నది.

గౌతమీపుత్ర శ్రీయజ్ఞశాతకర్ణి యొండినాణెము లించుమించుగ క్షత్రపులనాణెములవలెనే యున్నందున బహుశః ఇతడుకూడ క్షత్రపులను జయించి ఆంధ్రశాతవాహన రాజ్యమును విస్తరింపజేసెనేమో యని సందేహము గలుగును.

ఆంధ్రశాతవాహనులు మాతృనామాంకితు లైనట్లు శాసనములవల్ల తెలియవచ్చుచున్నది. బాలశ్రీరాణినామాంతరము గౌతమి. తన మతసురువునుబట్టి గామె యామెకు గౌతమియని పేరు కలిగెనని; లేక యది గోత్రమేమో? ఆమెకుమారుడే గౌతమీ పుత్రుడు. నాసికశాసనమునం దీతడు బ్రాహ్మణుడనియు, క్షత్రియుల యుక్కడగించె ననియు చెప్పినందువల్ల బహుశః ఆంధ్రశాతవాహనులకు బ్రాహ్మణాంశ మున్నట్లు తోచుచున్నది.

శాతవాహనుల శాసనములవలన మన కాకాలపు రాజ్యాంగవ్యవహారము లంతగా దెలియకపోయినను, సంఘపరిస్థితులనుగూర్చి చాలవరకు తెలియుచున్నది. ఆకాలమున బౌద్ధమతమును, బ్రాహ్మణమతమునుగూడ ప్రబలుచుండెను. బౌద్ధభిక్షువుల నివాసమునకై ఆకాలమున బౌద్ధమతమునం దభిమానాదరములుకలవారు అనేక గుహలను నిర్మించుచువచ్చిరి. ఇట్లు దేశము బౌద్ధమతమునం దత్యంతాదరము చూపుచువచ్చినను అశ్వమేధాది యాగములను జేయువారుకూడ లేకపోలేదు. ఆకాలమున హైందవేతరులైన శక, పహ్లవులుకూడ హిందూమతము నవలంబించి హిందూరాజులతో సంబంధ బాంధవ్యములను కలిగించుకొనుచువచ్చిరి. ఇందులకు రుద్రదాముని కూతురు వాసిష్ఠీపుత్రుని పెండ్లాడుటయే తార్కాణము.

శాసనములును, నాణెములును మన ఇతిహాస నిర్మాణమున కెంత యుపకరించునో తెలుపుటకై ఆంధ్రశాతవాహనచరిత్రము నింతవిపులముగ తడవవలసి వచ్చినది. ఈవిధముగ హిందూమహాయుగ చరిత్రమునందు ఏయేవిభాగములరచనమునకు సమగ్రముగను, అసమగ్రముగను శిలాశాసనములు, నాణెములు ఆధారములైనవి వర్ణించుటకు ఈవ్యాసమున సాధ్యముకాదు.

నిర్మాణవాస్తువు (Architecture) :— ఈ శాస్త్రము నేర్చుటకుకూడ ఈకాలమున భయమగును. ఈశతాబ్దిపరిస్థితులకును, స్థితిగతులకును ప్రాచీననిర్మాణ వాస్తుపద్ధతులు సరిపడకపోవచ్చును. అయినను మన దేశమునందు మనవ్యక్తిత్వమును స్ఫురింపజేయునట్టి వాస్తుపద్ధతులలో నైపుణ్యమును సంపాదింపవలెనుగాని పాశ్చాత్యవాస్తుపద్ధతుల ననుకరించుటలో అర్థములేదు. పాశ్చాత్యవాస్తుశాస్త్రజ్ఞులు వారిదేశపు శీతోష్ణస్థితిగతులనుబట్టియు, వారికి సుకరముగ దొరకు పరికరములను బట్టియు, పరంపరానుగతముగ వచ్చు వారి సంప్రదాయ, సభ్యతలనుబట్టియు వారు కట్టడములను నిర్మించుకొనుచున్నారు. కాని మనదేశమునమాత్రము పాశ్చాత్య సంసర్గమువల్లను, ప్రభుత్వమువారు నిర్మించు భవనముల సాదృశ్యమువల్లను మనభవనములు, మననిర్మాణములు-అన్నియు పాశ్చాత్యనిర్మాణముల అనుకరణములుగ మారుచున్నవి. సిమెంటుభవనములు, ఉక్కుకంబముల భవనములు, పదికిమించిన అంతస్తులు కలిగిన హర్మ్యములు స్థలము చాలక జనబాహుళ్యముచేత అవస్థపడుచున్న నీ న్యూయార్కు, లండనులవంటి నగరరాజములకో యుక్తముగ నుండునేమోకాని అట్టివి మన పట్టణముల కావశ్యకములు కావు. ఇట్టి నిర్మాణములు వచ్చుటకు ప్రధానకారణము మనకు మన ప్రాచీనవాస్తుశాస్త్రపద్ధతులను నేటి మనస్థితిగతుల కుపకరించునట్లు

చేసికొనుట తెలియకపోవుటయే; మన వాస్తుశాస్త్ర సంప్రదాయములమీద మనకుగలనిర్లక్ష్యము, నిరాదరములే.

హైందవుల పురాతనపుకట్టడములను గూర్చి ఒక చిన్నవ్యాసములో వ్రాయబూనుకొనుట సాహసమైనపని. కాని ఒకటి రెండు విషయములు మాత్రము గమనింపవలెను. మానసారము మొదలగు మన ప్రాచీన శిల్పశాస్త్రములను వదలి కట్టడములనే పరీక్షింతము. అత్యంతపురాతననిర్మాణములు మనకు హిందూదేశమున గనబడవు. ఇందుకు కారణము ఆకాలపు నిర్మాణము లన్నియు దారువుతో కట్టబడియుండుటయే. బౌద్ధమతారంభకాలమునుండి మన కనేకములైన కట్టడములు కాన్పించుచున్నవి. బౌద్ధస్తూపములు, గుహలు, చైత్యములు మొదలగు నిర్మాణము లెన్నియో యున్నవనికూడ మనలో చాలమందికి తెలియదు. అమరావతీ స్తూపము, భట్టిప్రోలుస్తూపము తెలుగుదేశమున గలవనియైన ప్రతి తెలుగువానికి తెలియునా? మన పూర్వుల గొప్పతనమునుగూర్చి కని, విని, ఆనందించని వానికి వ్యక్తిత్వ మెటులుండును?

గవర్నమెంటు పురాతత్వశాఖవారి నివేదికలయందు గుప్తులకాలమునందలి కట్టడముల పైఖరినిగురించి నట్టికాని, అజంతా, ఎల్లోరా, బాగ్ గుహలనుగురించినట్టికాని, మహాబలిపురరథములను గూర్చినట్టికాని వట్టి వర్ణనలను చదువుటకంటె, వాటియందో, మరి యేశిల్పశాస్త్ర గ్రంథమునందో, లేక యేభారతీయ చిత్రకళా గ్రంథమునందో యుండు వాని ఛాయాచిత్రములను చూచుట మేలు. మధుర, తంజావూరు, చిదంబరం, కంచి, హాలేబీడు, పట్టడకల్లు, అయ్యావళే దేవాలయములను జూచి, ఆనందించి, నేటికిని అచ్చెరువొందనివా రుండరు. దేవాలయవాస్తువాసనయే యెరుగని మనలో గొందరు వాటిని చూచుటయే యొకగొప్ప.

ప్రతిమాశాస్త్రము:— హిందూ, జైన, బౌద్ధ మతములకు సంబంధించిన దేవతావిగ్రహములనుగురించి తెలుపుశాస్త్ర మిది. ఏమతమున కామతమునకే గొప్ప పురాణములు పెరిగి, ఆయామతములకు సంబంధించిన దేవత లెందరో వెలసిరి. ఆయామతములకు సంబంధించిన దేవతావిగ్రహములను జేయుట ఒక క్రమపరిణామ, వికాసములకు లోనైన ఒకకళగ రూపొందినది. భారతీయదేవతావిగ్రహములన్నిటిలో దక్షిణాదిని తయారు చేసినవి ప్రశస్తమయినవి. దక్షిణదేశపు కంచువిగ్రహములను పరిశీలించి, దక్షిణభారతదేవతావిగ్రహపరిణామవికాసములనుగురించి తెలిసికొనవలె నన్న కొన్నిసంవత్సరములకాలము పట్టును. ఈ విగ్రహముల వర్ణనాతీత సౌందర్యమున కచ్చెరువంది వేలకువేలు రూపాయలు ఖర్చుపెట్టి పాశ్చాత్యు లీ విగ్రహములను తమదేశమునకు దీసికొనిపోయి తమ భవనములందో, చిత్రవస్తుప్రదర్శనశాల (మ్యూజియము)లయందో పెట్టుకొనుచున్నారు.

శిల్ప, చిత్రకళలు:— చిత్రకళయందును, శిల్పకళయందును అతినిపుణులయిన తెలుగుదేశపు ప్రాచీన కళాకుశలుల కళావిజ్ఞానమునకు అవశేషములుగ నిలిచి యున్నవన్నియు నేడు లండనునగరమునందలి బ్రిటిషు మ్యూజియమునందును, ప్యారిస్‌నగరమునందలి 'మ్యూజె గిమె' యందును భద్రపరుపబడియున్నవి వానిని వర్ణించిన పాశ్చాత్యకళాభిజ్ఞుల రచనలే నేటికిని మనకు జాతీయతావిశ్వాసమును కలిగించు వీరగీతములు.

శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమ "అమరావతీస్తూపము"నం దిట్లు వ్రాసిరి: "చలువ రాతిమీద జిత్రితమయిన యీ అమరావతీ శిల్పసంపదను సూక్ష్మముగ బరిశీలించినచో చతురులయిన బౌద్ధయోగము నాటి యాంధ్రశిల్పకళావిశారదులచేతిలో నా చలువ రాయి తన కాఠిన్య మంతయు వీడి, ఎట్లుతీర్చిన నట్లు చక్కనను మైనపుముద్దగా మారినదని తోపకమానదు".

నేడు మద్రాసు చిత్రవస్తు ప్రదర్శనశాలయందున్న అమరావతీశిల్పములను బరీక్షించువారు నూటికి ఆంధ్రులలో నరుదు. "ద్వీపాంతరములనుండియు, దేశాంతరములనుండియు వేలకొలది బౌద్ధభక్తబృందము నాకర్షించుచు, నయనపర్వము గావించుచుండిన యీ మహాచైత్యము విలసిల్లిన (అమరావతీ) క్షేత్రము ఆమహావిభూతియెల్ల హరించిపోవ 'దీపాలదిన్నె' యనునామ

మును మాత్రమే పరిశిష్టముగ నిలుపుకొని 'బ్రదికి చెడ్డ యాంధ్రుల పూర్వవైభవంబు' ననేకశతాబ్దులనుండి కన్నీరు మున్నీరుగ వర్ణించు మహావాహిని కృష్ణవేణీ స్రవంతితో శ్రుతికలిపి నేటికిని హృదయ విదారణముగ విషాదగీతి నాలపించుచునే యున్నది."

హైందవశిల్పకళ ఎన్నియోరీతులను వెలయించినది. మౌర్య, గాంధార, అమరావతి, గుప్త, చాళుక్య, కాకతీయ, విజయనగరరీతులలో నొక్కొక్కదాని పరిణామ, వికాసములను తెలిసికొనుటకు జీవితకాలము నంతయు ధారపోసినను జాలదు.

మన ప్రాచీనచిత్రకళావశేషములతో గూడిన స్థలము లింకను చాలకొద్దిగ మిగిలియున్నవి. వీనిలో ముఖ్యమయినవి బౌద్ధచిత్రములతో వలరారు బాగ్, అజంతాగుహలును, చోళులనాటి, తెలుగు నాయకప్రభువులనాటి చిత్రములతో విలసిల్లు తంజావూరు దేవాలయమును. గుప్తులకాలమునాటి చిత్రకళయంతయు నశించినది. కాకతీయులకాలమునగూడ చిత్రకళ వికసించెనమటకు శాసనప్రమాణముమాత్రము మిగిలియున్నది.

అజంతాచిత్రములు జగద్విదితములు. మధ్య ఆసియాయందున్న చిత్రములుతప్ప మిగిలినవేవియు వానికి సాటిరావు. వాని యాధిక్య, ప్రాశస్త్యములను గూర్చి పాశ్చాత్యులెందరో వర్ణించియున్నారు. ఇప్పుడు హెచ్. ఇ. హెచ్. నైజాంవారి పురాతత్త్వశాఖవారు ఆచిత్రముల నన్నిటిని జాగ్రతగ కాపాడుచు, వానిని పోయి వీక్షించుటకు కావలసిన అనుకూల్యములు చేసి యున్నారు. ఆశాఖ డైరెక్టరుగారగు యజ్దానీసాహేబుగారు అజంతాచిత్రములను ఉన్నవున్నట్లుగ వ్రాయించి అచ్చువేయించియున్నారు. ఆధునికాంధ్రచిత్రకళయం దభిమానమును, ఉత్సాహమును గల ప్రతితెలుగువాడును అజంతాచిత్రములను ఛాయాచిత్రములయందయినను జూచితీరవలెను.

పురాతత్త్వశాస్త్రము :— భారతీయపురాతత్త్వశాస్త్రము లోకమునకుజేసిన మహోపకారము సింధుతీర నాగరికతను బయలుపరుచుట. ఈనాగరికతనుగూర్చి ప్రస్తావించకవదలుట అసమంజసము.

మహమ్మదీయయుగమునకుపూర్వము హిందూదేశమునకు చరిత్రయే లేదని కొంతకాలముక్రిందట వాడుకలోనుండెను. హైందవార్యగ్రంథములను పాశ్చాత్యులు చదువుటకు ప్రారంభించినపిమ్మట ఈయపవాదము పోయి, హిందూదేశమునకు వేదకాలమునుండి చరిత్ర కలదని తేలినది. కాని ప్రాచ్య, పాశ్చాత్య పరిశోధకపండితులు ప్రాచీనార్యనివాసభూమి యగు ఉత్తరహిందూస్థానము నెక్కువ యభిమానించి, దాని చారిత్రమున కెక్కువగ కృషిచేసి దాక్షిణాత్యులైన ద్రావిడుల సంస్కృతినిగూర్చికాని, ఆచార వ్యవహారములనుగూర్చి కాని ఎక్కువగ పరిశోధింపక విడుచుటచేత దక్షిణహిందూదేశచారిత్రమున కింతవరకు తగినరూప మేర్పడలేదు. ఇప్పుడిప్పుడే ఈలోపము కొంతవరకు తీరి ద్రావిడనాగరికతకు, సంస్కృతికి కొంతకొంత ప్రాముఖ్యము కలుగుచున్నది. ఇందులకు కారణము సింధుతీరమునందు జరిగిన పురాతత్త్వపరిశోధనమే. సింధుతీర ప్రాచీననాగరికతనుగూర్చి ఇటీవలనే డైరెక్టరు జనరల్‌గారగు సర్ జాన్. మార్షలుగారి సంపాదకత్వమున మూడు పెద్దసంపుటములు ప్రకటితములయినవి. సుమేరియా, ఈలముల ప్రాచీననాగరికతకును ఈసింధుతీర నాగరికతకును సంబంధము కలదని ఎందరో వక్కాణించిరి. ద్రావిడులతో బహుశః ఈసింధుతీరనాగరికులకు సంబంధమున్నదేమోయనికూడ కొద్దిమంది చెప్పుచున్నారు గాని ఎవరును ఈవిషయమున ఇంకను ఎక్కువగ పనిచేయలేదు.

ఇది యటుండ, భారతీయ పురాతత్త్వశాస్త్రము ప్రతిశాఖయందును చేసిన పనికన్న చేయవలసినదియే యెన్నిరెట్లధికముగ నున్నది. ఈపని నంతయు చేయు బాధ్యత మనపై నున్నది. ఒక్కసింధుతీరనాగరికతనుగురించి కృషిచేసినను మనదేశచరిత్రము నకేగాక ప్రపంచచారిత్రమునకును సంబంధించిన, ఉపయుక్తములయిన అనేక నూతనవిషయములు తెలియగలవని విద్వాంసుల యభిప్రాయము. పాశ్చాత్యవిద్వాంసు లెందరో మన పురాతత్త్వశాస్త్రమునకై తమ జీవితములను ధారపోసిరి, కాని మన కిప్పుడు స్వతంత్రముగ

బనిచేయుటకు శక్తి వచ్చినది. ప్రస్తుతము మన కర్తవ్య మేమి?

ఇదివరకు గవర్నమెంటువారే ఈ విషయమున సర్వాధికారులై సకలమును నిర్వహించుచు వచ్చిరి. వారు చేసిన సత్కార్యములలో భారతీయ పురాతత్వ శాఖాసంస్థాపన మొకటి. లార్డు క్యానింగు దొర వైసు రాయిగా నున్నప్పటినుండి పురాతత్వ శాస్త్రమునెడల మన గవర్నమెంటువారు శ్రద్ధచూపుచున్నారు. అంతకు ముందే, అనగా ౧౮౪౫-వ సంవత్సరమున మేజర్ కిట్టో, ౧౮౬౧-వ సంవత్సరమున జనరల్ కన్నింఘము గారలు ప్రాచీనస్థలములను త్రవ్వి పరిశోధనలు గావించియున్నను, ౧౮౭౦ వరకు పురాతత్వ శాఖయని ఒకటి ఏర్పడలేదు. ౧౮౭౨-వ సంవత్సరమున జనరల్ కన్నింఘమును ఈ శాఖకు డైరెక్టరుజనరలుగ నియమించిరి. వీరు ౧౮౮౫-వ సంవత్సరమువరకు పనిచేసి హిందూదేశపురాతత్వశాస్త్ర పఠనమునకు అత్యంతసహాకారకము లగు ౨౩ సంపుటములు ప్రకటించిరి. కన్నింఘముగారు తమ కిష్టమైన కొద్దిస్థలములందుమాత్రమే, అదియును ఉత్తరహిందూస్థానముననే త్రవ్వి పరిశోధనలు కావించిరి. బొంబాయి, మద్రాసు రాజధానులలో నిట్టి పరిశోధనలను జరపుటకు గవర్నమెంటువారు ౧౮౭౩-వ సంవత్సరమున బర్జెస్ దొరను నియమించిరి. వీరు ౨౩ సంపుటములు ప్రకటించి హిందూదేశమున కత్యంతోపకారము కావించిరి. వీరిద్దరుగాక మేజర్ కోల్ అని మరియొకరు ౧౮౮౧ నుండి ౧౮౮౩ వరకు మూడు సంవత్సరములు పనిచేసి మూడుసంపుటములను ప్రచురించిరి. ౧౯౦౨-వ సంవత్సరమున సర్ జాన్ మార్షలు దొరగారిని నియమించు వరకును ఈశాఖవారు చేసినపని యింతే. శాసనముల విషయమునమాత్రము హుల్ట్స్ దొరగారదివరకే ఎంతయో పని చేసి

౧౯౦౨ నుండి సర్ జాన్ మార్షలుగారి యాధిపత్యమున ప్రతిసంవత్సరము నొక నివేదికయు, అప్పు డప్పుడు 'మెమోయిర్స్ ఆఫ్ ది ఆర్కియాలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా' (**Memoirs of the Archaeological survey of India**) అనుపేర కొన్ని గ్రంథము లును ప్రచురింపబడుచున్నవి. ఈనివేదికలకును పూర్వము కన్నింఘము, బర్జెస్ గార్లు ప్రచురించిన సంపుటముల కును చాలభేదము కలదు. ఈవార్షిక నివేదికలు బయలు పడిన విషయములను, జరిగినపనిని మాత్ర మామూలాగ్ర ముగ తెలియజేయును. అంతియేకాని, ఆయా విషయము లకు సంబంధించిన యితర గ్రంథములనుగూడ పరిశో ధించి, విషయములను తరిచి వాని ప్రాముఖ్యాదులను గూర్చి చర్చించి తెలియజేయుటలేదు. పురాతత్వశాఖ వారీపని నితరులకు వదలిపెట్టియున్నారు. కన్నింఘము, బర్జెస్ దొరల గ్రంథము లట్లుకాక ఆయా విషయములను గూర్చి వ్రాసిన ప్రత్యేక వ్యాససంపుటములవలె నున్నవి.

బర్జెస్ దొరగారు పింఛనుతీసికొని వదలిపోయిన పిదప ౧౮౯౯-వ సంవత్సరమువరకు ఈశాఖను గూర్చి ఎవరును అంతశ్రద్ధ తీసికొనలేదు. ౧౮౯౯-వ సంవత్సర మున కర్జన్ దొరగారు వైసురాయిగ నుండి ఈ విషయ మున నెక్కువ శ్రద్ధ తీసుకొనుచు వచ్చిరి. కాని అప్పటినుండి ౧౯౨౬-వ సంవత్సరమువరకును జరగిన ప్రాచీనదేవాలయాదులను, త్రవ్వగా బయలుపడిన ప్రాచీనవస్తునిర్మాణాదులను శ్రద్ధతీసికొని భద్రపరచుటయే. క్రొత్తస్థలములను పరిశోధించుట కాని, ప్రాచీనస్థలములను త్రవ్విపరీక్షించుటకాని ఎక్కు వగ జరగలేదు.

౧౯౨౬-వ సంవత్సరమున రెండు లక్షలరూపా యలు ప్రాచీనస్థలములను త్రవ్వుటకును, క్రొత్తస్థలము లను పరీక్షించుటకును గవర్నమెంటువారు ప్రత్యేకముగ నొసంగిరి. కాని యింతస్వల్పధనముతో చాలచోట్ల పనిచేయుటకు సాధ్యముకాదు. అయినను ఉన్నదానిని వినియోగపరిచి ఏదోకొంతపని చేయుటచేతనే ప్రపం చమునంతను ఆశ్చర్యచకితముగ జేసినట్టి సింధుతీరపు 'వింతలు' బయల్పడినవి. ఇప్పటివరకు భారతీయ పురాతత్వశాఖవారు హరప్ప, మొహంజోదరోయను రెండుస్థలములనుమాత్రమే త్రవ్వి పరీక్షించినారు. కాని సర్ ఆరల్ స్టయిన్ గారు ఈప్రాంతమునంతను పరీ

క్షించి బెలూచిస్థానమునందే రమారమి ౫౦ స్థలము లిట్టి వున్నవని చెప్పినారు.

ఈ 'చాల్కొలిథిక్' కాలపు స్థలములేకాక, ఇంకను అంతకుప్రాచీనమయిన స్థలములుకూడ అనేకములు దక్షిణాపథమున నున్నవి. ఆదిచనల్లూరునందు దొరకిన వస్తువులే ప్రాచీనవిషయముల నెన్నిటినో లోకమున కెరుకపరిచి వాటిని ప్రాముఖ్యమునకు దెచ్చినవి. ఇతరరాష్ట్రములమాట ఎటులున్నను త్రవ్వి పరిశోధించ వలసిన ప్రాచీనస్థలములు ఆంధ్రదేశమునందే ఎన్నియో గలవు.

ఇట్టిస్థితిగతులలో గవర్నమెంటువారు ఇంత అమూల్యమయిన, అపారమయిన పనిని నిర్వహింప వలసిన బాధ్యతను వదలుకొనదలచియున్నారు. ఇంతవరకు బయలుపడిన ప్రాచీనవస్తు, నిర్మాణములను జాగ్రత పరుచు పనిమాత్రము తమమీద పెట్టుకొని, వారు ప్రాచీనములని తోచిన స్థలములను పరిశోధించి త్రవ్వి పురాణవస్తు నిర్మాణములను బహిర్గతము చేయవలసిన కార్యభారము నితరులకు వదలివేయుచున్నారు. ఇంతకు మునుపు పురాతత్త్వపరిశోధనలు స్వదేశీయులుకాని, అన్యదేశీయులుకాని ఎచ్చటను త్రవ్వకూడదని శాసననిషేధ ముండెను. ఇట్టివిషయములయందు పని చేయవలసి వచ్చినను సర్వస్వామ్యములు, సర్వాధికారము గవర్నమెంటు అన్యదేశీయులుకాని, స్వదేశీయులుకాని ఇట్టి పరిశోధనలకు పూనుకొనుటకు వీలుగ నుండునట్లు చట్టమును సంస్కరించియున్నారు. ఈ యవకాశమును పురస్కరించుకొని అప్పుడే విదేశీయులు కొందరు తమ దేశములందలి పురాతత్త్వసంఘముల పక్షముననో, విశ్వవిద్యాలయములపక్షముననో, చిత్రవస్తు ప్రదర్శనశాలల పక్షముననో, లేదా వ్యక్తిపరముగనో వచ్చి గవర్నమెంటుఅధికారులతో సంప్రతించి మన దేశమునందలి ప్రాచీనస్థలములను కొన్నిటిని త్రవ్వి పరిశోధనలు కావింపనున్నారు. త్వరలో పని ప్రారంభమగును. విజ్ఞానతృష్ణతో విదేశీయు లెంతయో కష్టపడి వేలకొలది మైళ్లదూరమునుండి యిచ్చటికి వచ్చి శీతవాతాతపముల కోర్చి పనిచేయుచుండగా, ఈవిషయమున మనదేశము నందలి ధనవంతులు, విద్యావంతులు, అధికారులు, జమీందారులు నగువారు ఏమిశ్రద్ధ తీసికొనుచున్నారు? ఆవిజ్ఞానతృష్ణ, ఆచారిత్రకజిజ్ఞాస, ఆ కళాభిమానము లేనేలేదు సరికదా, విషయము లీవిధముగ నున్నవని కూడ చాలమందికి తెలియదు. విదేశీయులు వచ్చి త్రవ్వి పరిశోధనలు జరపినస్థలములందు బయలుపడిన ప్రధానమును, రమణీయమును నైన మన ప్రాచీనకళాసంపద, మన ప్రాచీనవస్తుసంపద విదేశీయ చిత్రవస్తుప్రదర్శనశాలల నలంకరించునుగాని మన దేశమున నుండదని మనము నిశ్చయముగ నమ్మవలెను. ఉత్సాహకరము లైన పరిస్థితులు కావివి. ఈ పురాతత్త్వ విషయమున దేశీయు లెక్కువశ్రద్ధయు, ఆదరమును జూపిననేకాని నష్టము వాటిల్లగలదు. ఏయొకరిద్దరో యీవిషయమున శ్రద్ధ తీసికొన్న జాలదు. శ్రద్ధతీసికొని యీవిషయమున బని చేయువారు కొద్దిమంది యున్నను వారు పరస్పర సంబంధ మేమాత్రమును లేక విడివిడిగ పనిచేయుట వల్ల జరిగిన పని చాల తక్కువ.

ఇతరదేశములవారు పురాతత్త్వశాస్త్రమున కెంత ప్రాముఖ్యము నిచ్చుచున్నారో గమనించినచో మన వారి ఉదాసీనతకు దుఃఖము కలుగును. మన దేశచరిత్ర సమగ్రముగను, సాంగోపాంగముగను బయలుపడవలెనన్న పురాతత్త్వశాఖ లన్నిట గొప్పపరిశోధనలు జరగవలెను. అంతవరకు మనకు సంపూర్ణచారిత్రము రాదు. ఈవిషయమున విదేశములను జూచియైనను మనము మేలుకొనుట మేలు. కుశాగ్రబుద్ధులమను మనకు ఈనాటికీ సోమరితన మేల కలిగెనో తెలియకున్నది. అవకాశమున్నప్పుడు మన మేమియు పనిచేయక, అంతయు మించిపోయినపిమ్మట విచారించి యేమిలాభము? లోకవిఖ్యాతిగాంచిన అమరావతీశిల్పములు బ్రిటీషు మ్యూజియములో పెట్టుటకుపూర్వము ఎట్టి దురవస్థయందుండెనో చదివినవారికి గాని మనయుదాసీనత బోధపడదు. ఇప్పటికిని ఏదయిన అపురూపపు శిలాస్తంభము కాని, విగ్రహముకాని దొరకినయెడల దానిని కోటగానో, భోజనసామగ్రులను నూరుకొను బండగనో

వాడుకొనుటకు పామరజనము శంకింపదు. రమణీయ శిల్పచిత్రములచే విరాజిల్లుచున్న దేవాలయపు గర్భగుడులలో సైతము నింద్యములయిన పనులు చేయుటకును, శిల్పచిత్రములను నాశముచేయుటకును కొందరు శంకింపరు. ఇట్టివారిని శిక్షించుటకు గవర్నమెంటువారి చట్టమున్నది కాని జనబాహుళ్యమట్టి చట్టమునెడ నుదాసీనభావము వహించినచో దానివలన ప్రయోజనమును లేదు; అట్టి దాని నమలులో పెట్టుటయు నసాధ్యము మనకే మనయం దాత్మవిశ్వాసమును, మన పూర్వుల యందు గౌరవమును, మన ప్రాచీనకళారచనలయం దాదరమును లేనంతవరకు మన మీస్థితియం దుండ వలసినదే.



ఆంధ్రులు : మానివాసపుహక్కుల నితరు లనుభవింపవచ్చును, మాకెంత కష్టమువచ్చినా సరే. "పరోపకారార్థ మిదం శరీరం" అన్నారు. మావి ఉన్నతాదర్శాలు.

భోజుని కూఁతు రిందుమతి భూపతినందనబృందమందు నం
భోజహితాన్వయున్, రఘునిపుత్రు, నజున్ వరియించి, యాయయో
ధ్యాజననాథు రాజ్ఞిగ సురాధిపురాణికి నేని లేసి శ్రీ
తోఁ జెలువారుచున్ దశరథున్ నిజగర్భఫలంబుగాఁ గనెన్.

ఇనకులవార్ధిచంద్రుఁ డజుఁ డిందుమతీసతితోడఁ గేళికా
వనమున కొక్కనాఁ డరిగి, వల్పునుగొల్పెడి చల్లగాలి మె
ల్లనఁ బ్రసరిల్లు శాద్వలతలమ్మున శ్రాంతికిఁ గూరుచుండి, చెం
తను బ్రియకాంత పల్కు వచనంబులు ప్రీతిని వించు నున్నెడన్.

వ్యాళము చుట్టచుట్టుకొని వచ్చినదా యనునట్టు లొక్కపూ
మాలిక మింటినుండి పడి మానినియక్కున వ్రాలఁ, గ్రక్కునన్
గాలికి రాలు సూనమనఁగా, నల కోమలి కూలె నేలపైఁ;
గాలుఁడు కూళ: దేశమును, గాలముఁ, బాత్రముఁ జూడఁ డేమియున్.

మృదుసుమదామపాశమున మిత్తి హఠాత్తుగ దాపరించె నా
సుదతికి, నిందునిం దెగడు చొక్కపుమోమున హాసచంద్రికల్
చెదరకమున్నె, నవ్యసుధ చిందు మృదూక్తులఁ బల్కు మోవికిం
గదలిక పోకమున్నె, కుతుకన్ ధ్వని యాఁగకమున్నె బాపురే!

పూర్వభవోగ్రకర్మ మిటు బోటిని జంపెను బుష్పమాలయై:
యుర్విని జావు కాచుకొనియుండును ద్రావెడినీళ్ల, మేనిపైఁ
బర్వెడి గాలులన్, విరులపాన్పుల, వెండిపసిండిపాత్రలన్;
సర్వము కర్మసూత్రమున సాఁగును సర్వనియంతకట్టడన్.

ప్రక్కను దన్ను నిల్పుకొని ప్రాణముపెట్టెడి ప్రాణనాయకున్
మక్కువ కిక్కయైన సుకుమారకుమారుని, స్వర్గమట్లు పెం
పెక్కిన రాజ్యమున్, శచికినేనియు లేని యహీనవైభవ
మ్మొక్కతృటిం ద్యజించి చన నుగ్మలి! శాశ్వత మేది మేదినిన్?

"వినయవతీ! దయామతి! వివేకవతీ! సుకృతీ! పతివ్రతా
జనతిలకంబ! సర్వజనసన్నుతదివ్యగుణావలంబ! నే

నిను విడనాడి యెట్లు మననేరుతు? దుఃఖము నెట్లు లోరుతున్?
దినము లింకెట్లుగాఁగఁ గడఁదేఱుతు? పుత్రకు నెట్లు తేఱుతున్?

"దశరథుఁ 'డమ్మ! యమ్మ!' యని తల్లడమందుచు నిన్నుఁ బిల్వ, నా
శిశువును జూచి నా మనసు ఛిన్నము భిన్నము గాకయున్నె? యో
శశిముఖి! నీవు లేనియెడ, జన్మము జాబిలిలేనియట్టిదా
నిశిగతి నాకు వ్యర్థ" మని నెవ్వగఁ బొంది యజుండు గుందఁగన్.

కులగురుఁడౌ వసిష్ఠుఁడు రఘుక్షితిపాలకపుత్రు శోకముం
దొలఁగఁగఁ జేయు జ్ఞానము హితుండయి బోధయొనర్చి, లోకరీ
తులు, బహునీతులుం దెలిపి, దుఃఖశమం బొనరింపఁజాల కా
వెలఁదుకపూర్వజన్మకథ వింతను గొల్పుచుఁ దెల్పె నీగతిన్.

"వినుము నరేంద్ర! యిందుమతి వేల్పులసాని; సురేంద్రు పంపునన్
మును తృణబిందుమౌనితపముం జెఱుపం దలకొన్న యామెపై
ఘనుఁ డతఁ డల్గి, మానిసివి కమ్మని శాపమొసంగ, నాతి భీ
తిని గని శాపమోక్షమును దెల్పు మటంచును గాళ్ల వ్రాలఁగా,

"సురతరుసూనదామ మెద సోఁకఁగ నాకము నీకుఁ జేకుఱుం
దరుగఁగఁ బూర్వమట్లు హరిణీ!' యని మౌని యనుగ్రహించె; నా
హరిణియె పుట్టె నిందుమతి యై" యటంచుఁ దపోమహాత్ముఁ డం
ధురుఁడు, వసిష్ఠుఁ, డింద్రసభఁ దోఁపఁగఁ జేసె నృపాలమౌళికిన్.

అజుఁడు సుధర్మలో హరిణి యంఘ్రుల గజ్జెలు గట్టి యాడు ట
క్కజముగఁ గాంచి యా మె వెలకాంత యటంచు గ్రహించి, రోఁత చే
నిజహృదయంబునందుఁ గల నెయ్యము మాని, ప్రశాంతచిత్తుఁడై
ఋజుగతి నేల సాగెను ధరిత్రి, నదే తన కేక పత్నిగా.

"సతులు, సుతుల్ తమున్ విడిచి చత్తురు, వెంటను రారు; సంపదల్
సతములు గావు, స్వప్నసదృశంబు" లటంచు నెఱింగి కోవిదుల్
క్షితిపయి సంసృతిం బడక చిత్తము బ్రహ్మమునందుఁ జేర్చి, సం
తతము విరాగులై, వికలతం గన, రాపద లెన్ని గల్గినన్.

# ఆహారము

బొల్లాప్రగడ సుందరగోపాలరావు

శ్రీయుత గోటేటి జోగిరాజుగారు క్రడచిన జూన్ మాసపుభారతి ౧౮౩ వ పేజీలో పండ్లనుగూర్చి వ్రాసిన వ్యాసమువలన చదువరులకు చక్కని ఉపయోగమగు మార్గము తెలుపుటయినందులకు వారు వందనీయులు. వ్యాసము ముగింపులో కేవలము పండ్లు తినిన చాలదనియు, అపక్వాహారము ఒకరు చెప్పినట్లు తినిన జబ్బుచేయు ననియు మొదలగు సందేహాంశములు వ్రాసి దీనినిగురించి ఇంకా ముందు పరిశీలన చేయవలసి యుండునని తెలుపబడియున్నది.

కేవలము ప్రారంభదశలో పండ్లనే ఆహారముగా తీసుకొనిన నీరసముగా నుండుననియు, ఇట్టి నీరసము పోవుటకే, నానవేసి ఆరబెట్టి మొలకలు తెప్పించిన గోధుమలు ఏదోయొక మొలకలువచ్చిన పప్పుజాతిగింజలతో కలిపి చమురుగల కొబ్బరి మొదలగు పదార్థములతో చేర్చి భుజించిన మనుజులకు నీరసముండదనియు, యథాక్రమముగా పక్వాన్నము భుజించినట్లే పనిచేయగలుగుదురనియు 'అపక్వశాకాహార అద్వైత సిద్ధాంతము'లో తెలుపబడియున్నది. ఈ ఆహార సమ్మేళనము ఎట్లు తయారుచేయవలెనో, వేటికి ఎన్నెన్నిపాళ్లు ఉండవలెనో ఆ గ్రంథమునందు వివరముగా వ్రాయబడియున్నది. ఈసిద్ధాంతము గడచిన మూడుసంవత్సరములు తీక్ష్ణమైన మండువేసవి యగు మే మాసమునందు వివిధదూరదేశములనుండి నానాజాతులు, నానాకులములవారు వయోలింగభేదములు లేక పసిపిల్లలు మొదలుకొని వృద్ధులవరకు అయినవిల్లి గ్రామములో మామిడిచెట్లక్రింద నివసించి గోదావరి ఇసుక తిన్నెలమీద పరుండి నూర్గురకు తక్కువగాని జనసంఖ్యచే పరీక్షింపబడినది. ఇట్టిపరీక్ష బెజవాడ ప్రకృతి పరిషత్తువారొనర్చి ఛాయాచిత్రములు పత్రికలందు ప్రచురించియున్నారు.

అయినవిల్లి గ్రామములో భుజించిన ఆహారము ఏకవిధమయినది. అనగా ప్రతిమనుజుడు నానబెట్టి మొలకలెత్తిన గింజలు ఎవరిగుప్పెళ్లతో వారు రెండుగుప్పెళ్లు తీసుకొని ఒకకొబ్బరికాయలో సగముచెక్క, మూడునాలుగు అరటిపండ్లు, ఒక పుచ్చకాయబద్ద (౧/౮ వంతు కాయ) తినుచుండెడివారు. ఈ ఆహారముయొక్క ఖరీదు రోజుకు ఒకమనిషికి ౦-౧-౧ అయినదని ప్రకృతి పత్రికలో ప్రచురింపబడియున్నది. ఈ ఆహారములో మాంసకృత్తులు, గంజిపదార్థములు, మధురపదార్థములు, క్షారములు, ఖనిజములు సమస్తము ఉండుటచేతనే అచ్చట అయినవిల్లి గ్రామమునకు వచ్చిన ఆబాలగోపాలము స్త్రీపురుషాదులు వెంటనే అలవాటయిన పక్వాన్నములు, మత్తుపానీయములు విడనాడి వాటిని మరచిపోయి స్మరించనయినను స్మరించక తీవ్రమయిన వ్యాయామములు, గ్రంథపఠన, సూర్యనమస్కారములు, సాయంకాలము ౯ మైళ్లనడక, ఈత మండువేసవిని ధిక్కరించి చేయగలిగిరి. వేసవిబాధ కేవలము పక్వాహారములో నున్నదిగాని పైఉష్ణస్థితివలన అంత తీవ్రతాపము గలిగింపజాలదని అయినవిల్లిమకాముకు వచ్చిన యావన్మందికిని గోచరమయినది. కావున చివరకు ఏకాహారము, అనగా కొబ్బరి, పండ్లు, ఆకులు, శాకములు మొదలగునవి తిని జీవించగలిగినను ప్రథమములో అపక్వశాకాహార అద్వైతసిద్ధాంతములోని ఆహార సమ్మేళనమాచరించిన ఎట్టిలోపమును, భయమును, పోషణపదార్థలోటును కలుగదు.

ఇట్టి ఆహారపదార్థములు సంపాదించుకొనుటకుగాను మానవులు ఫలజాతులను, కూరగాయలను సమృద్ధిగా లభింపజేసుకొనుటకు యత్నములు జరిగించిన ఆహారముయొక్క ఖరీదు రోజునకు ఒక అణా ఒక దమ్మిడీకూడ ఖర్చుపెట్టనక్కరలేకనే పక్షులు, కోతులు మొదలగు జంతువులు స్వేచ్ఛగా నివసించుచున్నట్లే జీవనము చేయవీలగును. అపక్వాహారమువలన వంట లక్కరలేక పనియు, ఖర్చును తగ్గిపోవును. మందుల ఖర్చు, వైద్యులఫీజు లక్కరలేక నిల్వ కలుగును,

ఆహారవస్తువుల సంపాదననిమిత్తము ఆందోళనము, వ్యయము అక్కరలేక తాము స్వయంకృషివలన ఫలింపజేసుకొనిన ఫలములు, కూరలు బజారులకు, సంతలకు పోనక్కరలేకయే తమ స్వంత ఆవరణలలో ఖర్చులేక ఆనందముతో కోసికొని భుజింపనగును.

పక్వాహారముతో అపక్వాహారము సమ్మేళనము చేయుటవలన కలిగెడి నష్టములు చదువరులు అపక్వాహార - అద్వైతసిద్ధాంతమును చదివి గ్రహింతురుగాక! పాలు, పెరుగు, నెయ్యి తదితరమైన పశుసంబంధమగు ద్రవ్యములు మానవునకు ఆహారము కావని పైసిద్ధాంతమందు రుజువుచేయబడియున్నది. అయినవిల్లి గ్రామములో సదా క్షీరముల కలవారై కాఫీ, టీ మొదలగు పానీయములు ఒక్కసారిగా విడనాడి నెలదినములుండ గలుగుటయు, ఎప్పుడును క్షీరములు గ్రోలకయుండు అనేకమందిజన మూండగా క్షీరములే కావలెననియు, క్షీరములు పోషణపదార్థమనియు వాదించువారి వాదనకు స్థావరముండజాలదు. క్షీరములు కోరుట ఒక అనవసరమగు, రోగభూయిష్ఠమయిన భోగము. ఇట్టి ఖరీదు గలట్టి క్షీరములు, తత్పదార్థములు వ్యాధిని అనుభవించి అధికవ్యయముతో నివారణ చేసికొనగలిగిన ధనికులకు తగిన తగియుండును గాని దరిద్రభూయిష్ఠమై సదా మశూచి, విషూచి, విషజ్వరములచే పీడింపబడి యుండు పూటకులేని భారతీయులకు ఎంతమాత్రము అవసరములేదు. కావున అపక్వాహారము శరీరారోగ్యమునకు పరిపూర్ణపోషణపదార్థముల నొసంగుటకు, వ్యాధిని నిర్మూలించుటకు, దరిద్రమును నాశనము చేయుటకు, నిరుద్యోగమును బాపుటకు ముఖ్యసాధనమగుచున్నది. దీనిని ప్రతిభారతీయుడును వ్యాధినివారణముకొరకయినను, దరిద్రముకొరకయినను పరీక్షింప నవసరమగుచున్నది.

## కవిసమాధి

కె. అన్నపరాజశర్మ

తపస్వి:

విపుల నిశ్శబ్దగర్భిత వేళ, విజన
సీమ, మౌనముద్రాంకిత చింత గదుర
తారకాద్వయి తారాపథమునఁ బఱపి
ఓమనస్వి! సాధించెడి యోగ మేది?

కవి:

ధ్యానమగ్నమ్ములైన నాతలఁపు లేల
భగ్నము లొనర్పఁ జూచెదు భౌతికప్ర
పంచమున స్వర్గసామ్రాజ్యపాలసంబు
స్థాపనముసేయ నెంతయు సాహసింతు.

తపస్వి:

కరుణ బులకించు ముద్దుమొగంబుఁ గాంచి
అపరిచితమయ్యు స్నేహంబు నభిలషింతు,
పదుచుఁదనమున నిట్టి తపఃప్రశాంతిఁ
బూని యెందుల కీవ్రతం బూనినావొ.

కవి:

విశ్వకల్యాణమును గోరి ప్రేమసుధను
హృదయకుడ్యములందు చిత్రింప నెంచి
సృష్టికిని మాఱు సృష్టించు శిల్పిగాఁగ
దివ్యచక్షులతోడ నం దెలిసికొనుము.



3. అనసూయ సపర్యలకు అలరి అత్రి యామెను దీవించుట

# ఫిలిములుపాడైపోవుటకుకొన్ని కారణములు

ఇంతకాలమునుంచి ఫిలిములను తయారు చేయు చూసూడ పరమ అసహ్యాకరమైన ఫిలిములను బయటపడవేయుచున్నారు. కారణ మేమి? అని ఫిలిం పారిశ్రామికులను కొందరిని నేను కలకత్తా పోయినపుడు అడిగియుంటిని. అనుభవమా, సంవత్సరముల తరబడి సంపాదించియున్నారు. పెట్టుబడికా, లోటు లేదు. శాస్త్రజ్ఞానము కలవారా, మిక్కుటముగ నున్నారు. కాని తయారగుచున్న ఫిలిములా, నూటికి తొంబదివను చూచుటకు అనర్హములు. 'ఏమా దీనికి కారణము'ని ఆలోచించి ఫిలింవర్తకులను అడిగితిని. ఫిలిం పరిశ్రమ లోని వివిధశాఖలలో పనిజేయు అధికారులు వివిధకారణములు తెలియజేసిరి ఫిలిములు పాడైపోవుటకు. కాని అందరును ఒకకారణమును గురించిమాత్రము నొక్కి చెప్పిరి. అది ఏమనగా ఫిలిమునకు వలయు నటనటీమణులను ఏరికూర్చునటువంటి Casting డైరెక్టరులు సరియైన 'ఆర్టిస్టు'లను కూర్చకపోవుట, తమయొక్క తెలివి తక్కువచేతగాని, మరి ఏయితర కారణములచేతగాని. అందువలన ఫిలిములు పాడైపోవుటకు ముఖ్యకారణము Casting డైరెక్టరులు సరియైన నటులను సంపాదించక పోవుటయే.

"నేను ఎంతధనమునైనను వెచ్చించుటకు సిద్ధముగా నున్నాను. నాకుమాత్రము సరియైననటబృందమమరవలెను. దానికొరకు చక్కగా పర్యటనము గావించి తగునటులను ఏరి తీసికొని వచ్చుటకు చదువుకొనిన సమర్థులనే వినియోగించుచున్నాను. దేశభాషల లోని టాకీలు తీయునపుడు ఆభాషకు సంబంధించిన రాష్ట్రీయులనే, అచ్చటినటలోకమునందు పరిచయము, అనుభవము కలవారినే వినియోగించుచున్నాను. అంతకన్న నేమిచేయగలము?" ఇది ఫిలిములు తయారుచేయు స్టూడియోస్వంతదారుని వాదన. ఆవిధముగ ఫిలిము చెడిపోవుటకు నటులను ఏరికూర్చునటువంటి Casting డైరెక్టరులే ముఖ్యకారణమని పెట్టుబడిదారులు తప్పుకొనుచున్నారు. ఒక ప్రసిద్ధసినిమావర్తకుడు తనస్టూడియోలో చెడిపోయిన ఒకఫిలిమునుగురించి అది చెడిపోవుటకు కారణము నటులను ఏరినవానిదేనని నన్ను నమ్మించ చాలప్రయత్నించినాడు. కాని నిజముగ అది పాడైపోవుటకు కారణము ఫిలిమును తయారుచేసినడైరెక్టరు. నటులను ఏరుకొనుటలో లోపము లుండవనిగాని, అందువలన ఫిలిములు చెడిపోవనిగాని నేను చెప్ప సాహసించుటలేదు. కాని ఫిలిములు చెడిపోవుటకు కారణము నటులను ఏరునటువంటివారి తెలివితక్కువయే కాదనియు, పెట్టుబడిదారులయందు గూడ గలదనియు నాయభిప్రాయము. అసలు నటులను ఏరితెచ్చుటలో సరియైనవానిని వినియోగించుట పెట్టుబడిదారుని బాధ్యతయే గదా!

టాకీలు అమిత అసహ్యాకరముగా తయారగుచున్నవితమిళ ఆంధ్రములలో. హిందీ బెంగాలీ మరాఠీభాషల టాకీలపరిస్థితులు యింత అధ్వాన్నముగా లేవు. వివిధరాష్ట్రభాషలయందు తయారైన టాకీలలో పాత్రధారులను ఏరుకొనుటయందు వినియోగింపబడిన కొందరు పెద్దలను "ఈటాకీలు యిట్లు తగులబడుటకు కారణమేమ"ని ప్రశ్నించితిని. వారు మరియొక కథ చెప్పుచున్నారు.

"ఒకకథకు వలయుపాత్రధారులను సమకూర్చుటకు స్టూడియోస్వంతదారులు మిమ్ముల నియమించుచున్నారు. కాని దానికి కొన్నినిబంధనల నేర్పరచి వాటి నతిక్రమించకుండ మేము పనిచేయునట్లు కోరుచున్నారు. అన్నిటికన్న ముఖ్యమైనది ధనవిషయము. 'సెట్టు' కంతకును ఒకమొత్తము నేర్పరచి ఆమొత్తము లోడనే పాత్రధారుల నందరను కొనిరావలయునని కోరుచున్నాడు. ఒకప్రఖ్యాతనటుని కోల్పోవుపరిస్థితులుదయించినగూడ అనుకొనిన మొత్తమునకు చిల్లిగవ్వ

సైన మొగ్గడు. అటువంటి సందర్భమున పాత్రలకు తగునటు లెరుకనుండియు పాత్రధారులను సమకూర్చుటకు వినియోగింపబడినవారు ఏమియు చేయలేకుండ నున్నారు. "ఎక్కువ ధన మార్జించవలెను. ఖర్చు తక్కువగా నుండవలెను." ఇది పెట్టుబడిదారుని ఆదర్శము. అనగా వాతని ఆదర్శము ధనార్జనకాని కళోద్ధరణము గాదు. ధనార్జనతోపాటు కళోద్ధరణము గూడ కాదు.

కొన్ని సందర్భములలో పెట్టుబడిదారులు నియమించు మొత్తములు జూచిన ఆమొత్తములకు పాత్రధారు లేరినైనను సమకూర్చుట సంభవమాయని సంశయము కలుగును. ఒక్కొక్కసమయమున వేయాభై రూపాయిలకో బిగదీసిన ఆకథకు అతిముఖ్యుడైన నటులవంటి ఒక ప్రసిద్ధనటుని కోల్పోవుట సంభవించును. అందువలన టాకీకి వలయునటుల సెన్నుటలో ప్రధాన లోపము స్టూడియోస్వంతదారునినుండి పుట్టుచున్నది. ఇది పాత్రధారుల సెన్ను Casting Director చెప్పు కథ.

మనదేశమందలి స్టూడియోలలో చాలవాటికి కథలకు వలయు నటులను సమకూర్చు కాస్టింగు డైరెక్టర్లు లేనేలేరనిచెప్పుట అప్రస్తుతము గాదు. కథయొక్క జయమునకు ముఖ్యకారణము మంచి పాత్రసమ్మేళనము. కాబట్టి మన ఫిలిములు తగులబడిపోవుటకు కారణము సరియైన పాత్రధారుల సెన్నకపోవుట. ఫిలిమునుతయారు చేయుటలో గల ప్రధానాంశము నొకదానిని యిట్లు నిర్లక్ష్యముజేసి యిటువంటి ఫిలిములను మనకు ప్రదర్శించుచున్నారు. మన తెలుగుఫిలిములు చూచినవారికి యిది చక్కగా గోచరము కాగలదు. ప్రత్యేకముగా పాత్రధారులను సమకూర్చుటకు ఉద్యోగి లేనందున ఆఫీసులోని ఏమేనేజరునో, ఏగుమాస్తానో ఆపనికి వినియోగింతురు. ఉదాహరణ: ఒకస్టూడియోవారు తెలుగు ఫిలి మొకటి తీయదలచిన తమవద్ద కలకత్తాలో ఏపది సంవత్సరములనుండియో పనిజేయుచున్న ఏ తెలుగు గుమాస్తానో నటులను గోవిరా నియమింతురు. ప్రస్తుతము తెలుగునాట్యరంగమందలి నటులు, కళాస్థితులు ఆతడి కేమి తెలియును? ఎవరో ఒకస్నేహితుని సలహామీద ఒకసంపును తోలుకొనిపోయి ఒకఫిలిమును తయారుచేయును. మన ఫిలిములకు నటులను ఈవిధముగ ఎన్నుకొనుచున్నారు.

సరి, ఏదోఒకబృందము తయారగును. అంతట వారు స్టూడియోకు గొనిపోబడుదురు. హిందీటాకీలవలె తెలుగు, తమిళము మొదలగుటాకీలకు అఖిలభారతప్రచారమునకు అవకాశము లేనందున స్టూడియో స్వంతదారులకు మనటాకీలన్నను, మననటులన్నను నిరసన మెక్కువ. అందువలన ఫిలిమునకుగాను పోయిన ఈసెట్టును చాలనిర్లక్ష్యభావముతో చూతురు. తిండితిప్పలుసహితము సరిగా అమర్పరు. అటువంటి సమయమున ఫిలిముకు గావలసినసెట్టింగులు, నటులకు వలయు వేషధారణపరికరములు మున్నగునవి ఏవిధముగ నేర్పాటు చేయబడుచున్నవో ప్రఖ్యాతాంధ్రనటశేఖరులు, సినిమాలో అనుభవము కలవారు కొందరు పత్రికలలో వాపోయియేయున్నారు. కాని వా రేమిచేయునదిలేక, పాపము, అటువంటిపరిస్థితులకే సిద్ధపడుచున్నారు.

ఈనటులు స్టూడియో చేరగనే స్టూడియోస్వంతదారు మామూలుప్రేక్షకుల కిచ్చుమర్యాదగూడ యివ్వకుండ వీరిని తరుచు తూలనాడుచు, ఏదైన అడిగిన కొరకొరలాడుచు ఫిలిం ఏదోవిధముగ త్వరలో తయారైనచాలునని తొందరించుచుండును. ఒకస్టూడియోలో ఒకటాకీకిగాను తీసుకుపోబడిన ఒకసెట్టును స్టూడియో స్వంతదారు అగౌరవముగా చూచుచుండుట చూచి, నటులను ఆసికొనివచ్చినాతడు హెచ్చరించగా అస్టూడియోదారుడు "ఏదో తగలడనివ్వవయ్యా! వెధవపిక్చరు! అరడజనుథియేటర్లలో ప్రదర్శింపబడపోయే దీనివలన మాకొచ్చేదేమిటి?" అని గర్జించాడట!

మరియొకపద్ధతి అమలునందున్నది ఈఫిలిములు తయారుచేయుటలో. ప్రస్తుతము ఆంధ్రదేశమునందు ప్రచారమునందున్న కంట్రాక్టునాటకములవలె ఫిలిములు గూడ కంట్రాక్టుఫిలిములు తయారుచేయబడుచున్నవి. నాటకము నాడించు కంట్రాక్టరున కెంతపరిజ్ఞాన ముం

డునో వీనికి నంతరియే. నాటకమునకంటె కొంచె మెక్కుడుపెట్టుబడి. అదియే భేదము. చవకగా దొరకు ఏబజారునాటకమో కొని నలుగురు నటులను ఏ కొద్ది మొత్తములకో చేరదీసి సినిమాలో నట నుబలాటపడు చున్న నాయికామణుల చేరి సెట్టును తయారుచేసు కొనును. ఈ సెట్టును తనస్వంతఖర్చులమీద స్టూడియో వున్న కలకత్తా, బొంబాయి మొదలగు వాటిలో ఎక్కడికైన తీసికొనిపోయి ఏస్టూడియోతోనైన 'ఎగ్రిమెంటు'లో దిగును. స్టూడియోవారు సెట్టు తీసికొని వచ్చిన కంట్రాక్టరుకు ఒక మొత్తముగాని, లేక లాభములో నూటి కింతయని గాని నిర్ణయము చేసికొని యిస్తారు. ఎక్కువ మిగలవను కారణమున కంట్రాక్టరు నటులను సరిగా చూడడు. నటుల పోషణయందలి బాధ్యత కంట్రాక్టరుదిగాన స్టూడియోవారు నటుల నాదరించరు. ఈనటులలో యెక్కువమంది సంస్కారులు కానందున స్టూడియోలో సరిగా ప్రవర్తించరు. యోవారికి నటులకు వైరము. త్వరగా పూ జేయవలె నను కంట్రాక్టరుస్టూడియోవారుల ఆందోళన. ఈపరిస్థితులలో తయారగుచున్నవి కొన్ని మన ఫిలిములు. ఇవి కంట్రాక్టు నాటకముల వలె కంట్రాక్టు ఫిలిములు.

మన ఫిలుములు తగులడిపోవుటకు మరియొక ప్రధానకారణము భాష తెలియని డైరెక్టరులు. ఫిలిమునకు కీలకముకదా డైరెక్టరు! ఏసంసర్భమున, ఏపాత్రధారి, ఎట్లు పలుకవలెనో, ఏపాట సందర్భోచితముగా నున్నదో, ఏది లేదో, పాత్రలకు తగినభాష ఏర్పరుప బడినదో లేదో తెలుసుకొనలేని డైరెక్టరు చేతిక్రింద ఫిలిము బాగుపడుట అసంభవము. పాత్రధారులు వారి వారి 'పోర్షనుల'ను చెప్పునపుడు అవి అర్థమైనగదా డైరెక్టరు నటులకు సూచనలు గావించుటగాని, సంస్కరించుటగాని చేయగల్గునది? భాషయే తెలియదు డైరెక్టరునకు! కొన్ని సమయముల—ముఖ్యముగా కొన్ని తెలుగు ఫిలుములలో—కధగూడ తెలియని అన్యరాష్ట్రీయ డైరెక్టర్లు ఫిలిములను తయారుచేసి మనతలపై రుద్దుచున్నారంటే అతిశయోక్తి లేదు.

భాష తెలియనిడైరెక్టరు ఆవిధముగ ఫిలిము తయారుచేయుచుండుకాలములో, ఈ నటబృందములో గొంతుగల ఒకనటుడుగాని, కంట్రాక్టరుగాని, లేక ఆ ఫిలిములో కథానాయికపాత్రధరించు నాపెప్రియుడు — సాధారణముగా వీరుగూడ వెంటనే వుందురు—గాని, డైరెక్టరునకు రచనవిషయమున, పాటలవిషయమున మరి యితరవిషయములలో సలహా నిచ్చుచుందురు. వీరు మువ్వురూ యిచ్చుటకూడా కద్దు. కంట్రాక్టరుసలహా వినకపోయిన కంట్రాక్టరునకు కోపము వచ్చును. మల్లీ అతడు తీయించదలచే ఫిలిమునకు ఈ డైరెక్టరును

పెద్దనటునిమాట వినకపోయిన అతడు స్వగౌరవముగూడ పాటించకుండ ఫిలిములో అసహ్యముగా నటించును. మూడవ పెద్దమనిషి సలహా స్వీకరించనిచో కథానాయికకు తరుచు జబ్బుచేయుచుండును. ఫిలిం త్వరగా పూర్తిగాదు. వీరందరిసలహాలతో భాష తెలియని ఆడైరెక్టరు ఫిలిము పూర్తిచేయును. ఆంధ్రులకు మరియొక "నయనోత్సవము" వచ్చును!!!

అందువలన ఎంతకళాభిజ్ఞుడైనను తనకు తెలియని భాషలో ఫిలిమును డైరెక్టుచేయుట కష్టము. అట్లు ఒప్పుకొనినడైరెక్టరు నిజమైన కళాభిజ్ఞుడు కాడు. డైరెక్టరునకు భాష తెలిసియేతీరవలె. సరియైనడైరెక్టరు కుదిరినతరువాత ఆర్టుడైరెక్టరు, మ్యూజిక్ డైరెక్టరు (సంగీతోపాధ్యాయుడు) మొదలగువారు కుదురవలె. ఫిలిములు పాడైపోవుటకు మరియొకకారణము డైరెక్టరే కథవ్రాయుట. ఇది యింకను తెలుగుసినిమారంగమున నంతగా పొడచూపలేదుగాని హిందీఫిలిములలో యెక్కువగా కనబడుచున్నది. ఎంతతెలివిగలవాడైనను డైరెక్టరు, కథగూడ తానే వ్రాయగూడదు. కవిత్వ ధోరణిగలవానికి సహజముగా చక్కనిభావము లుద యించుచుండును. వాటిని కథ కనువగునట్లు తనస్వంత భావములతో మేళవించి డైరెక్టరుపయోగించుకొన వచ్చును. కథగూడ డైరెక్టరే వ్రాసినపక్షమున కథలో భావములు (Ideas)చాలతగ్గిపోయి కథ పేలవముగా కనుపట్టును. ఫిలిము తయారుచేయుటలోగల వివిధశాఖల ప్రధానాధికారులను స్వేచ్ఛగా పనిచేయనిచ్చుచు తన

స్వంతభావముల కనువగునట్లు వాటి నుపయోగించుకొను వాడే నిజమైన డైరెక్టరు. డైరెక్టరు వివిధశాఖాధ్యక్షుల ప్రతిభావిశేషములను సరియైనపాళ్లలో కలిపి పోతపోసి ఫిలింతీయవలెనుగాని అన్నిటికి తానే 'డిక్టేటరు'గా ప్రవర్తించిన ఫిలిము తప్పక పాడైపోగలదు.

కాబట్టి ప్రజలనుంచి లక్షలాదిగ ఆర్జించుచున్నప్పుడు సరియైనవారి సహాయమున చక్కనిఫిలిములు తీసి ప్రదర్శింపవలెనేకాని అమాయకులైన ప్రజలను ఏదో ఒకటిచూపి దేశభక్తి రాష్ట్రాభిమానముల నాధారము జేసుకొని మోసముచే ధనమార్జింప యత్నించరాదు. దానివలన కొంతకాలమునకైనను నష్టముకలుగకమానదు. ఫిలిములు తయారుచేయు పెట్టుబడిదారులు ఈవిషయమును గ్రహించెదరని నమ్ముచున్నాము.



"స్వరాష్ట్రమునైనా కాపాడుకోజాలనంతటి చేతగాని వాడవైతివి
ఇకనైనా మేల్కొనవోయీ, ఆంధ్రుడా!"

## పుడమినడకు

పూడిపెద్ది వెంకటరమణయ్య

అది
ఆకర్షణమో
సంఘర్షణమో
ఆదిశేషుడూ
సహస్రఫణాల
తూంచీ, కాచీ
మోచేస్తున్నాడో
నడునెత్తిని
        కడవలాగు
నట్టేటను
        పడవలాగు
ఈగోళమ్మును!
ఏగోలా తెలియక
ముల్లూ కల్లూ
ముసుసూ అడుసూ
త్రోసుక తలయెత్తే
చెట్లూ చేమతో
చీమా దోమా
పులుగూ మెలుగుతో
మానస మెరుగని
మానిసితో,
        ఆనా డెప్పుడో
        అనాదిలోనే, సృష్టికి
        పునాదివేసిన కాలంనాడే
లక్ష్యంలేక లాగే జీవము
గమ్యం మెరుగక గడచేజీవం
ఒక్కప్రోవుగా
ఒక్కత్రోవగా
అన్నిజీవులూ
కానరకూసరమై
కలగాపులగంగా
మెలగేయప్పుడు
ఔదలవంచీ
గాదిలితనాన
తల నిడికొనెనట భూ
తలమును చిలువల రేడు.
ఆమూ ఋక్కమ్మని
యాదరించెనో!
ప్రమాద మేమని
పాచుకొల్పెనో!
        ఏదో మించినయట్టుల
        ఏదో చించినయట్టుల
        జిల్లెడు మొగ్గల్లాగూ
        చిట చిట ప్రేలీ
        జల్లున చినుకుల్లాగూ
        చోట చోటరాలీ
        అన్నిచోట్లులా
        అప్పటికప్పుడె
        విడ్డాయి; దభీమని మీదను
        పడ్డాయి
        భేదాలూ, వాదాలూ
        బీడూ, లోటూ
        ఆడూ, పోటూ
                ఇవన్నీ

దంష్ట్రలాగు
దూసే తుపాకి
గుండ్లలాగు
గాయముచేసే
ముండ్లలాగు
ఎక్కడచూచిన తరహై
మరచిపోని
నవకాశమీయకా
జల్లుజల్లుగా
గట్లు దాటుకొని
పారేసమయం అది.
కత్తిపోటుకూ
కన్నతల్లిని దాచినదినాలు
కన్నగారేమూ
అన్నయింటినీ చూపినదినాలు
చంటిబిడ్డకూ
సందిట విషమ్ము చేసినదినాలు
కనుపిచ్చేయి
అనుపిచ్చేయి
చనుపిచ్చేయి !
గగనమ్మంతా అవిలిపోయినది,
గాలితరగలే పడలిపోయినవి.
పగలే నగమై
చిక్కినది
భూమంతా ...

వెక్కినది
ఆయూర్భాటం,
హాహాకారం
విన్నాడనంతుడు
కునుకునుండి
కుదుపున లేచేడు.
పడగలు తెరచుక
ఒడలే విరచుక
దంష్ట్రలు పైబడ
వాడలు విడివడ
వేయినోళ్లనూ
వెడలించేడు
విషజ్వాలలు
విద్యున్మాలలు
కోపించేడు ;
తనకోపం అంతా
ఒక్కక్షణంలో
చూపించేడు.
తన్నాబయలుగా
తన్నే తంచుక
మన్నే ఒంచుక
గాలిలో భూమీ
గడగడలాడింది.
("అల్పలూ, సూదులూ" నుండి.)




## ఆడెడి హాస్యగాడు

కొ. నరసింహాచారి

(Dancing Clown)

సర్కసులో మధ్యమధ్యవచ్చి వింతవింత ఆట లాడిపోవు హాస్యగానిని (Clown) చేయుట యొకవింతగా నుండకపోదు. దీనికి అట్టతో చేయుబడినపెట్టె (చిత్రము 1) యు, దాని కొకమూత (చిత్రము 2) యు, పెట్టెలో వ్రేలగట్టి యాడించుటకు హాస్యగానిబొమ్మ (చిత్రము 4) యు అంగములు. పెట్టెను మనమే చేసినను చేయవచ్చును. లేదా సబ్బుపెట్టెల నుపయోగించవచ్చును. సబ్బుపెట్టెల నుపయోగించేయెడల వాటిలోని అడుగుతొట్టిలో బొమ్మను వ్రేలగట్టి యాడించవలెను. మూతయందు 2 చిత్రమునందలి j k l m విధముగ నొకపెద్ద గవాక్షమును కోసి యామూతను పెట్టెపై మూసిపెట్టవలెను. హాస్యగానిబొమ్మ పరిమాణము గవాక్షపుపరిమాణమునకన్న కొంచెము చిన్నదిగా నుండవలెను. పెట్టెను, మూతను మనమే చేసికొనునట్టయిన, 1 చిత్రము వలె నొక యట్టను a b c d తీసికొని దానిచుట్టును ఒకే వెడల్పుగలభాగమును గుర్తించి మూలలందు కోసి తీసివేసి నాల్గుప్రక్కల p q r s గోడలను నిలువబెట్టి f అను అతుకుతునుకల నదికించి తొట్టిని చేయవలెను. చిత్రమునందలి కొలతలనుగాని, తమ యిష్టానుసారముగ వేరు కొలతలను గాని తీసికొనవచ్చును. తొట్టియందు q గోడయందు మధ్యభాగమున n, n అను రెండు రంధ్రములను, S గోడయందు m అను సందును చేయవలెను. పెట్టెమూతయొక్క గవాక్షమునుండి చూడదగినంత పరిమాణము కలిగియుండులాగున హాస్యగానిబొమ్మ యుండవలెనుగాన దానికి తగినట్లు వానిశరీరమును, చేతులు కాళ్లను ఒక అట్టపై వేర్వేరుగా చిత్రించుకొనవలెను. చిత్రము 3 A హాస్యగాని శరీరము. ఇదంతయు నొకే అట్టముక్క. దీనియందు టోపీని, చొక్కాయను, ముఖమును తగువర్ణములతో చిత్రించవలెను. B అనునది కాలు. ఇట్టివి రెండుతునుక లుండవలెను. C అను చేతులు గూడ రెం డుండవలెను. చేతులను దేహము వెనుక r, s లవద్ద కాగితములకట్టు సూదుల (Paper - fas'eners - చిత్రము D) తో బిగించవలెను. (చిత్రము 4) కాళ్లను t, u వద్ద బిగించవలెను. ఇవి వదులుగా నుండవలెను. పిమ్మట గట్టి సైనుదారపుతునుకను

దంష్ట్రలాగు
దూసే తుపాకి
గుండ్లలాగు
గాయముచేసే
ముండ్లలాగు
ఎక్కడచూచిన తరచై
మరచిపోని
నవాకాశమాయకా
జల్లుజల్లుగా
గట్లు దాటుకొని
పారేసమయం అది.
కత్తిపోటుకూ
కన్నతల్లినీ దాపనదనాలు
కన్నవాపేమా
అన్నయింటినీ చూపనదనాలు
చంటిబిడ్డకూ
నందిట పసమ్మచేపనదనాలు
కనువిచ్చేయి
అనువిచ్చేయి
చనువిచ్చేయి!
గగనమ్మంతా అవిలిపోయినది,
గాలితరంగలే పడనిపోయినవి.
పగలే నగమై
చిక్కినది
భూమంతా …
పెక్కినది
ఆయూర్భాటం,
హాహాకారం
విన్నా డనంతుడు
కునుకునుండి
కుదుపున లేచేడు.
పడిగలు తెరచుక
ఒకలే విరచుక
దంష్ట్రిలు పైబడ
దాడలు విడివడ
వేయినోళ్లనూ
వెడలించేడు
విషజ్వాలలు
విద్యున్మాలలు
కోపించేడు;
తన కోపం అంతా
ఒక్క క్షణములో
చూపించేడు.
తన్నుబయలుగా
తన్నే తెంచుక
మన్నే ఒంచుక
గాలీ భూమీ
గడగడలాడింది.
("అల్పీలూ, సూదిలూ" నుండి.)




## ఆడెడి హాస్యగాడు
(Dancing Clown)

కొ. నరసింహాచారి

సర్కసులో మధ్యమధ్యవచ్చి వింతవింత ఆట లాడిపోవు హాస్యగానిని (Clown) చేయుట యొకవింతగా నుండకపోదు. దీనికి అట్టతో చేయబడినపెట్టె (చిత్రము 1) యు, దాని కొకమూత (చిత్రము 2) యు. పెట్టెలో వ్రేలగట్టి యాడించుటకు హాస్యగానిబొమ్మ (చిత్రము 4) యు అంగములు. పెట్టెను మనమే చేసినను చేయవచ్చును. లేదా సబ్బుపెట్టెల నుపయోగించవచ్చును. సబ్బుపెట్టెల నుపయోగించేయెడల వాటిలోని అడుగుతొట్టిలో బొమ్మను వ్రేలగట్టి యాడించవలెను. మూతయందు 2 చిత్రమునందలి j k l m విధముగ నొకపెద్ద గవాక్షమును కోసి యామూతను పెట్టెపై మూసిపెట్టవలెను. హాస్యగానిబొమ్మ పరిమాణము గవాక్షపుపరిమాణమునకన్న కొంచెము చిన్నదిగా నుండవలెను. పెట్టెను, మూతను మనమే చేసికొనునట్టయిన, 1 చిత్రము వలె నొక యట్టను a b c d తీసికొని దానిచుట్టును ఒకే వెడల్పుగలభాగమును గుర్తించి మూలలందు కోసి తీసివేసి నాల్గుప్రక్కల p q r s గోడలను నిలువబెట్టి f అను అతుకుతునుకల నదికించి తొట్టిని చేయవలెను. చిత్రమునందలి కొలతలనుగాని, తమ యిష్టానుసారముగ వేరు కొలతలను గాని తీసికొనవచ్చును. తొట్టియందు q గోడయందు మధ్యభాగమున n, n అను రెండు రంధ్రములను, S గోడయందు m అను సందును చేయవలెను. పెట్టెమూతయొక్క గవాక్షమునుండి చూడ దగినంత పరిమాణము గలిగియుండులాగున హాస్యగానిబొమ్మ యుండవలెనుగాన దానికి తగినట్లు వానిశరీరమును, చేతులు కాళ్లను ఒక అట్టపై వేర్వేరుగా చిత్రించుకొనవలెను. చిత్రము 3 A హాస్యగాని శరీరము. ఇదంతయు నొకే అట్టముక్క. దీనియందు టోపీని, చొక్కాయను, ముఖమును తగువర్ణములతో చిత్రించవలెను. B అనునది కాలు. ఇట్టివి రెండుతునుక లుండవలెను. C అను చేతులు గూడ రెండుండవలెను. చేతులను దేహము వెనుక r, s లవద్ద కాగితములకట్టు సూదుల (Paper - fas'eners - చిత్రము D) తో బిగించవలెను. (చిత్రము 4) కాళ్లను t, u వద్ద బిగించవలెను. ఇవి వదులుగా నుండవలెను. పిమ్మట గట్టి సైనుదారపుతునుకను

దీసికొని దానికొనలను చేతులకు m, n ల వద్ద కట్టవలెను. మరియొక దారపుతునుకను కాళ్లకు o, p లవద్ద కట్టవలెను. దారములను వేయనియెడల దారమునందు ఒకభాగమున బట్టిలాగినయెడల నొకచేయిగాని, కాలుగాని కదలును.







బొమ్మను పైరీతి నితయారుచేసికొన్న పిమ్మట దానిని పెట్టెలో q లోని n, n రంధ్రములకు వేలాడగట్టవలెను. దారమును బొమ్మతలలోని y y రంధ్రములలో దూర్చి (చిత్రము 4) పెట్టెలో n n రంధ్రములకు కట్టవలెను. (చిత్రము 5) చేతులకును కాళ్లకును కట్టిన దారములను పెట్టెయొక్క S గోడలోని n సందుగుండా దూర్చి క్రిందికి దీసికొనవలెను. ఈ బొమ్మ పెట్టెనుపయోగించేయెడల యీ n వంటి సందును మూతయందుగూడ అడుగు భాగమున చేయవలెను.







k, k లవద్ద ముడివేసినయెడల దారములను లాగినపుడు రెండుచేతులు కాళ్లును ఒకరీతిని పైకిలేచును. దారమును వదలినపుడవి ఒకే రీతిని క్రిందికి వ్రేలును. k, k లవద్ద ముడి వేరు అట్టలతో చేసేయెడల 2 చిత్రము నందలి e f g h అను అట్టలో పైభాగమున వంపుగా కత్తిరించుకొనిన అందముగానుండును.



శ్రీమతి రేఖాకశేకర్

రూపంఆర్ట్సువారి 'రేఖారాణీమోహినీ' అను చిత్రమున ధాసీపాత్రను నిర్వహించినది.

# నాగప్ప నాయఁడు

**వేదము వేంకటరాయఁడు**

౧

కాకతీయప్రభువు ప్రతాపరుద్రుఁడు రాజ్యమేలుచుండెను. ఆయనకు కుడిభుజమై గోతాళనాయఁడు సర్వసేనాధ్యక్షుఁడు తురుష్కులను బాఱఁద్రోలి రాజ్యమును సంరక్షించుచుండెను. యుగంధరుఁడు కంటికి ఱెప్పవలె రాజును, రాజ్యమును కాచుచుండెను. గోతాళనాయనిక్రింద పలువురు సేనాపతులుండిరి. వారిలో చేజెర్ల వేంకటనాయఁడు ప్రసిద్ధిగాంచియుండెను. వేంకటనాయనికత్తికి శత్రువులు వణఁకుచుండిరి. అతఁడు మొన నడిపించునప్పుడు స్వపక్షమునకు ఉత్సాహమును, శత్రుపక్షమునకు భయమును కలుగుచుండెడివి. అతనిది యుద్ధరంగమున తన్నెఱుంగని యావేశము, శత్రువులను చెట్లను గుట్టలనుంబోలె నఱకివైచు శక్తి. ఈమహావీరునికి బుచ్చమ్మయని ఒకతెయే కొమార్తె యుండెను. వేఱు సంతానము లేనందున నాతఁడు బుచ్చమ్మను కడు గారాబమున పెంచుచు సంగీతాదికములు నేర్పుచుండెను. భోగభాగ్యములకు పుట్టినిల్లైన యాతని గృహమున నామెకు తీరనికోర్కెయే లేదు. పైగా నామె అందకత్తె. తత్కారణమున నామెకు గర్వము విశేషముగా నుండెను. వివాహమునకు కాలము రాఁగా తండ్రి ఎందఱు మహావీరులను, ధనాఢ్యులను చూపినను ఆమె ఒల్లదయ్యెను; ఎల్లవారికిని వంకలు పెట్టుచుండెను. తుదకు వేంకటనాయఁడు విసిగి కుమార్తెయే తన్ను నిర్బంధించువఱకును ఆమెవివాహమే తలంపరాదని శపించి యూరకుండెను.

వేంకటనాయని యింట నాతని దూరపు బంధువు వేజెండ్ల పద్మానాయఁడు ఎట్టిసామర్థ్యములును లేనివాఁడు వృద్ధుఁడు ఆశ్రితుఁడై యుండెను. 'అక్కడికిపో, ఇక్కడికి రా, అదితే' అను నిత్యాదపనులం జేయుచు వారియింటనే పొట్టపోసికొనుచుండెను. తానే వారిమెప్పును పొందఁగోరి వారు చెప్పుటకు ముందే వారి యవసరములను తీర్చుటకు యత్నించుచుండును. ఈ చాకిరి చేయువానికి నాగప్పనాయఁడని కుమారుఁడు, ఇరువదియైదేండ్లవాఁడు తండ్రివలెఁ గాక కత్తిసాములు నేర్చి గురువుకడ సంస్కృతాంధ్రములు నేర్చినవాఁడు ఉండెను. క్రమముగా పెద్దలయనురాగమును సంపాదించి యాబాలుఁడు సైన్యములో నొక యుద్యోగమును చేసికొనెను. అతనికి నిత్యమును తాను చూచుచుండిన బుచ్చమ్మపై ననురాగ ముదయించి వృద్ధియగుచుండినది. అతఁడు ఈ మర్మమును ఎవరికిని చెప్పను లేక చెప్పకయుండను లేక తనలోనే కుమిలి కొన్నిదినములు కష్టపడెను. తుదకు దాఁచు

కొనలేకపోయెను. ఒకదినము తానే బుచ్చమ్మతో చెప్పి యామెను వివాహమాడఁ దలంచెను. కాని యామె యంగీకరించునో లేదో యని కొంత తగ్గెను. తుదకు తెగించి ఒకదినము ఆయమగదికి పోయెను.

అప్పుడు బుచ్చమ్మయు, నామెపెని కత్తెయు నాగదిలో నుండిరి. నాగయ్య వారిదృష్టి నాకర్షించెను. 'ఏం! నాగయ్యా?' అని బుచ్చమ్మ పలుకరించెను. నాగయ్య క్షణ మూరకుండెను. 'ఏంకావాలె? ఎందు కొచ్చినవ్ నాగయ్యా?' అని యామె మఱల బదులు పలికెను.

'ఎందుకో వస్తనా, నీకోసమే.'

'చెప్పరాదూ నన్నేంజెయ్యమంటవో?'

నాగయ్య కొంచెము గుటకలు మ్రింగి 'ఏం చెప్పమంటవుపో. నేను దాచాలేకా, చెప్పనూలేకా తంటాల పడతావున్నా. నీకోసం సచ్చిపోతావున్నా. మరీ కొన్నాళ్లె మట్టి నాబాద చెప్పితే తీరదు. ఎప్పుడూ నువ్వే నాకళ్లకి అవుపడుతావున్నావు.'

'ఏందేవు నాగయ్యా మాటలూ? పిచ్చేమన్నా పట్టతా వుందా, నాగయ్యా, నీకు. నీమాటలేం నాకర్థం కావటంలే.'

'బుచ్చమ్మా! నన్ను పెళ్లిచేసికోవూ.'

'ఛీపోపో. ఇదా ఆకరికి. పోవోశి. నీలాంటివోళ్లు వొందలు వొందలు వొచ్చి మెనిక్కిబోయినారూ. నీకేం ఉందదని, ఇల్లుందదా, ఆస్తిపరుడివా, నీకొపేరుండదా. నువ్వేం యుద్ధంలో మొనగాడనా, నీమొకం సూచి నిన్నెకరు పెళ్లి చేసుకుంటరా. ఎల్లు ఎల్లు, ఎల్లవయ్యా. బల్లే అడిగినవు గానీ.'

పాపము నాగయ్యకు కన్నుల నీళ్లు తిరిగినవి. బదులు చెప్పలేకపోయినాడు. 'అయ్యో! అయ్యో!' అని అస్పష్టముగా పలికి క్షణ ముండి, 'నేను నువ్వులేకపోతే చచ్చి



'ఏం! నాగయ్యా?' అని

పోతా. బతకను బతికలేను.' అని పలుకుచు ఆమెముందు పడిపోయినాఁడు.

'మాయింటో అడక్కతినేవోడినంట పెళ్లి చేసుకునేదంట. అవరా! అవరా!' అని

చాల కోపమున బుచ్చమ్మ లోపలికి వెళ్లి పోయినది. ఆమె పనికత్తె నాగయ్యనే చూచు చుండినది. 'అమ్మోరిమింద మోజుపడ్డాడు. బల్లే తనకలాడతావుండాడు పాపం. అమ్మోరేమో ఇట్టాంటోన్ని ఒల్లదు. పాపమే ఈపిచ్చిచాత ఏమయిపోతాడోనే' యని తనలో ననుకొనెను.

బుచ్చమ్మకు పెక్కు దినములుగా నాగయ్య తన్ను వలచియున్నాఁడని అనుమాన ముండినది. కాని నాగయ్య




చ్చమ్మ పలుకరించెను.

ఎన్నఁడును ఆవిషయమును బయటికి రానీయలేదు. ఎండ

అనో త్రిప్పివైచిన బుచ్చమ్మకు వానియను రాగమును చూడగా కొంచెము కనికరము కలిగినది.

నాటిదినము నాగయ్యకు జ్వరము వచ్చినది. వైద్యులు ఎన్ని మందు లిచ్చినను జ్వరము తగ్గలేదు. మనోవ్యాధికి మందులేదని వారెఱుంగుదురుగాని యేదనిది మనోవ్యాధి యని వారెట్లెఱుంగగలరు? ఈబాలుని వ్యాధికి తేనలయునని యువకుడు వేరొక నాయుడు పలువురు వైద్యులను పిలిపించెను. ఎవ రెన్ని మందులిచ్చినను నాగయ్య స్థితి మారలేదు. ఆతని తలలో నెన్నియో ఆలోచనలు పెరుగువారుచుండినవి. తుదకు ఉన్నట్టుండి ఏమితోచినదో ఒకదినము లేచి బుచ్చమ్మకడకి పోయినాడు. మరల నామె పాదములబడి తన ప్రాణములు నిలుపుమని వేడినాడు. ఈమాటలు ఆమెవాక్యములలో నాతనికి కొంతఆశ కనబడినది.

'మానాయనకాడ పనులు చేస్తేవోడి కొడుకున్నపోతివే, నిన్నేంగూరి పెళ్లిచేసికోనుంటని నాయ్యా. నీకేనాశగ్గుంటే ఈమాటలాడ్డానికి. నాయనితో చెప్తే నీప్రాణాలు తీస్తడే. అయ్యో, పాపం, అనిఊరికుండేకొద్ది నెత్తికెక్కుతావుండవే. శిన్నప్పటాలనుంచి ఒకటేయింట్లో పెరిగినావోడివే అని దయదలిచినగాని మరోడైతే ఈపాటికి...మళ్లీ యీమాటలాడకపో. నాయనకి తెలిస్తే సంపేస్తడు.'

'సావడం మేలుకదూ. సస్తా. నీవు ఒల్లకపోతే నేను సస్తానేగాని ప్రాణంతో ఉంటనా. ఈయెదవబతుక్కంటే సావు మేలు కదూ.'

'యెదవమాటలు, యెర్రిమాటలూను' అని యామె అచటినుండి వెడలిపోనుండినది కాని నాగయ్యస్థితిచూచి నిలిచినది. నాగయ్య నోట మాటరాక తడబడి కన్నీళ్లుధారగా రాగా నేలమీఁద పడిపోయినాడు.

'అయ్యో పాపం! నీకోసం యిట్లాగే అయిపోయినవు పాపం నాగయ్య' అని పరికిస్తే పలికినది.

బుచ్చమ్మమనసు మెత్తబడినది. 'ఇదుగో, నాగయ్యా, నీవు నాయనతో చెప్పి మంచి నౌకరీ యిప్పించి మంచి సంబాదం కుదరన్నా. యీపెళ్ళి చేస్తాలు యీనె యియ్యా.'

'అయ్యో! బుచ్చమ్మా, నాకు యీ దేశంలో అంతా ఒక్క నీమీఁదనే మనసు' అని పలికినాడు నాగయ్య ధైర్యము తెచ్చుకొని.

'మూన ... రాజుకాడ నౌకరిలో ఇన్నిలక్షలు సంపాయించినడు. ఆయన ఎందరో ఏనో నీమల్లుంటా పిలిపించినోళ్లనంతా మంచిమంచి ఆస్తిపరుల్ని నేనోల్లకపోతే పొమ్మన్నడూ. కడకి ఇంట్లో పనిచేశే కుర్రోడిని కట్టుకుంటే నంగన్లో నవ్వేపోరంటయ్యా. బయటికి పోయి కొలువుచేసి రాజ్యాలుకొట్టి పేరునంపాయిస్తే గదంటయ్యా నీమాటకి విలువ.' అని పలికి బుచ్చమ్మ ఆవలికి పోయెను.

నాగయ్యకు ఈమాటలలో కొంత ఆశ కనబడెను. బుచ్చమ్మ తన్నంగీకరించినట్లే యాతడు తలంచెను. వెంటనే యాతని రోగము పటాపంచలాయెను. లంఘనముల చేత శుష్కించిన శరీరమును రెండుమూడు దినములింటనే యుండి సరిదిద్దుకొని తర్వాత గ్రామములోనికి బోయెను. ఇప్పుడతనికి విపరీతముగు నావేశము కలిగినది. తన ప్రశ్నకు బుచ్చమ్మ హస్తమే ఇనాముగా తాను ప్రసిద్ధిగాంచవలయునని తలంచి యాతడు అన్నిటిలోను ముందంజవేయ మొదలిడినాడు. తన ప్రాపకుడైన యా వేంకటనాయని గ్రహించి తన్ను సామాన్య సైనికోద్యోగమునుండి పై యుద్యోగమునకు వేయమని కోరినాడు. వెంటనే యాతని శక్తి నెఱింగిన వేంకటనాయుడు ఆతని నొక దళాధిపతిగా జేసెను.

త్వరగా విషయమును పోయి యాతడు బుచ్చమ్మకు చెప్పుకొనెను. 'అప్పుడే సోమాయెనా యా! యుద్ధాలు రానీ. పోయి ఢిల్లీకుపోయి తురకల్ని కొట్టిరా, వాళ్ల రాజ్యాలు దోపిళ్లుచేయి, బిరుదులు వేసుకో. ఆపైన అన్నీ' అని బుచ్చమ్మ బదులు చెప్పెను. నా బదులు పలుకక తల వూపించి వెడలిపోయెను. ఆదినమే మల్లిక్ కాఫర్ దండెత్తి వచ్చుచున్నాడనియు ఓరుగంటిలోని సేనయంతయు యుద్ధమునకు సన్నద్ధమగుచుండెను. నాగయ్యయు తనకు క్రొత్తగావచ్చిన యుద్యోగమును నిర్వహించి పై యుద్యోగములు సంపాదింప నిశ్చయించి అమితోత్సాహముతో దళములో పనిచేయుచుండెను.

నాగయ్యకు ఇప్పుడు తీరికయే లేదు. గ్రామములూ, నగరములు, పల్లెలు ఎచ్చటచూచినను కూర్చుండిన చోట నిలువక, నిలిచిన చోట కూర్చుండక నాతడు సైన్యముతో కదలి పోవుచుండెను. శత్రువులను ఆతడు చెండాడిన విధము, నగరములోనికి వారిని రానీయక అన్ని మార్గములలోను అడ్డిన విధము, మరల వారిని తమ దేశమునకు పోనీయక అడవులలో వెనుదిరిగివచ్చి నఱికిన విధము ఇవియన్నియు వ్రాసిన నొక గ్రంథమగును. జేతాళరాయనికి ఆయుద్ధమందు కుడిభుజముగా నాగప్పనాయడు మంచి ప్రసిద్ధిగాంచెను. యుద్ధరంగమందు తురుష్కులు పారిపోవుటలో వదలిన వస్తువులు, ఆభరణములు, ద్రవ్యము కొంత ఇంటికి బుచ్చమ్మకు కానుకగా పంపుచుండెను. ఆతడు ఇల్లు వదలిన సంవత్సరమునకు శత్రువులు సంపూర్ణముగా వెనుకకు మరలిపోయిరి. సంవత్సరాంతమున నాగప్పనాయడు ఇంటికి మరలి వచ్చెను.

నాగయ్య వచ్చుచునే బుచ్చమ్మను చూచి ముగపోస మొనర్చెను. ఆమెయు బదులొనర్చి 'అంతా బాగానే ఉంటదిగాని నాగయ్యా, శానాపని చేసినవు. ఈమాత్రానికే త్రిప్తిపడితే యెట్లా. మల్లా నీకు సోమరితనం వస్తది. మల్లాపో నీలాంటివీరుడు

లేదని పేరుతెచ్చుకో. ఆనాక పెళ్లి మాట్టాడుదాంగనీ.' అని బదులు పలికెను.

'సరే. నీయాజ్ఞకదూ. అట్టగే. ఎల్తా. దేశాలూ రాజ్యాలూ కొడతా. నాఅంతటి వోడు లేడనిపిస్తా. నేగన నస్తినా యుద్దంలో నీపేరుచెప్తా ప్యాణం వోదులుతానని మాత్రం తల్చుకో' అని పలికి నాగప్పనాయఁడు మరల దండులోనికి పోయెను. ఈమూలు ఓరుగంటిలో గొప్ప ప్రయత్నము జరుగుచుండెను. గయాజుద్దీను తోగ్లాకు సుల్తాను సఖ్యమభినయించు వలీఖానుని ఓరుగంటికి నయతంత్రముచేత ఓరుగంటిని పట్టుమని పంపెను. వలీఖానుఁడు ప్రతాపరుద్ర మహారాజును వేఁటలో నిద్రలోనుండఁగా పట్టుకొని పోయెను ఈవిషయమును విద్యానాథ మహాకవిచూచి రహస్యముగా యుగంధరునికి తెలిపెను. మహామంత్రియుగంధరుఁడును, పేరిగానికి రోగిరాజువేషము వేసి, రాజు వేఁటలో గాయములు తగిలి రోగిగా నున్నాఁడనియు, రాజనుకొని తురకలు చాకలిని పట్టుకొని పోయినారనియు చాటి యుద్ధమున కాజ్ఞయిచ్చెను. ఖుస్రూఖానుని క్రింద తురుష్కులు యుద్ధము చేసిరి. ఆమహాసంగ్రామములో నాగప్పనాయఁ డొకవైపును, బేతాళనాయఁ డొకవైపును, నరసింహరాయ లొకవైపును పోరి తురకలను రూపుమాపిరి. బేతాళనాయఁడు వ్యూహము పన్ని శేషించిన వారిని సైతము నాశముచేసెను. ఈయుద్ధములో వారువారు చూపిన ధైర్యసాహసములకు తగినట్లు మహామంత్రి వారికి సమ్మానములం గావించి తాను ఢిల్లీకి రాజును తేఁబోయెను.

యుగంధరుఁడు ఢిల్లీలో పిచ్చివాని వేషము వహించి తిరుగుచు ఏడునెలలుండి ఉపాయముగా తనవర్తకుల మూలమున యుద్ధనావలను వర్తకనావలని ఢిల్లీకి కొని పోయి, వర్తకులచే సుల్తానును ఓడలలోనికి రప్పించుకొని రాత్రికి రాత్రియే ఢిల్లీవదలి యమునలోఁబడి గంగాద్వారమున హుగ్లీ దాఁటి సముద్రమార్గమున తూర్పుసముద్రతీరమంపలి గోదావరీముఖముం జొచ్చి ఓరుగల్లు చేరెను. ఇంతకార్యమును జరుగుకాలమున తెనుఁగుసేనలు యమునానది పొడుగునను సముద్రతీరముననను, ఆంధ్రదేశమునకు శత్రువులు రాఁదగు మార్గములయందంతటను పెక్కుప్రదేశములలో కాపుండి చాల పని చేసినవి.పడవలు లంగరెత్తఁగానే తురుష్కులు మేలుకొని పైఁబడఁగా ఆంధ్రులు వారిని హత మార్చిరి. రాజు మరల నగరము చేరెను. యుగంధరుఁడు, చాకలి మరల తమరాజ్యము చేరెనని నగరమంతయు చాటి ఢిల్లీసుల్తానుతో సఖ్యముచేసికొని మర్యాదలతో వదలిపెట్టి, తమ యుద్యోగస్థులకు గొప్ప సత్కారములు చేసెను. విద్యానాథమహాకవిని మంత్రులలో నొకనింగా నియమించి పూజించెను. నాగప్పనాయఁడు చూపిన పరాక్రమమున కాతనిని సేనాపతులలో నొకనింగా నియమించి అర్హరీతిని సన్మానించెను.

వేంకటనాయఁడు తాను వృద్ధికిఁ దెచ్చిన బాలుఁడు సేనాపతులలో నొకఁడౌటకు పరమానందమును జెంది వానిని కౌఁగలించుకొనెను. ఇంతకాలమును నాగప్పనాయని శరీరముమాత్ర మటనుండెనే గాని హృదయము బుచ్చమ్మకడనే యుండెను. ఎప్పు డెప్పుడు ఇంటికేగి బుచ్చమ్మయాజ్ఞవడసి యామెను వివాహ మాడుదునా యని యాతఁడు క్షణము యుగముగాఁ గడపె, సభ లేవఁగానే వేంకటప్పనాయనితోఁ గూడ నిల్లు చేరెను.

బుచ్చమ్మ చేటిమూలముగా ముందే విషయమంతయు వినెను. అభ్యుదయముతో నింటికివచ్చిన నాగప్పనాయనికి ఎఱ్ఱనీళ్లు కలిపి దృష్టి తీయించెను. అందఱును లోనికి రాఁగానే నాగప్ప బుచ్చమ్మతో 'నీయాజ్ఞ. ఇంకేమంటవో?' అని పలికెను. బుచ్చమ్మ బదులు చెప్పలేదు గాని ఆ మౌనమే అంగీకారమును తెలుపుచుండెను. పిదప చేటిమూలముగా నామె తన యంగీకారమును తెలుపఁగా వేంకటప్పనాయఁడు కొమార్తె వివాహమునకు ఏర్పాట్లుగావించెను. ఎల్లవారిని తిరస్కరించి గర్వముచూపిన బుచ్చమాదేవి తుదకు సరియైనవానినే వివాహమాడుచున్నదిగదా యని బంధువులెల్ల పండుగుచేసిరి. ప్రతాపరుద్ర మహారాజు కానుకలు వర్షించెను. సంతోషాతిరేకముచే నాగప్పనాయఁడును, ఆతని తండ్రియు విశేషముగా బీదలకు దానములుచేసిరి.

## 3

నాగప్పనాయనికి వివాహమై కొన్ని నెలలైనవి. ఆతనికిప్పుడు మహైశ్వర్యము కలిగినది. కుమారుఁడు లేమిచే వేంకటప్పనాయని యాస్తియంతయు నితనిదే. పైగా స్వార్జితమును కలిగినది; రాజ్యమందు విశేష గౌరవ మేర్పడినది. కాని ఈవిభవము కలిగిన కొంతకాలముననే యాతనికి సంతసమునకు బదులు విషాదము కలిగినది. ఒకనాఁ డాతఁడు వేఁటనుండి ఇంటికి మరలి వచ్చుచుండెను. మార్గములో బ్రాహ్మణాగ్రహారమున నొక బ్రాహ్మణుఁడు తిన్నెపై తనచుట్టునున్న వారికి

'వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసా౯
నిశార్థ మర్ధం దివసే యతేత,
వార్ధక్యహేతో ర్వయసా నవేన
పరత్రహేతో రిహజన్మనాచ.'

అను శ్లోకము చెప్పి దానియర్థమును వివరించుచుండెను. నాగప్పనాయఁడు కొంతసేపు నిలిచి ఆ యుపన్యాసము నాలకించెను. ఇట్లు చింతించెను. 'నేను మొదట అల్పబాలుఁడను. నా తండ్రి వేంకటప్పనాయని నాశ్రయించెను. ఆతని పోషణలో బ్రదుకుచు నేను ఒక స్త్రీ కొఱకై దేశములు తిరిగితిని; యుద్ధములు చేసితిని; లెక్కలేనిపోట్లు పొడిచితిని; పోట్లు తింటిని; రాజానుగ్రహము వడసితిని; జమీను సంపాదించితిని. తుదకివన్నియు నశ్వరము లేగదా. ఇహమునకై పరమును బొత్తుగా మఱచితిని. జను లెంత తెలియనివారు,

యాత్రలుపోవుటకు సంసిద్ధుఁడాయెను. పోవుటకు ముందు తనకత్తిని ఆమెచేతికిచ్చి, అప్పుడామె గర్భిణి, 'ఇది నా పిల్లోడి కీ. దీనికంటే మేలైంది వాడికి నేనే మిగిలాతా' అని ఆమ యుంగరమును తాను కైకొని ఆరాత్రి ఎవరికిని తెలియనీయక బాటసారివేషమున నాతఁడు ఓరుగల్లు వదలిపోయెను.

ఆతఁడు పోవువరకు నిద్రపోయియుండి ఆతఁడు పోఁగానే బుచ్చమ్మ ఏడ్చుచు, తలవెండ్రుకలు లాగుకొని, చేతులు పిసుకుకొని, పడకలో మొగము పెట్టుకొని కొంతసేపు ఏడ్చి ఏమిసేయుటకును తోఁచక పడకలోనే దొర్లుచుండెను. మధ్యలో మరల నాతని వెనుకకు పిలుచుకొనిరావలయునని యామెకు తోఁచెను. కాని ఆ చీఁకటిలో దారితెలియదని మానుకొనెను. ఇంతలో నాతని కత్తితోఁ తనతల దునుముకొనఁదలంచెను. ఆతని కత్తితోనే తాను చంపుకొనిన ప్రజలు నిరపరాధియగు నాతని హంతకుఁడందురు గదా యని వెనుకంజవైచెను. తన కడుపులోని శిశువును తలఁచుకొనెను ఆ రాత్రియంతయు నావిధముగాఁ గడపి ఉదయమే లేచి తండ్రికిదంతయుం జెప్పకొనెను.

వేంకటనాయఁడు ఆశ్చర్యపడెను. 'నిన్నొదిలేసి యాడికి బోతాడమ్మా. నీమనసు పరీక్ష శేయ్యటానికి నాటకమాడతావుండాడు. వొస్తాడులే. కొన్నాళ్లు కనిపెట్టుకుండు, అంతా తెలస్తది.'

'లేదు నాయినా, మల్లారాడు' అని భర్తను చక్కఁగా నెఱింగి యామె వచించెను. వేంకటనాయఁడు ఇదంతయు నమ్మలేక ఆలోచనలో పడిపోయెను. వెంటనే మనుష్యులను నానాదేశములకు క్షేత్రములకును పంపి వెదకించెను. కాని ఎచ్చటను అల్లునిజాడ కానరాదయ్యెను. దినములు గడచుచుండినవి.

బుచ్చమాంబ ఇంక తాను భర్తను చూడనని నిరాశచేసికొనెను. నాగప్పనాయఁడు కనఁబడని దినమునుండి యామె నవ్వఁగా చూచినవారులేరు. కొంతకాలమునకు ఆమెకు ప్రసవము కాఁగా కుమారుఁడు పుట్టెను. ఆబాలునియందు తండ్రిమూర్తిని గాంచి యామె గారాబముతో వానిని పెంచుచుండెను. ఆమెకు ఆబాలుఁ డొక్కఁడే సంతోషకారణము బాలుఁడు జనించిన కొంతకాలమునకు ఆమె దేవాలయములు కట్టించుచు, బ్రాహ్మణులకు దానాదికములు చేయుచు ధర్మకార్యములయందే కాలము గడపుచుండెను. పూర్వము ఎట్లు సౌందర్యమునకు పేరు వహించియుండెనో అట్లే ఇపుడు దానాదికములకు పేరువడసెను. క్రమముగా నామె నివాసస్థల ప్రాంతప్రదేశమెల్ల లేనివారికి ఆవాసస్థలముగా మారెను. దానమునకు ప్రఖ్యాతులు ఎందఱుండియు నామెకు సరిగారని ఎల్లవారును పొగడుచుండిరి.

ఈలోపల నాగయ్య కాశికిపోయి ఎవరికిని తెలియని ప్రదేశమున నేడుసంవత్సరములు

ధ్యానమునఁగడిపెను. తర్వాత క్షేత్రమువెనుక క్షేత్రమునకు ప్రయాణము చేయుచు భరతఖండమును లెక్కలేని పర్యాయములు ప్రదక్షిణము చేసెను. ఈవిధముగా దేశమెల్లఁ జూచి అన్నిమతములవారిని సందర్శించి పెక్కు విషయములను తెలిసికొని మరల ఓరుగంటికివచ్చెను. ఇప్పు డాతని వేషము పూర్తిగా మారిపోయినది; ఎవరును గుర్తుపట్టనట్లుండెను. ఊరి బయట కొందరు వైరాగులు, జోగులు, సన్న్యాసులు నుండిరి. వారికడకు పోయి యాతఁడు కూర్చుండెను. వారును మాటల వరుసలో ఇచ్చమాంబ యొక్క దానమహిమను, పాతివ్రత్యమును పొగడుచుండిరి. వెంటనే యాతనికి దుఃఖము పొర్లివచ్చునట్లుండుటచే నాస్థలము వదలి మఱియొక చోటికి పోయెను. ఆ సమీపమున నొక క్రొత్త దేవా





...లయము ముండెను. అచ్చట నాసమయమున లెక్కలేని ముష్టివాండ్రును నానావిధములవారు గుమిగూడియుండిరి. వారి మాటలవలన నాస్థలమునకు అప్పుడే బుచ్చమాంబ రానున్నదనియు, ఆమె ఎల్లవారికిని దానములు చేయుననియు నాతఁడు గ్రహించెను. తాను ఆగుంపులో చేరి ఆమె రాకను వేచియుండెను. ఇంతలో బుచ్చమాంబ కుమారునితో నడచి దేవాలయములోనికి వచ్చినది. ఆమె స్వరూపముకూడ మారిపోయినది. తలవెండ్రుకలు జడలుగట్టియుండినవి; మొగమున దైవభక్తి, కొంత శోకమును కనఁబడుచుండినవి. స్నానముచేసి పట్టుబట్టగట్టి మడిగా నామె దేవాలయము ప్రవేశించెను లోపలకొంతసేపుండి దేవునికి పూజచేయించి ముగియఁగానే యామె బాలునిచేతికి డబ్బుల పళ్లెమిచ్చి ఆ గుంపునకు వరుసగా నిప్పించుచు వచ్చెను. ఇదంతయు చూచుచుండిన నాగప్ప ఆబాలుఁడు తనకడకు రాఁగా తానును చేయిచాఁచెను. ఆబాలుని చూడఁగానే యాతనికి కన్నీళ్లువచ్చినవి. 'భగవత్ప్రీతిగా నడుచుకో బాబూ' యని పలికి ఆబాలుని కౌఁగిలించుకొని ముద్దాడి వెంటనే ఆమె తన్నెక్కడ గుర్తించునో యని మొగము త్రిప్పుకొని వెడలిపోయెను. ఆమెయు అతనినే చూచుచుండి అతఁడు పోఁగానే తన చేటిని పంపి అతనిం బిలుచుకొని రమ్మనెను. కాని యెచట వెదకినను అతఁడు కానరాఁడు.

నాగయ్య ఏకాంత ప్రదేశమునకుపోయి తన్నువలెనే తనభార్యయు భగవదనుగ్రహము పొందుటకై కృషిచేయుచున్నది కదాయని సంతోషించెను; పిదప వారిని తాను వదలి

తిని గదాయని దుఃఖించెను. తన్నెఱింగింపఁ దలంచెను. ఇంతలో కూడదనుకొనెను. 'ఈ ఐహిక సౌఖ్యములు, వాంఛలు తుచ్ఛములు. మరల ఇంటిలోఁబడిన బుద్ధి మారిపోవును. నాభార్యయు, కుమారుఁడును దేవుని ధ్యానించుచు దుఃఖములోనే కాలము గడుపుదురు గాక.' అని సమాధానము చేసికొనెను. పిదప నాతఁడు ఓరుగంటి వెలుపల జనసంచారము లేనిచోట నేలమాళిగయొకటి చేసికొని అందు వసింపందొడంగెను. ఎవ్వరైనను కనికరించి యన్నము తెచ్చిపెట్టినఁ దినుచు లేని నాఁడు పస్తుగాఁ గడుపుచు గొప్పసన్న్యాసి యని ప్రసిద్ధిగాంచెను. ఆతనిఖ్యాతిచే ఎల్లవారును ఆతనికి భిక్షలు పంపుచుండిరి. బుచ్చమాంబయు పలుమార్లు పంపుచుండెను. కాని ఎవరును ఆతని నామాదికములు నెఱుంగరు.

ఇట్లుండఁగా నాతనికి అవసానకాలము వచ్చినది. అంతట నాతఁడు తనకు నమ్మకమైన శిష్యునిచే నాఁడు తనకు బుచ్చమ్మ యొసంగిన యుంగరమును ఆమెకు పంపి వెంటనే వచ్చి తన్ను చూడఁగోరెను. ఆ యుంగరమును చూడఁగానే అతిహర్షముచే నామె మూర్ఛిల్లెను. ఇంతలో పరిచారిక యుపచరింపఁగా లేచి కుమారుని పిలుచుకొని స్వామిదర్శనమునకు పోయెను. బుచ్చమాంబ వచ్చునప్పటికే ఆతనికి కొనయూపిరి యుండెను. ఆమె తటాలున లోనికి దుమికి ఆతని చేతులు పట్టుకొనెను. నాగయ్య కన్నులు తెఱచి చూచి ప్రాణములు వదలెను. ఆమె దుఃఖమునకు మేర లేదు. 'నిన్ను ఆదినమె చూచినాను, తెలివిలేనిదాన్ని పోల్చుకోలేక పోతినే. నీబిడ్డని పలకరించినావు నాతో ఒక మాటనా పోతివే.' యని నొచ్చి యామె నేలఁబడి ప్రాణములు వదలెను.



ప్రతిబింబములు K. P. S.

## పీడుకోలు

శ్రీ తి. వ. నారాయణస్వామి

హనుమఁ డిట్టులఁ దనకత నోఁగి-వినుపించిన యోషిఁద నెంతో వేడుకఁగొని య
మ్మనుచూలి యతనితో ని-ట్లని వినిచెన్ దనదు బాళి లాగు కడంకన్.

నినుఁ దన లెంకఁగాఁ గొనియెనే నను నేలిన యమ్మొకాఁడు స
గ్గనుఁగొన నంపెనే నెవరు కందువ; దన్నెద నమ్మి నిచ్చలున్
మను నొక ప్రావుఁబోఁడికల మాటఁ దలంచి కలంగి యాసతోఁ
దన కలనూపు దెల్పుటకు దాఁ దలపోసెనె నిక్క-మానొకో.

తలఁచునె నన్ను చందొవల దాయకొలంబునఁ దోఁచు నింపుఁ జె
లిలియఁగు రాగవుండు కడు వేదురుగొల్పెడి సోఁకుమూఁకలన్
వాఁతితసంబుచే నుసురువాపి దురమ్మున నెమ్మినీటఁ సీ
సిలుగులఁ దోర్చి నన్బెరిమఁ జేకొనఁ జూచునె నీ వెఱుంగుదే?

కినుక యొసంగదే కన యొకింతయు నాదెస నాస హాన్నుజిం
కను గొనిరాఁ గలాసనయి కాసల కంపినదాన నౌటఁ; దా
ననఁ జెకదయ్యె లక్కమనుఁ దాతగి నాతని దూఱి వేసటన్
బొనుఁపఁ జేసి రాముఁ గనఁబొమ్మని తుల్వతనమ్ముఁ జూపుటన్.

తుంటవిల్దంట దాఁ ద్రోచె క్రీగంటిపెన్ - మంట నేదంట నమామ న్నమేల్విల్లు దా
నంటి నన్దుంటమూ నట్లుగాఁ జేయునా - వంటన స్గంటున న్దాఁ దలంపంచెకా.

ఒరిమగలాఁడు కంగినల కోర్వఁగలాఁడు దురాన మాగ్తురన్
దఱుమఁగలాఁడు చేకొనినఁ దప్పకఁ బ్రోవఁగలాఁడు నాదెసన్
బెరిమగలాఁడు నామదికి వేదురుగూర్చెడి సిల్గు లెల్లు తాఁ
దఱుమఁగలాఁడె కో యను చెద స్దలపోయుదు నెల్లవేళలన్.

మిక్కిలికంటివిల్లు నసమించఁగ వంచె దురమ్ములోనఁ దా
నెక్కటి మూఁచు రక్కసుల నేర్పఱఁ ద్రుంచెఁ బిసాళికాక్కికై
యుక్కన బమ్మతూఁ బడరనొంచెఁ దలంచిన రాగవుండు న
న్నక్కట రక్కసీంద్రు కెనయై చనఁ జేసెనె యిట్టికర్జముల్.

ననుఁ దన యాలిగా నడయునాఁడు మొదల్ వెనుకానలందు బం
ష్లను దిని యొండకోర్చుచు నొడ ల్వాడకించెడి పోరితమ్ములం

దాసుఁ దన యొప్పుఁ జూపి తరిఁ దోరిచెంగాని సుకమ్మటన్న మా
టను దన వీనులన్ జొనుపుట న్గనఁ జేలిక యక్కటక్కటా.

కొండలఁ గొంచు రక్కసులు కోల్తలసేయగ లేతనవ్వుతో
నిండు మొగంబు వాడువడనీనివితమ్ముఁడ బోరొనర్చి లే
మొండి కివమ్ము నా దెసల కేఁగఁగఁ జేసిన జెట్టి నన్నుఁ బ్రో
వండెన నెట్టులాడునొకొ వాయికొలన్ దొలఁగింపవచ్చునే.

కలితన మొప్ప నిన్నెనయుగామిడులే మొనలై తలిర్ప మ
బ్బులవిరి తిట్టఁ దాఁటఁదగుఁ బో తలపోయఁగ నెందు వీలుగా
సురుల కౌచు మేచరుల నాలమున న్బలియించు ఘనానీకాదో
చెలువుగఁ జెల్వుఁ డీయనదఁ శేకొని మన్నునో విన్నుమన్నఁడా.

కానల నుండఁగాఁ దలువ కాకి యొకించుక గాసిసేయ కో
పానను దాని మన్నిగొన వాలగు నల్వాజిరానడర్చి యొం
తో నెనరొప్ప నా వెరపు గోరిచి మన్చిన నాయెడందఁ దాఁ
జానమాను; బాములువడ న్గడు నోర్వక నెగ్గులాడితిన్.

కననగు నెప్డు తమ్మి నెసఁగ న్బొడసూపన లేమ యన్నతో
జన నలరారునాతని నెపంద కొలంబను పాలవెల్లికిన్
గొనబగు నిండుచందురునకు న్బొడమై పొడసూపినట్టి రా
యని నను మెట్టుఁ దమ్ములను సాళి నొగి న్మది వంతఁ గోరఁగన్.

మొగుపుంగేలు దలిర్ప నేఁడుముసుకమ్ము న్బక్కఁ డాల్వెల్పు నాఁ
దగు రాచూలిని మాటవాల్పదువు జెందంపున్న జాతమ్ముచా
ల్దగముకాలిని సోఁకుమబ్బుగమి నెంతో దవ్వుల న్దూల్పఁగా
దగు పెన్గాలిని బాము పెన్గడలి నీఁద న్బాసటౌ పిలిన్.

అక్కటికంపుఁ బెన్గడలి సరా నల రాముని యజ్జదోయికిన్
మ్రొక్కితి నెంతో వేడ్క నను మోయనుమా! నెనరూని సన్నుసీ
రక్కసి పిండు బారివడ రానివితమ్మున నోముఁ దాని నా
దిక్కనియుంటి నంచు వెనుదీయక విన్నపమిట్లు చేయుమా.

అనుమా యనుమా తాఁ జూపిన మాలిమిఁ జేసి యుసురువిడువక తానే
వినమానిన నడఁకువతో - నిను మానఁదలంప దెపఁద నెలఁత యటంచున్.

# సాంఘిక జీవనము–రైతాంగ విద్యాలయములు

పి. సుబ్బారావు

ప్రతిజాతికీ ఒక ఆదర్శం ఉంది. అదియే ఆజాతికి ప్రాణము, మూలశక్తి, స్వకీయోన్నత్యాన్ని ప్రకటించే విద్యుద్దీపము. జాతిలో అంతర్వ్యాప్తమైయున్న దైహికమానసిక ప్రకృతులయొక్క గూఢాంతరమే జాతియొక్క ఆదర్శప్రభావం. యుగాలు మారుతయి; సంఘాలు మారుతయి; రాజ్యాంగాలు తలక్రిందౌతయి. కాని ఒక జాతియొక్క ముఖ్యసూత్రాలు మారాలంటే, అనేక సృష్టులు మారాలి. ప్రతిజీవియొక్క హృదయంలోను నైతికశక్తులు ఎల్లప్పుడూ పనిచేస్తూనే ఉంటయి. ఆధ్యాత్మికనిశ్రేణికలో పైమెట్టు ఎక్కాలనే కోలాహలం ప్రతిమానవునియొక్క అంతరాత్మలోనూ ప్రతిధ్వనిస్తూనే యుంది. అజ్ఞానమనే ఆదిశక్తి ఆకాతూహలాన్ని, ఆ ఆవేశాన్ని కప్పిపుచ్చ ప్రయత్నిస్తుంది. అట్టిపొరలు ముసిరికొన్న సంఘం నిద్రపోతూ ఉంటుంది. అట్టి మహానిద్రలో తూగుతూ, సొగ్గుతూ యుంది మన భారతజాతి. జాత్యాదర్శము మోక్షమనేసంగతి బొత్తిగా మఱచిపోయింది. సాంఘిక గుణభిమాన ఆవేశాల్లో మునిగిపోయింది. కష్టించి కృషిచేసి సంఘానికి మెరుగుపెట్టే కార్మికుల కష్టాల్ని హృదయంలో పూజింపలేకపోయింది.

శరీరానికి హృదయం ఎట్లో, మానవత్వానికి ఆత్మ ఎటులో, పుష్పానికి పరిమళమెట్టిదో, సాంఘిక నాటకానికి రైతు లటులని తెలియకపోతే మన జాతీయోద్యమ భేరీలు, మన సంఘసంస్కరణాభిలాషుల వికటాట్టహాసాలు, మన ఆర్థికవేత్తల కుయుక్తి సూత్రాలు నిష్ప్రయోజనములై కాలమనెడు మున్నీటి పెనువెల్లువలో మునిగిపోతయి. మనదేశము సరిదేశములలో తల ఎత్తవలెనన్న, మన కళావిశేషాలు, మన విద్యావిధానాలు, మన శౌచపద్ధతులు, మనఆర్థికసంపత్తులు, మన ఆధ్యాత్మికశక్తులు పూచిఫలించి శోభింపవలెనంటే, మనభూములు పండాలి, మన అజ్ఞాన తిమిరము విరిగిపోవాలి, మనగ్రామాలు ధనధాన్య సౌభాగ్యాలతో తులతూగాలి. పొట్టకూటికి లేని పామరునకు జాతీయరథాలు ముందుకు లాగే మూలశక్తి ఎక్కడినుంచి వస్తుంది? ఆధ్యాత్మిక సౌధాన్ని సృష్టించే క్రియాశక్తి ఎట్లా సిద్ధిస్తుంది?

మన ఋషిశ్రేష్ఠుల కాలంలో, మన శాస్త్రదేవుని కాలంలో నిష్కల్మషంబులగు నాగరికతా ప్రవాహములలో తేలియాడిన మన ఆదర్శాన్ని ఒకమారు ఊహించండి. చినిగినవస్త్రాలు, శిథిలించిన దేవళాలు, కృశించిన మానవపంజరాలు, పురుగులమయమై లుకలుకలాడు మురికినీళ్ల ప్రవాహాలు వీనిని అందు ఏమూలనైన కాన్పించునా? తినుటకు తిండియే లేక రేయుంబవలు గోడించు బాలబాలికలరొమ్ముల నొత్తుచూ నిత్యమూ కంటనీరుగార్చు కులకాంతలు వీరెక్కడైన కాన్పింతురా? అప్పటి విద్యాగోష్ఠులు వేఱు; అప్పటి ఆర్థికసంప్రదాయాలువేఱు; అప్పటి సాంఘికములయిన కట్టుబాటులు వేఱు. బుద్ధికి తగినవిద్య, కులానికి సరిపడు వృత్తి, నీతికి తూగిన కృషి, జాతికి తగిన కళలు, సంఘానికి సరిపడు ఆర్థికపారమార్థికసంస్థలు– ఇవి మన ప్రాచీన హైందవ నాగరికత యనెడుసౌధానికి పునాదులు. ఇప్పటివలె జీవితోపాధి కొంగుపూ కొంటగాక, విద్యార్థుల చిల్చిపిప్పిజేయు 'కాలేజీ' లప్పుడు లేవు. శరీరరక్షణ కుపకరించు ఆరోగ్యసూత్రాలు, గృహస్థధర్మ నిర్వహణమునకు తోడ్పడు గృహ్యసూత్రాలు, ఆత్మశాంతికివలయు ఆధ్యాత్మిక ధర్మాలు నేర్పెడివారు అప్పటి గురువులు. మనమో పాశ్చాత్య నాగరికతా తరంగముల యొఱపిడిలో నలిగి మ్రగ్గుతూ, ప్రాణములేని పూరిపుడకలవలె, స్వదేశమున నెఱుగక, స్వరాజ్యమన నూహింపలేక మూఢమతావేశములను దుమారములలో బడి ఎగిరిపోవుచున్నాము. ఆర్థిక రాజకీయ విషయాలలో పాశ్చాత్యపండితుల

# లాంజలి

పెమ్మరాజు లక్ష్మీపతి

ఇదిగొ, నాదోయిటను గ్రహియించుకొంటి
నీ కళాతరంగిణినుండి నీరములను
ఈజలాంజలిలో జపియించి నిన్ను
మరల నీయందె చేతు సమర్పణమ్ము.

అంబ ! నా కెందు కొంతైనను లేదు,
ఈ యనంతరసాగ నేను క్షణము
ఒక్కరుండిస్వతంత్రుడనై తేలియాడ నేని
విశ్వకళలు నాయందె నిలిపించుకొందు.

సర్వయుగముల రససహస్రస్వరూప
ములను నాలోన ఒకక్షణమ్మునను నిలిపి
'అతిసుతారము' సున్నితమైన పొగను
చిమ్ముకొని రసగర్భము చేరిపోదు.

దేహమిది ! నీవు పెంచిన దేకదమ్మ !
నాదుమదికి రంగులు పూసినావు నీవె,
ముక్తి !—నీయందు పుట్టినస్వప్న లభించె;
కలుపుకొను, హాయిలో హాయి కలిసిపోవ !

# పృథ్వీమహారాజుయొక్క తాణ్డివాడ శాసనము

డా. నేలటూరి వెంకటరమణయ్య

ఈ తామ్ర శాసనపు రేకులను మూటిని నాకు బ్ర. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారొసగిరి. వీని మొత్తముతూకము ౨౬౹ తులములు. ఒక్కొక్క రేకును ౬.౨" అం. నిడివి, ౨.౧" అం. వెడల్పు, ౦.౧" అం. ఘనమును గలిగియున్నది. రేకుయొక్క ఎడమ కొనదగ్గర, కడియమును దూర్చుటకు జేయబడిన బెజ్జ మొక్కటి కలదు. మొదటి రేకునందు నాలుగు పంక్తులును తక్కిన రేకులయం దొక్కొకదానియందును ఐదేసి పంక్తులును అక్షరములు చెక్కబడియున్నవి. కడియముగాని దానిపై తాపటము సేయబడిన ముద్రికగాని నా చేతికి రాలేదు.

శాసనము అసంపూర్ణము. పూర్వము రామకృష్ణకవిగారియొద్ద శాసనమునకు సంబంధించినవి రేకులు నాలు గొక వలయమున గ్రుచ్చియుండినవట. ఒకప్పుడు మదరాసు శాసనపరిశోధకశాఖవారీ తామ్ర పట్టికను గైకొని చదివి తమ ౧౯౧౭-వ సం.పు నివేదన పత్రికయందు దీని విషయమై చర్చించి, కవిగారికి దానిని తిరుగనిచ్చిరట. తరువాత కవిగారు పలుదేశములలో కాపురములు సల్పుచుండుకతమున వారి గ్రంథసామగ్రి యావత్తును స్థలాంతరములకు గొనిపోవబడుచుండెను. ఈ ప్రయాణములసందుకట్టున నాల్గవ రేకును, కడియమును నెచ్చటనో నష్టమైపోయెనట.

శాసన మసంపూర్ణమైనను చరిత్రకు నష్టము కలుగలేదు. ఏలన, నష్టమైన రేకు నాలవది. ఇతరశాసనము లన్నిటియందును సామాన్యముగ నగపడు దానఫలమును దెలియజేయు వ్యాసగీతాశ్లోకములే అందు చెక్కియుండెను. ఈ విషయమును మూడవ రేకు రెండవ ప్రక్క కడపటి పంక్తి తుదను చెక్కియున్న 'బహుభి ర్వసుధా దత్తా' యను శ్లోకపాదము స్పష్టపఱచుచున్నది.

లిపి:—ఇందలి లిపి విశేషములు నుడువదగిన వేవియు లేవు. మూడవరేకు రెండవ ప్రక్క కడపటి పంక్తియొక్క మొదటి యక్షరము ఆరవ, ఏడవ శతాబ్దులనాటి 'ల' ను పోలియున్నది. దానిని శాసనపరిశోధక శాఖవారు 'ని' అని చదివిరి. కాని, యది సరికాదు. ఆకాలపు లిపి ననుసరించి దానిని 'ల' యనియే చదువవలయును. లిపి క్రీ. శ. ఆరు, ఏడు శతాబ్దములలో తెలుగుదేశమున వాడుకయందున్న లిపియే. శాసనము లోని యక్షరములు కుబ్జవిష్ణువర్ధనుని

తిమ్మాపురము తామ్రశాసనపుటక్షరములను బోలియున్నవి. అక్షరములు చక్కగను లోతుగను చెక్కబడియుండుటచేత, రేకులు అరిగిపోయిన స్థలములయందు సైతము, సునాయాసముగ చదువుటకు వీలైనది. శాసనమును చెక్కిన శిల్పి తనకార్యమును జాగరూకతతో నిర్వహించినాడని చెప్పుటకు వీలు పడదు. ప్రమాదములు పెక్కు కాన్పించుచున్నవి.

| రేకుసంఖ్య | ప్రక్క | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- | --- |
| 2 | 1 | 4 | పాదానుధ్యాతః | పదానుధ్యాతః |
| ,, | ,, | ,, | ప్రెథివీ | పృథివీ |
| ,, | ,, | 5 | గ్రామ మధివస్నతః సవ్వా | గ్రామ మధివసతః స్సర్వా |
| ,, | ,, | ,, | కుటిమ్బినః | కుటుమ్బినః |
| ,, | ,, | ,, | సమ్మజ్ఞాపయ | సమాజ్ఞాపయ |
| | 2 | 1 | ప్రతిమస్త్రి | ప్రతిసత్త్రి |
| ,, | ,, | ,, | అస్మిట్టిసోమ | అగ్నిష్టోమ |
| 3 | 1 | 1 | (ఉప)నిమన్త్ర్య గవబో | (ఉప)నిమన్త్ర్య గానబో |
| 3 | 2 | 2 | రారాగ్య | రాజాగ్య |

ఇంతేకాదు. కొన్నిచోట్ల అక్షరములను వదలివేసినాడు. రేకు ౧. పం ౪. 'ప్రియాతనయః' అనుటకు బదులు 'ప్రియతనయ' యనియు; రేకు 3. ప్రక్క ౨. పం. ౪లో 'ఆజ్ఞప్తిః' అనుటకు బదులు 'ఆజ్ఞప్తి' అనియు విసర్గను వదలివేసి చెక్కినాడు. మఱియు రేకు 3. ప్రక్క ౨. పం. 3 లో '(ప్ర)వర్ధమాన' యని యుండవలసినచోట '(ప్ర)ర్ధమాన' యని 'వ'ను విడిచి చెక్కినాడు.

భాష:—శాసనగ్రంథము యావత్తును సంస్కృతభాషయందు విరచింపబడియున్నది. రేకు 3. ప్రక్క ౨. పం. ౫ కడపట చెక్కబడిన 'బహుభి ర్వసుధా దత్తా' యన్న వ్యాసగీతాశ్లోకపాదము దప్ప తక్కిన దంతయు వచనము, తప్పులు లేవు. కాని రేకు౨. ప్రక్క ౨. పం. ౩లో 'ప్రవరాయమాణ' యని యొక యపశబ్దము గనపడుచున్నది. ఇది వ్యాకరణ విరుద్ధము. ఇట్టి రూపము సిద్ధించదని పండితుల యభిప్రాయము. దీనిని 'ప్రవరాయమాన' యని దిద్దిచదువుకొనవలయును.

శాసనకాలము :— శాసనపరిశోధనశాఖవారు ఈ శాసనకాలము క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దారంభము అని వ్రాసియున్నారు. ఈ కాలనిర్ణయము సరికాదు. అట్లు తలంచుటకు రెండు కారణములు గలవు: (౧) శాసనము నొసగిన దాతయగు పృథివీ మహారాజుయొక్క రాజధాని పిష్టపురమని 'పిష్టపురాత్' అను శాసనారంభవాక్యమువలన తెలియుచున్నది. పిష్టపురము క్రీ. శ. ౬౩౦ సంవత్సరమున చాళుక్యరాజుల వశమాయెను. అదిమొదలు పిష్టపురమును తత్పరిసరములును వారిస్వాధీనమున నుండెను. క్రీ. శ. అష్టమశతాబ్దారంభమున నీ ప్రాంతములు చాళుక్యులయేలుబడియం దుండినట్లు శాసనములవల్ల తెలియుచున్నది. కావున ఆకాలమున చాళుక్యుడుకాని స్వతంత్ర ప్రభువొకడు పిష్టపురమునుండి రాజ్యముజేయుట యసంభవము. ప్రస్తుతపు శాసనము నొసగినదాత

చాళుక్యుడు గాడు. చాళుక్య నరపాలునికిగాని మఱి యన్యునికిగాని లొంగినవాడని చెప్పుట కెట్టి యాధారమును గానరాదు. కావున ఈ శాసనము పిష్టపురము చాళుక్యులకు స్వాధీన మగుటకు పూర్వ మొసగబడెనని తలచుట యుక్తము ; (౧) లిపి నైఖరిని జూచినను క్రీ. శ. అష్టమ శతాబ్దారంభకాలము నాటి దని తలచుటకు వీలులేదు. ఇందలియక్షరములు కుబ్జవిష్ణువర్ధనుని తిమ్మాపుర శాసనపుటక్షరములను మిక్కిలి పోలియున్నవి. ఈ కారణములవల్ల శాసనము క్రీస్తుశక సప్తమశతాబ్దమునాటి దనియును, క్రీ. శ. ౬౩౦ సం. ప్రాంతమునాటిది కావలయు ననియును నూహించుచున్నాను.

శాసనగ్రంథము:—రమకాశ్యపసగోత్రజుడును, మహారాజ రణదుర్జయుని కుమారుడగు విక్రమేంద్రుని పుత్రుడును నగు పృథివీ మహారాజు పిష్టపురమునుండి నిజవిజయరాజ్య సంవత్సరము ౪౬ నందు కార్తిక శుక్ల పౌర్ణమాస్యనాడు, కొణ్డమఞ్చి గ్రామవాసియు, కామకాయనస గోత్రోద్భవుడును, విష్ణుశర్మ పుత్రుడగు పృథ్వీశర్మయొక్క కుమారుడును, ఛందోగసబ్రహ్మచారియును నగు భవశర్మకు పాగుణారవిషయములోని తాణ్డవాడ గ్రామమును అగ్రహారీకరించి సర్వబాధా పరిహారము గలదానినిగ జేసి యిచ్చినాడు.

ఈ శాసనోక్తదానము నొసగిన రాజేవంశమువాడో తెలియదు. ఇతని గోత్రము పేరు రమకాశ్యపసగోత్రమని ఇందు సూచింపబడియున్నది. ఇది యొకయసాధారణ గోత్రనామము. కాని, 'కాశ్యపసగోత్ర' మనుటకు బదులు 'రమకాశ్యపసగోత్ర' మని చెక్కబడెనని శాసనశోధకశాఖవారు వ్రాసినది అంగీకరింపదగినది కాదు. దాతయొక్క తాతతండ్రులిందు పేర్కొనబడినారు. తాత రణదుర్జయుడు. ఇతడు మహారాజు. ఇతడొనర్చిన ఘన కార్యము లేవియు శాసనగ్రంథమున వర్ణితములు కాలేదు. 'రణదుర్జయు' డనునది యతని బిరుదనామమేమో యను సందియము గల్గుచున్నది. తండ్రి విక్రమేంద్రుడు. అతనికి మహారాజను బిరుదుగూడ లేదు. గద్దెయెక్కినట్లు తోచదు. దాతయగు పృథ్వీమహారాజు సమస్తసామన్తమండలమును నిజభుజపరాక్రమముచే జయించి కీర్తినిగడించినట్లు వ్రాయబడియున్నది. కావున ఇతడు తనపూర్వులకంటె నధికుడై శత్రునిరోధము లేక స్వతంత్రుడై రాజ్యము సల్పెనని యూహించుట కవకాశము గలుగుచున్నది.

పృథ్వీమహారాజు జనకు డగు విక్రమేంద్రుని పేరు నామసాదృశ్యముచే విష్ణుకుండి వంశపురాజులను స్మరణకు దెచ్చుచున్నది. వేంగినేలిన రాజవంశములయందు విష్ణుకుండి రాజులలోమాత్రము విక్రమేంద్రనామధారులగపడుచున్నారు. పిష్టపురము నేలిన రమకాశ్యపసగోత్రజులకును, విష్ణుకుండిప్రభువులకు నెద్దియేనియు సంబంధ ముండిన నుండవచ్చును. సామంతులు తమరాజులపేర్లను

తమయిష్టముల కిడునాచారము కలదు. అట్టి యాచారము ననుసరించి పృథ్వీమహారాజు తండ్రియగు విక్రమేంద్రుని కాపేరు కలిగెనని తలచితిమేని, రణదుర్జయుడు విష్ణుకుండి రెండవ విక్రమేంద్రునికి సామంతుడై యుండునని యూహింపదగియుండును. ఇతడు తన రాజుపై దిరుగబాటుచేసి స్వతంత్రుడాయెననియు నెంచవలసియుండును.

ఈ యూహలు కేవలము నిరాధారములు గావు. విష్ణుకుండుల చరిత్రమును పరామర్శించి చూచినచో నిసుక కొంత యాధారమగపడుచున్నది.

విష్ణుకుండి ఇంద్రభట్టారకవర్మకాలమున విష్ణుకుండిరాజ్యము దక్షిణ కళింగములోని పలకి రాష్ట్రపర్యంతము వ్యాపించియుండెను. ఇతడు కళింగాధిపతియు, పూర్వగంగవంశీయుడును నగు ఇంద్రవర్మచేత యుద్ధమునందు నిహతుడైనట్లు కందరాళపుర పృథ్వీమూలుని గోదావరి తామ్రశాసనమువల్ల నూహింపదగి యున్నది. తరువాత విష్ణుకుండుల యధికారము గోదావరి కుత్తరమున సాగిన చిహ్నము లేవియు గానరావు. రణదుర్జయ, విక్రమేంద్రుల యనంతరము పృథ్వీమహారాజు స్వామిద్రోహియై స్వాతంత్ర్యము వహించెనని యూహింపవచ్చును. పిష్టపురమున నితడు రాజ్యము సేయుచుండగా నష్టమైన విష్ణుకుండుల దొరతనమును కళింగమున మరల ప్రతిష్ఠించుటకు మూడవ మాధవవర్మ ప్రయత్నము సల్పెనని యాతని యాంధ్రసాహిత్య పరిషచ్ఛాసనములోని 'ప్రాగ్దిగ్గిరీశయాత్రస్థితః గోదావరీ మతీతరన్' అను వాక్యమువల్ల నూహింపవచ్చును.

ప్రతిగ్రహీత:— ఈ దానమును ప్రతిగ్రహించినవాడు కొణ్డమఞ్చి గ్రామనివాసియగు భవశర్మయను బ్రాహ్మణుడు. ఇతడు కామకాయనసగోత్రోద్భవుడగు ఛందోగసబ్రహ్మచారి. చక్కగ వేదములు వేదాఙ్గములు శాస్త్రములు చదివినవాడు; అనేకములు యజ్ఞములను సల్పెను; 'త్రిసహస్ర విద్య'ను నేర్చెను; ఇరువది గ్రంథములకు వ్యాఖ్యానములను రచించెను.

ఇతని తండ్రియు, తాతయు చక్కని శ్రోత్రియులు. తండ్రి పృథ్వీశర్మ. ఇతడెల్లప్పుడును యజ్ఞములు సేయుచు, దక్షిణల నిచ్చి బ్రాహ్మణులను తృప్తిపరచుచుండెడివాడు. మరియును 'త్రిసహస్ర విద్యాధ్యయన ప్రవచన వ్యాఖ్యాన'ములయందు నేర్పరి. తాతయగు విష్ణుశర్మ శ్రుతిస్మృతులను తుదముట్ట నెఱింగినవాడు; అగ్నిష్టోమాదిక్రియలచేత పరిశుద్ధము సేయబడిన యాత్మగలవాడు.

ఈశాసనములోని ప్రతిగ్రహీతయొక్క వంశవర్ణనవల్ల క్రీ. శ. ౭-వ శతాబ్దమున బ్రాహ్మణులు అభ్యసించుచున్న విద్యాదికము కొంతవఱకు దెలియుచున్నది. వారు వేదములు, వేదాఙ్గములే గాక షడ్దర్శనములు

గూడ పఠించుచు శిష్యులకు నేర్పుచుండిరి. షడ్దర్శనములయందలి న్యాయోపనిషద్యోగము లీశాసనమునందు జేర్కొనబడియున్నవి. ప్రతిగ్రహీతయును, అతని తండ్రియు 'త్రిసహస్రవిద్య' నభ్యసించినట్లు వ్రాసియున్నది. 'త్రిసహస్రవిద్య' ఇదియని గుర్తింప వీలులేదు. పండితులు తలకొక యర్థమును దెల్పిరి. అందేదియు సరియైనదను నమ్మకము వారికే కలుగలేదు. భావిపరిశోధనవల్ల నిది యేదైనదియు దెలియవలసియున్నది. మఱియును అప్పటి బ్రాహ్మణులు యజ్ఞములను తరచుగ చేయుచు వైదికకర్మలయందు కాలమును గడపుచుండువారు.

స్థలనిర్దేశము:— ఈశాసనమున కొన్ని యూళ్లును పట్టణములును జేర్కొనబడినవి. అందు ముఖ్యమైనది పిష్టపురము. పిష్టపురము ఇప్పటి తూర్పుగోదావరిజిల్లాలోని పిఠాపురమని యందరెఱుగుదురు. దానమొసగబడిన తాండివాడ గ్రామము పాగుణారవిషయమునందు చేరియుండెను. మొదట పాగుణారవిషయ మెచ్చట నుండెనో కనుగొనవలసియున్నది. పూర్వచాళుక్యరాజుల శాసనములయందు కొన్నిటియందీపాగుణార విషయప్రస్తావము కలదు. చాళుక్యభీమన్నపాలుని శాసనములయం దొకదానియందు పాగుణవరవిషయములోని దిగుంబల్లు గ్రామమును దానముచేసినట్లు వ్రాయబడియున్నది.[1]

మఱియు విష్ణువర్ధనమహారాజుశాసనములలో నొకదానియందు పగుణవారవిషయములోని పెర్మశిలి గ్రామము దానమొసగినట్లు వ్రాయబడియున్నది.[2] ఈశాసనములందు నచింపబడిన పగుణవరము, పాగుణారము, పాగుణవరమును ఒక్క గ్రామముయొక్క పేర్లని తలంచెదను. ఈగ్రామ మెచ్చటనుండెనో చెప్పుటకు వీలుగాదు. కాని పగుణార విషయములోని వన్న గ్రామములలో నెక్కువగ ఇప్పటి ప. గోదావరిజిల్లా నర్సాపురం తాలూకాలో నగపడుచున్నవి. దిగుంబల్లును ఇప్పుడు దిగుమఱ్ఱు అనుచున్నారు. పెర్మశిలికి ఇప్పటి పేరు పెనుమంచిలి. కావున పాగుణార విషయమిప్పటి నర్సాపురం తాలూకాను దాని పరిసరములకును సరిపోవును. ఇక, ప్రస్తుతశాసనమునందు జేర్కొనబడిన కొండమంచి, తాండివాడగ్రామములు నర్సాపురం తాలూకా హద్దులలో గాని తత్ప్రాంతసీమయందు గాని గాన్పించునేమో విచారించవలసియున్నది. కొండమంచియే ఇప్పటి నర్సాపురం తాలూకాలోని కొండమంచి యనుటకు సందేహింపబనిలేదు. కాని తాండివాడ యెచ్చటనుండెనో చెప్పుటకు సాధ్యము గాదు. తణుకుతాలూకాలో తాడిపఱ్ఱు, తామరాడ అను గ్రామములు రెండగుపడుచున్నవి. శాసనోక్తమగు తాండవాడ గ్రామమునకును వీనికిని నేమేనియు సంబంధ ముండిన నుండవచ్చును.

1. I. A, XIII, p. 213.
2. M. E. R 1913 14 cp 6.

# మూ ల ము :

## మొ ద టి రే కు

1 స్వస్తి[౧][॥*]శ్రీమత్త్రిపురా త్సకలజగదనససముద్భూతకీర్తి
2 చారుచన్ద్రికాసముద్యోతితదిగన్తరస్య మ
3 హారాజరణదుర్జయస్య సూనో స్సమతి
4 శయితశక్రవిభూతే ర్విక్రమేన్ద్రస్య ప్రియతనయ [ః*]

## రెండవ రేకు : మొదటి ప్రక్క

1 ప్రవర్ధమానప్రతాపోపనతసమస్తసామన్తమణ్డలనిజ
2 భుజవిజయోదయాధిగతయశోవిశేషభూషణః శ్రీరమ
3 కాశ్యపసగోత్రః పరమబ్రహ్మణ్యో మాతాపితృపా
4 దానుధ్యాతః శ్రీపృథివీమహారాజః పాగుణారవిషయే గ్రామే తా
5 నాడగ్రామ మధివసత సర్వానసమవేతా న్కుటుమ్బిన స్సమాజ్ఞాప

## రెండవ రేకు : రెండవ ప్రక్క

1 యతి యథా శ్రుతిస్మృతిపారదృశ్వనః యథావదనుష్ఠితాగ్నిష్టో
2 మాదిక్రియాపూతాత్మనో విష్ణుశర్మణః పుత్రాయ అసకృదజ్యా
3 ప్రయోగప్రరాయమాణ ద్రవిణసూచితత్విక్కస్య
4 దస్యసమృద్ధేః త్రిసహస్రవిద్యాధ్యయనప్రవచనవ్యాఖ్యా[న]
5 శీలినః పృథివీశర్మణః పుత్రాయ వేదవే[దాఙ్గన్యాయోప]

---

౧. 'స్వస్తి' అనుపదము 3-వ పంక్తికి ఎదుట ఎడమప్రక్క 'నాగానాంగాం' చెక్కబడియున్నది. ౨. 'ఖ్యాత' అని చదువవలయును. ౩. 'పృథివీ' అని. ౪. 'ష' యొక్క కొమ్మును తలకట్టును కలుపు అస్పష్టముగ నున్నది. ౫. 'వసత స్సర్వాన్' అని. ౬. 'కుటుమ్బిన' అని. ౭. 'స్సమాజ్ఞాప' అని. ౮. 'స్మృతి' అని చదువవలయును. ౯. 'ష్ట' అని. ౧౦. 'ప్రతాయమాన' అని దిద్దుకొనవలయును. ౧౧. 'ఋ'కారమునకు బదులు 'ర' స్పష్టముగ చెక్కబడియున్నది. ౧౨. మొదట 'ప' ను సుడికారావళ్లతో చెక్కి తరువాత కారావళిని తప్పుగా దిద్దినారు.

మూడవ రేకు : మొదటి ప్రక్క

1 నిషద్యోగావబోధనిర్మ్మలీకృతబుద్ధయే వివిధాధ్వరావభృథా
2 మ్భఃపవిత్రీకృతవిగ్రహాయ దేవపితృమనుష్యసమర్చ్చన
3 సమానీతరాత్రిన్దివాయ కొణ్డమఞ్చిగ్రామనివాసినే
4 త్రిసహస్రవిద్యాయ వింశతివ్యాఖ్యానాయ కామకాయనస
5 గోత్రాయ ఛన్దోగసబ్రహ్మచారిణే భవశర్మ్మణే అస్మదాయు

మూడవ రేకు : రెండవ ప్రక్క

1 రారోగ్య[2]య[3]శోభివృద్ధయే సర్వ్వకరపరిహారేణాగ్రహారీ
2 కృత్య గ్రామోయన్దత్తః [|*] నకైశ్చిదపి బాధాకరణీయా [|*] ప్ర
3 [వ*]ర్ద్ధమానవిజయరాజ్యసంవత్సరే షట్చత్వారింశే
4 కార్త్తికపౌర్ణ్ణమాస్యాన్ధర్మ్మప్రదానమేతత్ [|*] ఆజ్ఞప్తి[ః*] శ్రీరామ
5 లన్నురాజః [|*] అత్ర వ్యాసగీతాశ్లోకాః [||*] బహుభి ర్వ్వసుధా దత్తా

---

౧. 'గాఢబోధ' అని చదువవలయును. ౨. 'రారోగ్య' అని చదువవలయును. ౩. 'య' కొమ్ముగను గాని తలకట్టిచ్చియున్నది.



# మదరాసు సేవాసదనము




౧. నృత్యమునేర్చిన బాలికలు




౨. గానమునేర్చిన బాలికలు

# నక్షత్రమండలము

గొబ్బూరు వేంకటానంద రాఘవ రావు

(యువసంవత్సర భాద్రపద-ఆశ్వయుజమాసములు)

ఉత్తరము




దక్షిణము

[ఈపటమును ఆయాదిక్కులు సరిగా నుండునట్లు తలమీదుగా పెట్టి చూడవలెను. ఇందున్నట్లు నక్షత్రాదులు
సెప్టెంబరు 8 తేదీని రాత్రి 8-52 గంటలకును, సెప్టెంబరు 15 తేదీని రాత్రి 8-25 గంటలకును
,, 22 ,, ,, 7-57 ,, ,, 30 ,, ,, 7-26 ,, } కనబడును.]
అక్టోబరు 7 ,, ,, 6-58 ,,

"The spacious firmament on high,
With all the blue-ethered sky
And spangled heavens, a shining frame,
Their great original proclaim.
The unwearied sun from day to day
Does his Creator's power display;
And publishes to every land
The work of an Almighty Hand.
Soon as the evening shades prevail
The moon takes up the wondrous tale
And nightly to the listening earth
Repeats the story of her birth;
Whilst all the stars that round her burn,
And all the planets in their turn
Confirm the tidings as they roll,
And spread the truth from pole to pole.
What though, in solemn silence, all
Move round the dark terrestrial ball?
What though, no real voice, nor sound
Amid their radiant orbs be found?
In Reason's ear they all rejoice
And utter forth a glorious voice;
For ever singing as they shine
The Hand that made us is Divine"

—Addison.

మనభూమండలమునకు ఊర్ధ్వదిశయందు విశాలమై, నీలసుందరమై, విశ్వవ్యాప్తమైన ఆకాశరంగము అద్భుతతేజోవిశేషములచే నొప్పుచు, తనను సృజించిన భగవంతుని నోర్చి చాటి చెప్పుచున్నది. సూర్యుడు విసుగు, వేసట లేక, తన జన్మకు కారకుడైయున్న సర్వశక్తుని నిర్మాణచాతుర్యమును దేశదేశముల ప్రకాశింప జేయుచున్నాడు. సాయంకాలము నీడలు విస్తరించి చీకటిపడగానే, చంద్రుడు తనచుట్టును నక్షత్రకోట్లు మెరయుచుండగా, మహాద్భుతమగు సృష్టికథనంతయు గొని, శ్రద్ధతో నాలకించు భూమికి ప్రతిరాత్రియు తన జన్మవృత్తాంతమును చెప్పుచున్నాడు. కుజ, గురు మొదలగు గ్రహాదులు ఆకాశరంగమున సంచారము సల్పుచు, ధ్రువమునుండి ధ్రువమువరకు ఆవార్త వినిపించి స్థిరపరచుచున్నవి. "శ్యామసుందరమైన మన భూమండలము చుట్టును ఈ గ్రహనక్షత్రములు ప్రకాశించుచు నిశ్శబ్దముగా ప్రదక్షిణము చేయుచున్నట్లున్నది కాని, అవి చెప్పుచున్న కథలు, చేయుచున్న ప్రకటనలు, కావించు గానములు ఎవ్వరికిని వినపడవేమి? వాని కంఠస్వర మేరికిని కర్ణగోచరము కాదేమి అని శంకచేయగూడదు? వివేకము, విచారశక్తి కల జిజ్ఞాసువులు ఆ దివ్యశబ్దజాలము వినగలరు. కాని ఇతరులకంతగా ఆపలుకులు వినబడవు. "అనన్యశ్రద్ధాభావముతో విశ్వకర్తయే నిర్మించినాడు మమ్ము" అని మహనీయమంగళగాత్రముతో నెలుగెత్తిపాడుచు ప్రకాశించు భూగోళతారల దివ్యగీతములు బ్రహ్మజిజ్ఞాసువుల చెవుల పండువు చేయుచున్నవి.

ఈ సెప్టెంబరు ౧౦ వ తేదీనుండి అక్టోబరు ౧౦ వ తేదివరకును రాత్రి తొలిజామున మన కగపడు నక్షత్రాది ఖగోళతారల నరయుదము.

### పాలవెల్లి (The Milky Way)

ఆకాశమునందు పాలవెల్లి ఈశాన్యదిగ్భాగము నుండి నైరృతిదిక్కువరకు ఖగోళమున కడ్డముగా వ్యాపించియున్నది. అయ్యది ఈశాన్యమున భృగుపరశు, అప్సరస, పురూరవసు, రాజహంస, ధనిష్ఠ, శ్రవణ, ధను, వృశ్చికముల మీదుగా నైరృతిదిక్కున నగ్నివేదికవరకు నడల్పుగల నవారుపట్టీవలె ధవళధవళమై వ్యాపించి వేడ్కగొల్పుచున్నది. రాజహంసమండలముకడ శ్యా౧, శ్యా౨ అనుగుర్తులుగల శ్యామసీమలు ఇప్పుడు స్పష్టముగా కనబడుచున్నవి. రెండవశ్యామసీమకడ నీ ధవళ ప్రకాశము రెండు పాయలుగా చీలి దక్షిణముగా వ్యాపించి, నైరృతిదిక్కున అగ్నివేదికముందు ఈ పాయలు మరల కలిసిపోవుచున్నవి. ఈ పాయలమధ్య నున్న పెద్దశ్యామసీమయే ఛాయాపథము.

## మిక్కిలి తేజోవంతములైన నక్షత్రములు

## (First Magnitude Stars)

ఇప్పు డీనక్షత్రములు ఐదుమాత్రమే కనబడు చున్నవి. అవేవి యనగా:— (౧) పడమట త్వరలో అస్తమింపనున్న స్వాతి (Arcturus), (౨) క్షీరగాని నంటి పశ్చిమముగా నున్న వీణామండలములోని బ్రహ్మ (Vega), (3) క్షీరవాహిని తూర్పు పాయ నంటియున్న గరుడమండలములోని శ్రవణము (Altair in Aquila), (౪) వృశ్చికరాశిలోని జ్యేష్ఠ (Antares), ౫. ఆగ్నేయమున బాగుగా ఉదయించిన ఇంద్రద్యుమ్నుడు (Fomalhaut-ఫోమల్‌హో).

తేజోవంతము లయిన నక్షత్రము లింత స్వల్పముగా నున్న లోపమును గ్రహములు కొంతవఱకు భర్తీ చేయుచున్నవి.




మకర కుంభ రాశులు

### గ్రహములు

ఇంతవఱకు పశ్చిమమున నఖండతేజముతో నలుగుచు ఈగ్రహనక్షత్రాదులకు పడమటి దానితీయు చున్నదో యనునట్లుంచిన శుక్రుడు కానరామిచే పడమటిదిశ కొంత చిన్నబోయినట్లున్నది. గురుడు బుధు మార్గవర్తియై విశాఖలోనే ఉన్నాడు. శుక్ర లోపము కొంతవఱకు గురునిచే తీరుచున్నది. ఈమాసములో వృశ్చికరాశిలో సంచారము చేయుచున్నా గురునిదాటి తూర్పునకు వచ్చినాడు. జ్యేష్ఠనుకూడ దాటినట్లే పటములో న ప్పుడగ కాలిన ఉక్కుగుండువలె మెఱయు కుజగ్రహము పగడమునంటి జ్యేష్ఠాసమీపమున నున్నపుడు దృశ్యము మనోజ్ఞముగా నున్నది. అక్టోబరు మొదటి వారములో కుజుడు జ్యేష్ఠ 3 వ పాదమున నుండును. శని శతభిష నక్షత్రసమీపమున నున్నాడు. కాబట్టి అక్టోబరు నడుటివారమునాటికి పడమటనుండి వరుసగా గురుడు, జ్యేష్ఠ, కుజుడు, శని వరుసగా, రమ్యముగా నగపడును. ఈవెలుగులవరుసకు ఉత్తరమున స్వాతి, బ్రహ్మ, శ్రవణ నక్షత్రములును, ఆగ్నేయమున ఇంద్రద్యుమ్నుడును సొంపుగూర్చుచున్నారు.




మదరాసు సేవాసదనము 3. అల్లిక, నేతపనులు నేర్చుకొనుచున్న బాలికలు



డా. డి. గురుమూర్తిగారు యం.ఏ., పిహెచ్. డి.

మదనపల్లి కళాశాల ఉపాధ్యాయులు. వీరికి మదరాసు విశ్వవిద్యాలయము పిహెచ్. డి. (Ph D.) బిరుదము నొసగెను.



సి. అబ్దుల్ హకీంగారు

మదరాసు వర్తక ప్రముఖులు. అరాబిక్ విశ్వవిద్యాలయమునకు ౨౦ లక్షల రూపాయిలు ఇచ్చుటకు వాగ్దానము చేసిరి

## నిశీథ ప్రకృతి

మల్లవరపు విశ్వేశ్వరరావు

ఎదురుపడని ఓరుగాలి
పాదపపత్రముల నొరసి
ఏదియో యున్మాదమురళి
నూదుకొనెడి తనకొరకే!

నిశ్శబ్దము-నిశీథమ్ము
నిల్చిన లోకపు సందడి
కన్ను దొరని కాగుతమసు
కదలాడని సుప్తప్రకృతి!

నాజాగ్రజ్జీవ మొకటె
నట్టాడెడి నటకేటకో
చిక్కువడిన స్మృతివీథుల
చివుగుతలపు లేవాపులన!

ఏలలితామోదభరిత
చేలాంచలమో విసరెడి
నాహృదయము నంటియంటి
నాపరువిడుతలపులంటి!

కలగందే కాంచిన దో
కామిత సౌందర్యాంబువో
దరహాసాలోకముతో
విరియించెడి హృత్సుమమ్ము!

మొరసెడి మారుతమురళీ
పరవశము నిశీథప్రకృతి
ఊహల చలియించు వలపు
లపహరించె నా ప్రశాంతి!

## చేమంతి

పు. పంచా అప్పలస్వామి

ఏనిలింపవాటికనుండి ఎగసివడెనో
ఒక్క హేమంతరజనీవియోగివేళ
కనకమ్ముదూహాసముల కలకలని విరిసె
మాగృహప్రాంగణాన చేమంతిపూవు.

ఏపురాతనబాంధవ్య మేమొ కాని
అది చలించిన నాహృదయము చలించు,
అది కదలేని నాలోని నిదురగొనిన
తలపులే నేత్రములు విచ్చి కలువరించు,
అది హిమావృతమైన నాఅంతరంగ
మార్గతమసావృతమ్మగు-అప్పుడు నిప్పుడు
పిలుచు నది నన్ను మూగపాటల రచించి,
ఏను శయనించువేళ నెవ్వో నవీన
వాసనల నిమ్మ కలతస్వప్నాలు రేపు.

ఇది ప్రసూనమ్ము కా దెదో స్వప్నకుమారి
నను వలచి నాగృహద్వారమున నె విరిసె
ఏయుగాల వియోగమో? ఎంత వగపో?
నా విషాదవిహ్వలమైన జీవితమ్ము
మరల వికసించునే, పరిమళము లెగసి
మ్రోయునే నేడు మరల నా పూలవంతి?

# శ్రీకనుపర్తి మార్కండేయశర్మగారి అస్తమయము

కడచిన 13 వ తేదినాడు శర్మగారు పక్షవాతముచే నాక్రమింపబడి గుంటూరున నస్తమించిరన్న వార్త 15 వ తేది ప్రాంతములందు విన్నప్పుడు నమ్మిక కలుగలేదు. నీలివార్త కాబోలుననుకొని పత్రికలవారు సయితము పూని ప్రకటింప సాహసింపక పోయిరి. మరునాడు మరియొక మిత్రునికి గుంటూరునుండి వచ్చిన లేఖమూలమున సత్యము తెలియవచ్చుననుక సందేహముతోనే యుండిపోతిమి. ఎదురు చూడని, ఆకస్మికమయిన యీ మరణమునకు తహతహ పడితిమి. దానికి ముందెన్నో కాదు, కొలదినాళ్లకు ముందే వారు భారతీకార్యాలయమునకు వచ్చినప్పుడు ఆరోగ్య భంగ సూచనలు కూడవారియందుపొడకట్టలేదు. చివర కదే చరమదర్శనమైనది. జెప్రకాదు, వైక్షణము, మనది కాదు కాబోలు !



శ్రీకనుపర్తి మార్కండేయశర్మగారు

శర్మగారి నెరుగని యాంధ్రుడుండడు. వారి సౌహార్దము, సౌజన్యము, తితిక్ష సకలహృదయములను ఆవర్జించుకొన్నది. ఈగుణములు వారి ముఖమున అచ్చముగ ప్రతిబింబించెడివి. వారి కార్యదీక్ష వారిన్ని దేశమంతట త్రిప్పి పలువురికి వారిపరిచితి కలుగజేసినది.

శర్మగారిది గుంటూరుజిల్లా. కాని చిరకాలముగ మద్రాసునందే కాపురమును నడపుచుండిరి. జన్మభూమి బలముకాబోలు, వారి తుదిదినములు జన్మభూమియందే కడచిపోయినవి. తీర అర్థశత వత్సరములైన కాలేదు. శర్మగారికి నూరేండ్లు నిండినవి. 'శతేపంచాశత్' న్యాయమనగా నిదియే కాబోలు !

శర్మగారు వైదికకర్మనిరతులు. సంస్కృతాంధ్రములయందు గట్టిపండితులు. సంస్కృతమునందనర్గళముగమాటలాడ నేర్చినవారు. వీరిలక్ష్యము సనాతన మతోద్ధరణము. పరోపదేశపాండిత్యము కాక నిత్యనైమిత్తికకర్మలను తామనుష్ఠించుచు,ఇతరులచే ననుష్ఠింపజేయుదలంపు గలవారు. సనాతన మతోద్ధరణమునకై వీరు కావించుచుండిన పరిశ్రమ యపారము. శారదా శాసనములులోనికి రానుండిన సందర్భమందు వీరు పడినపాట్లు దేవుని కెరుక. గ్రామైకరాత్రముగ వీరు సలిపిన ప్రబోధనలు పలువురను మేల్కొల్పినవి. వీరి యీ సనాతనమతోద్ధరణోద్యమమున 'స్వధర్మప్రకాశిని' వీరికెంతో సాయపడుచుండినది. వారు స్వధర్మప్రకాశినికి, స్వధర్మప్రకాశిని వారికిని పరస్పరము అండగా నుండినది. ఆశ్రయనాశమైనది. ఇక స్వధర్మప్రకాశినిగతి యేమవునో! కొన్నాళ్లపాటు వీరు నియోగిపత్రికను సాధనచేసిరి. అది కారణాంతరములవలన ఆగిపోయినను స్వధర్మప్రకాశిని మాత్రము అడ్డంకులులేక నడచుచుండినది. దానికి నీపాటు !

ఉపనిషదాదివైదికవాఙ్మయమున చాలభాగమును వీరు తెలిగించిరి. ఎన్నో మతవిషయకము

లయిన గ్రంథములను రచించిరి. అనేక వైదిక రచనలకు టీకాతాత్పర్యములను గూర్చిరి. వైదిక, మతవిషయకరచనలయందే కాదు, చరిత్రరచనల యందును, జ్యోతిషయౌగికరచనలయందును గూడ వీరి కాసక్తి యెక్కువ. కొన్నిచరిత్ర, జ్యోతిష, యౌగికరచనలుకూడ వీరివికలవు. భారతిమొదలైనపత్రికలకు వీరు తరచు వ్యాసములను వ్రాయుచుండెడివారు. ఈ సంచికలోగూడ వారిదొక వ్యాసము ప్రకటింపబడినది. సర్వతోముఖమయిన వీరి విజ్ఞానము ఆంధ్రులకు ఇట్లు సుపరిచితమయినది.

శర్మగారికి వయస్సు మళ్లి యుండినదేకాని ముదిమి మైకొనలేదు. కార్యనిర్వహణపటిమ లోపించలేదు. దీక్ష వెనుదొలఁగలేదు. నిరంతరము వ్యాసంగము, నిరంతరము కార్యయాత్రలు! ఎల్లప్పుడును వారిచేత పుస్తకములే! వారికార్యదీక్ష, వారిపరిశోధనపరాయణత అట్టివి. అన్నిటికిని గత ద్వాదశాహస్సునాడు పరిసమాప్తి.

'కాలోహి దురతిక్రమః'

శర్మగారి యాత్మకు శాంతియు, వారి బందుగుల హృదయములకుపశాంతియు నబ్బునుగాత!

ఆచార్య



శ్రీ కుమారి ఫిరోజి ఆనందకరు బి. ఏ., బి. డి. (బొంబాయి)

ఈమె భారతమహిళామండలివారి విద్యార్థివేతనమును పొంది ఉన్నతవిద్యకయి యింగ్లాండునకు పోయెను.

# కీ. శే. అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

జటావల్లభుల పురుషోత్తము

పాండిత్య ప్రకర్షములో నేమి, విమర్శనాకౌశలములో నేమి, భాషాసేవలో నేమి, కవిత్వములో నేమి, వక్తృత్వములో నేమి, యధ్యాపకత్వములో నేమి, సౌశీల్యములో నేమి శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారితో పోల్పదగినవా రాంధ్రులలో కొలది మందియే కలరు. పండితులలోను, విద్యాభిమానులలోను వారి నెఱుగనివారు లేరనియే చెప్పవలెను. ఇట్టి పండితవర్యులు ఆగష్టు ౧౫వ తేదీన నేబదియేండ్లయినను నిండకుండగనే, యస్తమించుట యాంధ్రుల దురదృష్టము. స్వగృహమున మరణించుటకో యన [illegible] రెండు మాసముల క్రిందట ననారోగ్యకారణముచే నాంధ్రగీర్వాణ విద్యాపీఠములో నొక సంవత్సరము సెలవుతీసికొని బాపట్ల చేరికొనిరి. ఆ సెలవే కడసారి సెలవగునని యెవ్వరము నప్పు డూహింపలేకుంటిమి.



అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

## కుటుంబవిషయము

శ్రీ శాస్త్రిగారు బాపట్లతాలూకాలోని ఇటికంపాడులో జనించిరి. సమీపజ్ఞాతులగు భారద్వాజ సగోత్రులగు రామయ్యగారు వీరితండ్రి; మహాలక్ష్మమ్మగారు వీరితల్లి. చెంచయ్యగారికి దత్తులైరి. దత్తతతల్లి పేరు లక్ష్మీదేవమ్మగారు. కాని వీరు పుత్రహీనులుగనే మరణించుట మిక్కిలి విచారహేతువు. వీరికుమార్తెమూలముననైనను వీరి భౌతికదేహాంశ మాచంద్రార్కముగ నుండగలదని యూహింపవచ్చును. వీరి యల్లుడు మహారాజశ్రీ కొలచిన సుబ్బావధాని ఎం. ఏ., బి. యిడి. గారు ప్రస్తుతము బందరు శ్రీరామాహైస్కూలులో నుపాధ్యాయులుగ నున్నారు. చిన్నవయస్సుననే శ్రీ శాస్త్రిగారికి ప్రథమభార్యావియోగము గల్గినది. అది వారిజీవితములో గొప్పపరివర్తనమునకు హేతువైనది. శ్రీ శాస్త్రిగారు నివృత్తిమార్గానుసారులైరి. ఆదినములలో బాపట్లలో నుండిన శ్రీ బ్రహ్మానందసరస్వతీస్వాములవారి శిష్యులై సన్న్యాసాశ్రమ ప్రవేశోన్ముఖులయిరి. అంతలో దత్తతతల్లిగారు శ్రీస్వాములవారికి చేసికొనిన విన్నపములకు ఫలితముగ శ్రీ శాస్త్రిగారు తిరిగి వివాహము చేసికొనిరి. శ్రీ శాస్త్రిగారిమరణమునకు శాశ్వతదుఃఖము ననుభవించుటకు వారిభార్యయు, దత్తతతల్లియు నున్నారు.

## విద్యాభ్యాసము—పాండిత్యము

సంస్కృతాంధ్ర సాహిత్యములలోను, వేదాంతశాస్త్రములలోను శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారి కీడనువారు మిక్కిలి యరుదు. వీరి సాహిత్యము తర్కవ్యాకరణాది శాస్త్రజ్ఞానముతో గూడి యలరారుచుండెను. జ్యోతిషాది శాస్త్రములలోగూడ వీరికి చక్కని పాండిత్యముండెను. వీరు ధర్మశాస్త్రములను సవిమర్శముగ పరిశీలించిరి. ఎట్టి ధర్మసందేహములనైనను చక్కగ తీర్చుచుండిరి. వీరి పాండిత్యము బహుశాఖావంత మగుటచే వీరి గురువులుగూడ ననేకులు గలరు. అందు ముగ్గురు సుప్రసిద్ధులు. శతావధాని చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారియొద్ద శ్రీ శాస్త్రిగారు సిద్ధాంతకౌముది చదివిరి. తెనుగులోగూడ వీరే శ్రీ శాస్త్రిగారికి గురువులు. వీరియందు శ్రీ శాస్త్రిగారి కపారమగు భక్తియుండెను. శ్రీ వెంకటశాస్త్రిగారు శాస్త్రిగారి మరణానంతరము కొవ్వూరులో వారిని గూర్చి మాట్లాడుచు వారు తమయొద్ద చదువుకొని యున్నను వారిని శిష్యులుగ కాక గురువుగనే భావించుచుంటి మని చెప్పిరి. శ్రీ శాస్త్రిగారి మఱొక గురువులు

అవధానిశిరోమణి శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు. వీరి యొద్ద శ్రీ శాస్త్రిగారు తర్కప్రకరణములను జదివిరి. శ్రీ శాస్త్రిగారి మూడవ ప్రసిద్ధగురువర్యులు శ్రీ కల్యాణానంద భారతీస్వాములవారు. శ్రీ వారియొద్ద శాస్త్రిగారు ప్రస్థానత్రయము జదివిరి. వీరు కాక శ్రీ బంపె మూండి సుగునాథశాస్త్రిగారు మున్నగువా రనేకులు శ్రీ శాస్త్రిగారికి విద్యాభిక్షను పెట్టిరి. శ్రీ శాస్త్రిగారి యొద్ది పాండిత్యమునకు దగిన విమర్శనాకౌశలముగూడ నుండెను. వీరు భారతి మున్నగు పత్రికలకు వ్రాయుచుండిన వ్యాసములును, కావ్యనాటకాది పరిశీలనములును నిందులకు సాక్ష్యములు. వారివ్యాసములలో కేవలము శాస్త్రవిషయకపాండిత్యమే కాక యసాధారణ మగు హేతువాదమై ప్రజ్ఞయుకూడ వ్యక్తమగుచుండెను.

## రచనలు

శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగా రాంధ్రభాషాభిమానము కల్పించిన యనర్ఘ్యాలంకారము లెన్నియో కలవు. ఆంధ్రకావ్యాదర్శము, ఆంధ్రధ్వని, కావ్యనాటకాది పరిశీలనము, శివతత్త్వసుధానిధి, జీవన్ముక్తివివేకము, ... బంధము మున్నగుకృతులు పండితాదరమును, జనాదరమును బొందినవి. వీ రీనడుమ రచించిన 'ఆలోకము' ముద్రితమగుచున్నది. అది యాంధ్రావళికి మిక్కిలి యుపకరింపగలదు. వీరి గ్రంథములలో విశేషమేమన నవి యన్నియు మహత్తరములగు విషయములను గూర్చి వ్రాయబడినవే. మఱియు నవి శ్రీ శాస్త్రిగారి వంటి యసామాన్యపాండితీసంపన్నులచే వ్రాయబడదగినవే కాని సామాన్య కవులకు వారికి సాధ్యము లగునవి కావు. శ్రీ శాస్త్రిగారి యముద్రితగ్రంథము లెన్నియో కలవు. వాని వివరముల నెఱుంగగోరువారు వారి యల్లుడగు శ్రీ సుబ్బావధానిగారికి తెలియును.

## ఆశుకవిత్వము

ప్రథమమున అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగా రాంధ్రులకు శతావధానులుగనే తెలియబడిరి. ఒకపుడు వీరు వివిధప్రాంతములలో నవధానములను సాగించి తమ యశశ్చంద్రిక నాంధ్రదేశమునం దంతటను వెదజల్లిరి. వీరివలె సంస్కృతాంధ్రములలో వేగముగ కవిత్వము చెప్పగలవారు మరెవ్వరును లేరు. ఒకప్పుడు వీరు తిరుపతి వేంకటకవులకంటెను వేగముగ కవిత చెప్పుటకు ప్రసిద్ధులైన కొప్పరపు కవుల నాశుధారలో నోడించి తమ గురువులకు కీర్తి తెచ్చిరి. అపు డానందపరవశులైన వారి గురువులు "అవ్వారి సుబ్బనా శిష్యమానవమణీ" యను మకుటము గల పద్యములతో వారి నభినందించిరి.

## వక్తృత్వము

శ్రీ శాస్త్రిగారు మిక్కిలి మనోరంజకముగ మాటలాడు వక్తలు. ఈప్రాంతములలో మహాసభలలో మాటలాడుటకు వారి నాహ్వానించుచుండెడివారు. పదములకొఱకుగాని, యభిప్రాయములకొఱకుగాని వారెన్నడును తడవుకొనవలసినక్కర లేకుండెను. సక్రమముగ త్రిప్పకొనకుండ చాలకాలము మాటలాడుట వీరికి పరిపాటి. సంస్కృతములో వీరివలె వేగముగ మాటలాడువా రాంధ్రులలో లేరని వాకుక. వీ రనేకసభలలో సంస్కృతమున మాటలాడియుండిరి. ఆంధ్రగీర్వాణ విద్యాపీఠములో సంస్కృత సాహిత్యగ్రంథములను బోధించునపుడు వీరు సంస్కృతముననే యుపన్యసించుచుండిరి.

## అధ్యాపకత్వము

సుమారు నిరువదిసంవత్సరములు శ్రీ శాస్త్రిగా రుపాధ్యాయవృత్తిలో నుండి వందలకొలది శిష్యులను సంపాదించిరి. తెనాలి సంస్కృత కళాశాలలోను, బందరు హిందూహైస్కూలులోను, బాపట్ల సంస్కృతపాఠశాలలోను, కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠములోను వీరు పనిచేసిరి. వీ రాంధ్రగీర్వాణ విద్యాపీఠములో నుండిరను హేతువుచేతనే యిటకు వచ్చుచుండిన విద్యార్థు లనేకు లుండిరి. కడచిన పదిసంవత్సరములలోను నీవిద్యాపీఠ మభివృద్ధిలో నుండుటకు వారిచట నుండుటయే ముఖ్యహేతువు. వారీనడుమ నొక సంవత్సరము సెలవుతీసికొనుటచే విద్యాపీఠమున కెట్టి నష్టము వచ్చినదో పాఠకు లెఱుంగుదురు. వీరు సంస్కృతాంధ్రసాహిత్య గ్రంథములను జెప్పుటలో నెంత



# ఆంధ్రాభ్యుదయము

## డాక్టరు వి. యస్. శర్మగారు (Ph. D.)

శ్రీ డాక్టరు వి. యస్. శర్మగారు గుంటూరు జిల్లా ఒంగోలు వాస్తవ్యులు; సుప్రసిద్ధ పండితులు, జ్యోతిష్కులు నగు శ్రీ ముక్తినూతులపాటి గోపాలకృష్ణయ్యగారి అన్నకుమారులు. వి. యస్. అరండేలు గారి ప్రియశిష్యులు. ఆయనగారు జాతీయ విశ్వవిద్యాలయమునందు పట్టభద్రులై, అందే ఎనిమిది సంవత్సరము లుపన్యాసకులుగ నుండిరి. ఈ సమయముననే అంతర్జాతీయ నవీనవిద్యాసమితి (International new Educational fellowship) కి భారతీయ కార్యదర్శిగా ఎన్నుకొనబడి యూరపుఖండమందలి విద్యాపరిస్థితులను తెలిసికొనుటకు ౧౯౨౯–వ సంవత్సరమున ఇంగ్లాండునకు వెళ్లిరి. అచ్చటనుండి మరుసంవత్సరము జర్మనీ కేగి సుప్రసిద్ధ అంతర్జాతీయ విద్యాసంస్థయగు ఓడెన్ వాల్డు స్కూలు (Odenwalde school) లో భారతీయ విజ్ఞాన వేదాంతాధ్యాపకులుగ నుండిరి. తరువాత విద్యా వేదాంత శాస్త్రములలో పరిశోధనచేయుటకు హిండెన్‌బర్గు విశ్వవిద్యాలయమును (Hindenburgh University) న చేరిరి. తమ యభిమానశాస్త్రములను విద్యావేదాంతములు గాక యూరోపియన్ కళాచరిత్రము ప్రత్యేకపర్యవేక్షణలో India's contribution to the Science of education అనియు Indian Ideals and aims in sculpture అనియు రెండు గ్రంథములు వ్రాసిరి. ౧౯౩౫ సం.రం జనవరిలో హిండెన్‌బర్గు విశ్వవిద్యాలయమువారు వీరికి మొదటి తరగతిలో పి హెచ్. డి. (Ph. D.) డిగ్రీ నిచ్చి గౌరవించిరి. ప్రస్తుతము వీరు ప్రత్యేకాహ్వానముపై జర్మనీ, ఇటలీ నగరములలో హిందూమత విజ్ఞానమును గూర్చి యుపన్యసించుచున్నారు. మున్ముందు చీనా విశ్వవిద్యాలయమునం దధ్యాపకులుగనుండ నాహ్వానింపబడిరి.



డాక్టరు వి. యస్. శర్మగారు

శ్రీ శర్మగారు సుప్రసిద్ధసంస్కర్తలు. కేవలము స్వయంకృషివలననే ఉన్నతపదవికి వచ్చిరి. వీరిజీవితము ఆంధ్రుల ప్రతిష్ఠాగౌరవముల నినుమడింప జేయుచున్న దనిన నతిశయోక్తి కానేరదు. భగవంతుడు వీరి కాయు రారోగ్యైశ్వర్యములను ప్రసాదించుగాక!

# భారతీయ మహిళా మండలి



శ్రీమతి కుమారి యఫ్. కోటిలింగం

బళ్లారి వార్డ్లా హైస్కూలు ప్రిన్సిపాలు జె. పి. కోటిలింగంగారికుమార్తె. మైసూరు విద్యాశాఖయందు పనిచేయుచున్న యీమె లండనులో సాంఘిక విజ్ఞానము(Social science)ను ప్రత్యేకముగ అధ్యయనము చేసివచ్చెను.



శ్రీ డా. ఇ. కె. జానకమ్మాళ్

ఈనెల [illegible] [illegible] ప్రపంచ వృక్షశాస్త్ర మహాసభకు ఇండియా ప్రతినిధిగా పోయెను.



శ్రీ కుమారి సాదవ

ఉపాధ్యాయశిక్షణమును పొందుటకొరకు ఇంగ్లాండుకు పోయెను.

# ఆంధ్రనాట్యకళాపరిషత్తువారి నాటక బహూకృతి

## 1935 సం. సెప్టెంబరునెల 30 తేది వరకు గడువు హెచ్చింపబడుట

ఆంధ్రనాట్యకళాపరిషత్తు పక్షమున కార్యదర్శులగువారు సంయుక్తముగా ఈక్రింది ప్రకటన చేయుచున్నారు:—

౧౯౩౪ సం డిసెంబరు మాసమున చెన్న నగరమునందు జరిగిన చతుర్థాంధ్ర నాటకకళా పరిషత్తునందు నాటకరచనకై వేయిరూప్యముల బహుమాన మొసంగుటకు తీర్మానింపబడినది. ౧౯౩౫ సం. ఆగస్టు నెలాఖరులోపున నదగు తీర్మానమునందు సూచింపబడిన విధముగా గ్రంథకర్తలు తమతమ గ్రంథములను పరిషత్కార్యదర్శులకు పంపవలెనని ఇదివరలో వార్తాపత్రికలందును, ప్రత్యేకముగను ప్రకటింపబడియుండెను.

ఆతీర్మానము ననుసరించి ఇప్పటికి 3౭ నాటకములు పరిషత్కార్యాలయమునకు చేరినవి. ఈనెల 3౦ వ తేదితో నాటకముల పంపు గడువు ముగియనున్నదని వ్రాసియుండెను. కాని, వివిధమండలములనుండియును అనేకులు ఈ గడువును మరొక్క నెలవరకేని హెచ్చింపవలసినదనియు, గ్రంథకర్తలు పెక్కుమంది తమతమ రచనల నంపుటకు కుతూహలించుచున్నారనియు, బహూకృతికి సంబంధించిన ప్రకటనను మొదటనే గమనించనివారు కొందరుండుటచే అట్టివారందరకును కొంత సావకాశ మొసంగుడని పరిషత్తువారిని కోరుచు వ్రాసియున్నారు. ఆంధ్రాదిపత్రికలయందును కొందరీయభిప్రాయమును వెల్లడించియున్నారు.

సామాన్యనిబంధనలలో ఒకమారు నిర్ణయింపబడిన కాలపరిమితిని మరల, మరల మార్చుట అంతటి సమంజసకార్యము కాకున్నను, అనేకు లీవిషయమై వ్రాసియుండుటను బట్టి వారికి ఉత్సాహభంగము కలుగకుండుటకై గ్రంథకర్తలయొక్క కోరిక ననుసరించి ఈగడువును మరొకమాసము, అనగా ౧౯౩౫ సెప్టెంబరు 3౦ వ తేది వరకు మాత్రమే హెచ్చించుటకు నిర్ణయించితిమి. ఎట్టిపరిస్థితులందును ఆ తేదిని మించి గడువు హెచ్చింపబడజాలదు.

"ఒక గాధ

తాడి నాగమ్మ



౧

ఆదినము లభించినది. అప్పటి కింకను గాంధి ఇర్విన్ సంధి కుదరలేదు. భారతజాతి అగ్నిపరీక్షయందున్నది. శాసనోల్లంఘన వాయువులు తీవ్రరూపమున ఆసేతుహిమాచల పర్యంతము వీచుచున్నవి. విదేశవస్తు బహిష్కరణము విరివిగ కొనసాగుచున్నది. స్వదేశదీక్షావ్రతములు సక్రమముగ నెరవేరుచున్నవి. అందరును అసహాయోద్యమము నందు పాల్గొనుచున్నారు. తల్లి తనకుమార్తె నాశీర్వదించి శాంతి సమరమునకు బంపుచున్నది. తండ్రి కొడుకును దీవించి అసహాయోద్యమమునకు నాహుతి యొసంగుచున్నాడు. ముదుసలి మనుమని పురికొల్పి శాసనోల్లంఘనమునకు పంపుచున్నది. అత్త కోడలి నుత్సాహపరిచి సమరమున కురికించుచున్నది. మామ అల్లునికి ధైర్యముచెప్పి బహిష్కరణాస్త్రము ప్రయోగించు బంటుగ బంపుచున్నాడు. భర్త భార్యకు బుద్ధిచెప్పి భారతస్వాతంత్ర్యయుద్ధమునకు నామెను బలి యొసగుచున్నాడు. భార్య భర్తకు నీతినేర్పి దాస్యశృంఖలములను త్రెంపు వీరునిగ యుద్ధమునకు బంపుచున్నది. భారతజాతిత్యాగ సహానములను జూచి ప్రపంచము దిగ్భ్రమ జెందినది.

"జగ మొక విచిత్ర నాటకరంగము. అందు భారతజాతి యొక వింతపాత్రను ధరించినది. యుగయుగములనుండియు దాస్యము ననుభవించుచున్నది. మానవకోటియందు మతములపై మతము లుద్భవించి ప్రకాశించినవి; నశించినవి. ప్రపంచపుపునాదులను సడలించు సాంఘిక విప్లవము లెన్నియో పుట్టినవి; గిట్టినవి. కాని భారతజాతి వానినంటియు నంటనట్లు, ముట్టియు ముట్టనట్లు కాలప్రవాహమున దేలిపోవుచున్నది. మానవసంఘములకు నూతనోత్తేజమునొసంగు మహావిప్లవము ఫరాసుసామ్రాజ్యమునందు పుట్టి శతాబ్దములతరబడి త్రిశంకుస్వర్గము ననుభవించిన చండశాసనులైన రాచమూకల యొక్క వేడిరక్తము వెల్లువలై వీథులయందు ప్రవహించుగాక! సకల చరాచరములందు సహజముగ ప్రవహించు స్వేచ్ఛావిద్యుద్వాహినీశక్తిని సంపాదించుకొనుటకై అమెరికా సంయుక్తరాష్ట్రములు రణభేరి మ్రోగించుగాక! కోటీశ్వరుల గుండెలు పగులునట్లు సర్వమానవులు సమముగ సుఖించు సామ్యవాద సాంఘికవిప్లవము రష్యాయందు పుట్టి మానవమండలియొక్క పునాదులను గదల్చుగాక! వానిని గుఱించి భారతజాతి కిసుమంతయు బట్టదు. భావోద్రేకము కలుగదు.

చలింపదు. టర్కీ ప్రజాస్వామికమునందు కెమల్‌పాషా ప్రాధాన్యమువహించి స్త్రీలకు స్వాతంత్ర్యమిచ్చిన భారతజాతికి బలికినదేమి? జపానుచే చైనాయందు 'మంచుకూ' రాష్ట్రము కల్పింపబడిన భారతజాతికి పోయిన దేమి ? అమెరికనులనుండి ఫిలిప్పైను దీవులు స్వాతంత్ర్యము సంపాదించిన భారతజాతికి కలిగినదేమి? జర్మనీయందు హిట్లరుచే యూదులు వేటాడబడిన భారతజాతికి నష్ట మేమి? భారతజాతిదృష్టిలో హిట్లరు "నాజీ" సిద్ధాంతములు నాస్తికములు. ముస్సొలోని యొక్క "ఫేసిజము" తత్వము పనికిమాలి నది. లెనిన్‌యొక్క "సామ్యవాద" సూత్రము అసాధ్యమైనది. రూసోయొక్క "మానవ హక్కులు" కలలోని వార్తలు—నిర్జీవజాతి. కర్మసన్యాసము మెండు. క్రియాశూన్యత నిండు. చలనములేదు. భావము శూన్యము. ఉద్రేకము సున్న. యుగయుగముల నుండియు జాతి క్రుళ్లిక్రుళ్లి క్రుంగుచున్నది. క్రియాశూన్యమైన ఉపన్యాసములు, కర్మ శూన్యమైన వేదాంతములు భారతజాతి సొమ్ములు. ప్రపంచవాసులకు భారతదేశము Ethnological Museum. ప్రపంచపటము నుండి భారత దేశ స్వరూపమును తుడిచిపెట్టు టయే మంచిది. నిర్వీర్యమైనట్టియు, నిర్జీవమై నట్టియు నీజాతి పృథ్వీతలముపై నున్ననేమి, ఊడిన నేమి?" పశ్చిమ సారస్వతములను గ్రోలిన మేధావుల యూహా లివి. ఇట్టి జాతియం దుద్భవించిన కౌపీనవస్త్రధారియొకడుసూర్యా స్తమయము గాని మహాసామ్రాజ్య చక్ర ములను త్రిప్పుచున్న రాజకీయధురంధరులు దిగ్భ్రమ జెందునటులు అరువదివేలమందిని యుద్ధరంగమునకు పంపగలిగెను.

## 3

కోట్లకొలది రూప్యముల విలువగల విదేశవస్తు సముదాయములు బొంబాయి నగరమునందు విక్రయములేక పడియున్నవి. విదేశవస్తు బహిష్కరణాస్త్రము వాయువేగ మున భారతావనిని చుట్టివచ్చుచున్నది. విదేశవస్తు క్రయవిక్రయదారులు దిగులొం దిరి. ఉత్పత్తిదారులు భయమొందిరి. కార్మి కులు వెరగొందిరి. పాలకులు దిగ్భ్రమజెం దిరి. మాంచెస్టరునందు మిల్లులు మూయ బడెను. లాంకషైరు కర్మాగారముల తలు పులు వేయబడెను. బొంబాయి కొట్లులకు తాళములు వేయబడెను. కాంగ్రెస్సునింది తుల నోళ్లు బంధింపబడెను.

కాని, పట్టణ మొకటి కలదు. అందలి వాస్తవ్యుల వాంఛలు వేరు. వారికి బహి ష్కరణమనిన తలనొప్పి. విదేశ మనిన వింత వెఱ్ఱి. స్వదేశమనిన సకిలింపు. ఖాదీయనిన కసరింపు. ఇంగ్లాండనిన ఇకిలింపు. ఒరులు చెప్పినది వినరు. పరులు చూపినది కనరు. వారికి తట్టదు. ఎదుటివారు చెప్పినది కిట్టదు. దేశమేమైనను వారికి పట్టదు. విదేశవస్తు బహిష్కారోద్యమము ఆపట్టణమందు కొన సాగించుటకై వాలంటీరుదళములపై దళ

ములు వెళ్లినవి. వెళ్లినదారినే తిరిగివచ్చినవి. శాంతిసైన్యములు విశ్రాంతిలేకుండగ పని చేసినను ఫలితము శూన్యమైనది. పరిభవములు, పరిహాసములుమాత్రము పెరిగినవి. విదేశవస్తు విక్రయము ఆపట్టణమునందు మాత్రము విరివిగ కొనసాగుచున్నది.

౪

ప్రపంచ చారిత్రమునందు జగన్మాతలైన స్త్రీలు చేసిన మహోత్కృష్టకార్యము లెన్నియో గలవు. తన్ను శోధింపవచ్చిన త్రిమూర్తులను సాధించి బాలురగచేసి యాడింపగలిగినది అనసూయ. విధినిర్ణయమును ధిక్కరించి యముని బారినుండి భర్తను బ్రతికించుకొనగలిగినది సతీ సావిత్రి. రాక్షస సామ్రాజ్యమునందుండియు, త్రిమూర్తులను వెక్కిరించిన రావణుని తిరస్కరించియు పాతివ్రత్యము కాపాడుకొనగలిగినది లోకమాత సీత. నిండుసభయందు వలువలు విప్పబడినను మానమును రక్షించుకొనగలిగినది ద్రౌపది. రసపుత్ర యోధయూధములతో సహా చిత్తూరురాజ్యము నాశనమైనను గౌరవమును దక్కించుకొనగలిగినది పద్మిని. అబలయయ్యు సబలులైన శాత్రవ సైన్యములను చీకాకుపరిచి చీల్చి చెండాడగలిగినది ఝాన్సీ లక్ష్మీభాయి. స్త్రీయయ్యు తంత్రములపై కుతంత్రములను పన్ని పల్నాటి మేటి వీరుడైన మంత్రి బ్రహ్మనాయుని మంత్రమును భేదించి తన దర్పమును ప్రకటింపగలిగినది నాయకురాలు. విజయోత్సాహములతో పరానురాజ్యమును కబళింప చనుదెంచు ఆంగ్ల సైన్యములను దునుమాడగలిగినది జోన్ ఆఫ్ ఆర్కు కన్య. ఏ మానవుడును సాహసించి చేయజాలనట్టి ప్రయాణమును దంపెట్టి విమానముపై ఈ భూగోళమును చుట్టి రాగలిగినది మిస్ ఆమీ జాన్సన్.

అఖిల ప్రపంచ రాజకీయ తంత్ర కుతంత్ర మహామంత్రములకు జీనీవా పట్టణము పేరుపడిన రంగము. అందు అఖిల ప్రపంచ మహిళా సమావేశము జరిగినది పెక్కు జాతులవా రందు పాల్గొనిరి. భారత స్త్రీలును పాల్గొనిరి. మహాసభ జయప్రదముగ జరిగినది. పలువురు స్త్రీజనోద్యమముల గురించి ఉపన్యసించిరి. ప్రస్తుత ప్రపంచ పరిణామము నవలోకించుచు తమకు వలయు తీర్మానముల గావించుకొనిరి. వెంటనే ఆయా జాతి స్త్రీలు నిర్ణయింపబడిన ప్రత్యేక స్థలములందు చేరి తమతమ జాతీయగీతములను బాడుచు వారి వారి జాతీయపతాకములకు వందనములు చేయసాగిరి. భారతనారీమణులును ఒక ప్రత్యేక స్థలమునందు చేరిరి. కాని, వారికి జాతీయపతాక మెద్ది? అఖిల ప్రపంచము నెదుట ఆంగ్లేయ పతాకమునకు నమస్కరించిన భారతజాతికి వ్యక్తిత్వ ముండునా? తల వంపులు గాదా? వారి కిసుమంతదూరమున నె ఆంగ్లస్త్రీలు తమ పతాకము నెగురవేసి గీతములను పాడుచున్నారు. భారతస్త్రీ లేమి చేయగలరు? వారి కేమి తెరవు గలదు? అందుకై నియమింపబడిన ఐదునిమిషముల కుమ




య ము గతించు చున్నది. అబల లేమి చేయ గలరు? ఖద్దరుచీర గట్టిన యొక నారీలలామ తన పైటచెరగును చింపి బల్లపై నెక్కి భారతజాతీయపతాకముగ నెగుర వేసి జాతీయగీతమును పాడసాగెను. తక్కినవారు చుట్టును జేరి గీతమును పాడుచు ఆ పతాకమునకు నమస్కరించి అఖిల ప్రపంచము నెదుట, మానవసంఘమునందు భారతజాతికి వ్యక్తిత్వముగల స్థాన మేర్పరుప గలిగినారని వినుటతోడనే యే భారతీయుని దేహము పులకరించదు?

పదునెనిమిదేండ్ల యువతి. మానవసంఘమునం దొక యుచితస్థానము సంపాదింప శాంతిసమరము సాగించుచున్న భారతమాతపుత్రికారత్నము. తన శక్తికొలది విదేశవస్తు బహిష్కారోద్యమమునందు

'నిన్ను బ్రతిమాలుచున్నాను.

పాల్గొనుచున్నది. ఏయేస్థలములందు బహిష్కరణాస్త్రము పనిచేయుట లేదో ఆయాస్థలములకెల్ల వెళ్లి దేదీప్యమానముగ తనపనిని కొనసాగించుచున్నది.

ఆపట్టణమునందు బహిష్కరణాస్త్రము పనిచేయుటలేదని యామెకు దెలియవచ్చెను. తానాపనిని కొనసాగించెదనని ఆమె బయలుదేరెను. ఆపట్టణము కుబేరుల కునికిపట్టు. విలాసపురుషుల కాటపట్టు. పొగరుబోతులపుట్ట. జారచోరులకు నిలయము. అన్యాయముల కాలయము. కాబట్టి, వెళ్లవలదని బంధువులు భయపెట్టిరి. స్నేహితులు వారించిరి. అందరును బ్రతిమాలిరి. ఆమె వానిని వినలేదు వెంటనే ప్రయాణమై ఆపట్టణమునందున్న శాంతిశిబిరమునందు చేరెను. ఆశిబిరవాసులు తమకుతమకు జరిగిన పరాభవము

విదేశవస్త్రములు కొనవలదు.'

లను వినిపించిరి. వెళ్లవలదని చెప్పిరి. మరు నటి దినమున తాను తప్పక బహిష్కారణాస్త్రము ప్రయోగించెదనని యామె పట్టు బట్టెను. ఆంధ్రదేశమునం దన్నిప్రాంతముల బహిష్కారోద్యమము జయప్రదముగ కొనసాగించిన యొకకన్య ఆపట్టణమున కేతెంచిన దనియు, మరుదినమె యామెనిని కొనసాగించు ననియు నగరవాసులు మూలమూలలయందు మూకమూకలుజేరి చెప్పుకొనసాగిరి. జరుగు చిత్రవిచిత్రములను జూచుటకు వస్తువిక్రయ శాలల చుట్టును జనులు గుంపుగుంపులుగ చేరిరి. ఆమె వారికి విదేశవస్తుబహిష్కారము గురించియు, స్వదేశవస్తు ప్రోత్సాహము గురించియు వివరించి చెప్పసాగెను. ఇంతలో ఫోర్డుమోటారు నెక్కి, ఇంగ్లీషుసూటుతో, పరాసుహేటుతో, బెల్జియమ్బూటుతో, వియన్నాసులోచనములతో, నార్వేబూట్సులతో, అమెరికన్ క్రాపుతో, ఫ్రెంచి కటింగుతో, జర్మనుతైలములతో, స్వీడన్ చేతిబెత్తముతో, వర్జీనియా సిగరెట్టుతో, కాకినాడ కారపు కిల్లీ నములుచు, పాశ్చాత్యపు టక్కుటిక్కులను ప్రదర్శించుచు, అభినవ వయ్యారములను వెలిబుచ్చుచు నవనాగరకత అంతయు తనముఖముపైననే తాండవమాడుచున్నట్లు భ్రమించుచు ఒకయువకుడు విదేశవస్త్రములను గొనుట కేతెంచెను. ఆమె యాతని జూచి "అయ్యా! తిన తిండియు, కట్ట బట్టయు, ఉండ ఉనికియు లేక మలమల మాడుచున్న కోట్లకొలది భారతీయులపేర నిన్ను బ్రతి మాలుచున్నాను. విదేశవస్త్రములు కొనవలదు. ఇందునిమిత్తమై యేటేట అరువది కోట్ల రూపాయలు పరదేశముల కెగుమతి యగుచున్నవి. ఇట్లే కొంతకాలము జరిగిన యెడల భారతీయు లందరు 'భిక్షాం దేహి' యనెడి స్థితికి రాగలరు......" అని యేమేమియో చెప్పసాగెను. ఆధనమదాంధుడు ఆమె నాపాదమస్తకముగ నవలోకించెను. కనుబొమలు చిట్లించెను. పెదవి విరిచెను. నిండు జవ్వరాలు. కథలయందును, కావ్యములందును చెప్పబడినవా రీమెకు సరిరారు. ఖద్దరుచీర ఆమెసౌందర్యమునకు మరింత వన్నె దెచ్చెను. అందును ఉత్సాహపూరితమై యున్నది గాన ఆమెముఖము జ్యోతివలె ప్రకాశింపసాగెను. ఆయువకుడు ఆమె నట్లే తేరిచూచిచూచి ఇట్లనెను:

"నీవు చెప్పు మాటలు వింటిని. నాస్థితి యిది. నా యిల్లంతయు విదేశవస్తుమయము. నా మోటారు విదేశవస్తువు. నావస్త్రములు విదేశవస్తువులు. నాతలనిండ విదేశభావములు. నాకడుపునిండ విదేశఫలహారములు. నా యూపిరితిత్తులనిండ విదేశపు సిగరెట్ల పొగ. పెండ్లికై వేయిరూప్యములతో వస్త్రములను కొనుటకు వచ్చితిని. నిన్నొక విషయమడిగెదను. అందుకు నీ వంగీకరించిన నేటితో స్వదేశదీక్ష నవలంబించెదను. ఒక ముద్దు నిచ్చెదవా?"

చుట్టునున్నవారు భయాశ్చర్యసంభ్రమములతో నిశ్చేష్టులై నిలుచుండిరి. ఏమి

జరుగునో? ఆమె ఏమి చెప్పునో? ఒక నిమిషమైనది. రెండైనది. అంత నాభారత పుత్రికా రత్నము ద్విగుణోత్సాహముతో నిట్లనెను:

"నాకిరువురు అన్నలు గలరు. అను దినము నన్ను ముద్దిడుకొని ఆశీర్వదించి శాంతిసమరమునకు పంపుచున్నారు. యుగ యుగములనుండియు అనసూయ, సీత, సావిత్రి, పద్మిని, రాణీసంయుక్త మొదలగు పతివ్రతామణులకు నిలయమైన యీ భారత మాత పుత్రికనైయుండియు, తరతరముల నుండి దాస్యమనుభవించుచు తద్విముక్తికై శాంతిసమర మొనర్చుచున్న భారతసైన్యము నందు వీరవనితనైయుండియు, విదేశవస్తువు లనెడి హాలాహలమునకు నాహుతియగు చున్న నీబోటి సోదరుని రక్షింప నొక ముద్దియ లేనా? నీవు నామూడవ తోబుట్టువు. అన్నా! రమ్ము రా! ఒకటిగాదు. నలయునన్ని గొనుము."

ధనమదాంధుడు బొయ్యబారెను. ఎగయూపిరి లేదు. దిగయూపిరి అంతకంటెను లేదు. ఒడలు వణకెను. దేహము కంపించెను. తల తిరిగెను. కనుచూపు తగ్గెను. కాళ్ల పటుత్వము తప్పెను. ముచ్చెమటలు గ్రమ్మెను. "ప్రాణములు గ్రొప్పుడిప్పె, మూర్ఛవచ్చె."



K. M. R.

# అఖిలభారతపత్రికారచయితృ మహాసభ - కలకత్తా

## తీర్మానములు

ఈ ఆగస్టు ౧౬ వ తేదీని కలకత్తాలో సి. వై. చింతామణిగారి అధ్యక్షతను సమావేశమైన అఖిలభారత పత్రికారచయితల మహాసభయందు జేయబడిన ముఖ్య తీర్మానములు:

౧. ౧౯౩౧ సం.రము ప్రెస్ ఎమర్జెన్సీపవర్సు ఆక్టుచేత చేర్చబడియున్న ౧౯౩౨ సం.రపు క్రిమినల్ లా అమెండుమెంటుఆక్టును గవర్నమెంటువారు ఇంకను సజీవముగ నుండునట్లు చేయ దృఢసంకల్పులై యున్నారని తెలియవచ్చుచున్నందున ఈ మహాసభ వారికి చాలభయము గలుగుచున్నది. పైని తెలుపబడిన రెండు చట్టములును, సంస్థానముల రక్షణ చట్టము, బెంగాల్ క్రిమినల్ లాసవరణచట్టము, ఈ నాలుగును పత్రికాస్వాతంత్ర్యమునకు నిరోధకములై యున్నవి. స్వతంత్రాభిప్రాయములను తెల్పనిచ్చుటలేదు. కావున వాని నిక సజీవముగ నుండనివ్వరాదు. ప్రెస్సు ఆక్టును ఏరూపురేఖలతోనైనను పునరుజ్జీవింపజేయుటకు ప్రయత్నములు జరుగునెడల అసెంబ్లీయందుండు సభ్యులెల్లరును వానిని ఎదిరించవలెనని యీ మహాసభవారు కోరుచున్నారు. అధికారులు వారి యిష్టానుసారముగ వార్తలను కత్తిరించుచుండుటచేతను, సెంసార్ పనులవల్ల పత్రికాస్వాతంత్ర్యమునకే ముప్పు కలుగుచుండుటచేతను వెంటనే సెంసార్ పదవిని ఎత్తివేయవలసినదని యీమహాసభవారు కోరుచున్నారు.

౨. నిర్భయముగను, నిరాటంకముగను అభిప్రాయములను తెలుపుట మానవ హక్కులలో నొకటి యగుటచేత దానిని తమ సంస్థానములలో నుత్తరింపవలసినదని యీమహాసభవారు సంస్థానాధిపతులను వేడుకొనుచున్నారు.

౩. ఇండియాకు ప్రతికూలముగ విదేశములందు చేయబడుచున్న ప్రచారమునకు ఈసభవారు తమ అత్యధిక అసహ్యతను రికార్డు చేయుచున్నారు. ఆప్రతికూల ప్రచారమును అరికట్టి, భారత యథార్థపరిస్థితులను విదేశములందు బాగుగ తెలియజేయుటకై యేర్పాటు చేయుటకు ఈసభవారు నిశ్చయించుచున్నారు.

౪. ప్రభుత్వపుపత్రికలకును, ప్రభుత్వానుకూలములైన పత్రికలకును ప్రకటనలను పట్టుటకు గవర్నమెంటువారు ఇతర వార్తాపత్రికలతో పోటీచేయుచున్నారు. ఇందులకై యీ సభవారు అసంతృప్తిని తెలుపుచున్నారు. పోటీ అలవాట్లను రద్దుపరచుడని కోరుచున్నారు.

౫. అచ్చులపై హెచ్చుసుంకములు విధింపబడుచుండుటచేత పత్రికావ్యాపకమునకే గాక విద్యావ్యాపకమునకుగూడ అడ్డుతగులుచున్నది. ఆసుంకమును తొలగించవలెనని యీసభవారు కోరుచున్నారు.

# అఖిలభారత పత్రికారచయితృ మహాసభ, కలకత్తా

(౧౭, ౧౮-౮-౧౯౩౭.)



ఆహ్వానసంఘాధ్యక్షుడు
శ్రీ మృణాళకాంతబోసు



అధ్యక్షుడు
శ్రీ సి. వై. చింతామణి




ప్రారంభకులు
రామానందఛటర్జి

# తంజావూరు చిత్రములు

శ్రీముఖ సం. జ్యేష్ఠమాస సంచికయందు మొదలిడి క్రమముగ నీసంచికయందు వఱకు ప్రకటిత మగుచువచ్చిన చాంద్రమాన మాసములయు, తిథులయు రూపచిత్రముల వివరణము లా చిత్రములయం దుండిన మహారాష్ట్రభాషాత్మక పద్యరచనముల ననుసరించి యీక్రింద నొసగబడెను. ఈ సంచిక యందు ప్రకటిత మయిన అమావాస్య చిత్రముతో చిత్రసంచయము పరిసమాప్త మయినది. ఇందు కృష్ణ ద్వాదశి యొకటి మాత్రము లభించినది కాదు. ఈ చిత్రముల చరిత్ర, వాని రచనావిశిష్టత ఆ శ్రీముఖ జ్యేష్ఠసంచికయందే కలదు. ఈ వివరణాదులను మహారాష్ట్రభాషనుండి తెనుగుభాషలోనికి దెచ్చుటకు శ్రీ చిదిరె మఠపు వీరభద్రశర్మ శాస్త్రిగారు మిక్కిలిగా తోడ్పడిరి. వారికి కృతజ్ఞతాపూర్వకవందనములు. —సం. భారతి.

చైత్రము:—ఊర్ధ్వకాయము శుక్లము, అధఃకాయము కృష్ణము; ఇది శుక్లకృష్ణపక్ష సూచకము. ఎఱుపు కలిసిన పసుపువన్నె వస్త్రము; ఉజ్జ్వలమగు కిరీటము; చేతుల యందు చంద్రసూర్యులు శంఖచక్రములు; సమీపమున నది. వికసితకుసుమ సంతానములు లతాగుల్మాదులు; శుకపికాలంపరం

అధిదేవత : విష్ణువు, గౌరవర్ణుడు, కనక చేలుడు, చతుర్భుజుడు, శంఖచక్రగదాపద్మ ధారి.

వైశాఖము :—నీలమేఘశ్యామల వర్ణము; పద్మాలంకృతహస్తము; మయూర పింఛావతంసము; కుసుంభవర్ణ వస్త్రము; సూర్యచంద్రులు, గదాశార్ఙ్గములు, వ్యజన పాత్రములు, పికపత్రఫలములు హస్తముల నున్నవి; పుష్పఫల సమృద్ధములగు వృక్ష లతాదులు; శుకపిక సంతతులు; వధువు గౌరవర్ణ; పీతాంబరాలంకృత.

అధిదేవత : మధుసూదనుడు, రమా యుక్తుడు, అరవిందభవి, శంఖచక్రగదాపద్మ ధరుడు.

జ్యేష్ఠము : — రక్తగౌరము వర్ణము; కన్నులు మూడు; భుజములు ఆఱు; వ్యాఘ్రము వాహనము; యజ్ఞోపవీతధారి; ఆలవట్టము, గొడుగు, సూర్యుడు, చంద్రుడు, పాత్రము, వ్యజనము ఆఱుచేతులను దాల్చినాడు; పాదములందు చడావు లున్నవి; దోవతి ఎగయుచుండ నృత్యము చేయును; ఎండ, గాలి అధికము; పుష్పసమృద్ధికలదు; సేద్యమునకు ప్రారంభము; కృష్ణహంసములు, శుకపికాదులు గలవు.

అధిదేవత : త్రివిక్రముడు, రక్తవర్ణుడు, శ్వేతవసనుడు, శంఖచక్రగదాపద్మధారి.

శుక్లప్రతిపత్తు :—మేషవాహన, రక్త వర్ణ, అరుణాంబర, శక్తిపాత్రధారిణి. అధిదేవత అగ్ని.

శుక్లద్వితీయ :—హంసవాహన, ధవళ వర్ణ, సితవసనాలంకృత, పుస్తకపాత్రధారిణి. అధిదేవత బ్రహ్మ.

శుక్లతృతీయ :—వృషభవాహన, గౌర వర్ణ, సితవసనాలంకృత, శూలపాత్రధారిణి. అధిదేవత అంబిక.

శుక్లచతుర్థి :—మూషకవాహన, నీలో త్పలదళవర్ణ, పీతవస్త్రధారిణి, పరిసు అహి హస్త. అధిదేవత గణాధిపతి.

శుక్లపంచమి :—కమలాసనాసీన, కుం కుమవర్ణ, శ్వేతవసన, ఫణిఫణాలంకృత శిరస్క, శంఖభాజనధారిణి. అధిదేవత ఆది శేషుడు.

శుక్లషష్ఠి :—మయూరవాహన, రక్త వర్ణ, ధవళాంబరాలంకృత, కుక్కుటపాత్ర ధారిణి. అధిదేవత కుమారస్వామి.

శుక్లసప్తమి :—అశ్వవాహన, తామ్ర వర్ణ శరీర, శ్వేతవసన, అబ్జపాత్రధారిణి. అధిదేవత రవి.

శుక్లాష్టమి :—వృషభవాహనారూఢ, శరధవళాంగ, పీతవసన, ఘంటాపాత్ర ధారిణి. అధిదేవత శివుడు.

శుక్లనవమి :—సింహవాహన, గౌ రాంగ, పాత్రపాశధారిణి; అధిదేవత వసువు.

శుక్లదశమి :—మహిషవాహన, కృష్ణ వర్ణ, దండపాత్రధారిణి. అధిదేవత లుదగ్గ జములు.

శుక్లైకాదశి :—జంబుకవాహన, సింహ వదన, రక్తవర్ణ, కస్తూరి, త్రాసు ధరించినది. అధిదేవత యముడు.

శుక్లద్వాదశి:—గరుడవాహనారూఢ, మేఘవర్ణ, చక్రపాత్రధారిణి, అధిదేవత హరి.

శుక్లత్రయోదశి:—మకరవాహన, గౌర వర్ణ, ధనుర్బాణపాణి. అధిదేవత మన్మథుడు.

శుక్లచతుర్దశి :—అరవిందాసన, 'గులాబి' కుసుమవర్ణ, నీలకంఠి, అరక్తేంద్రగోపసమ నయన, చిత్రవసనాలంకృత, మద్యమాంస పాత్రధారిణి. అధిదేవత కలి.

పూర్ణిమ:—ధవళశశవాహన, గౌరాంగి వర్ణ, ముక్తాభరణాలంకృత, శుభ్రవసనావృత, బాలిక, అమృతకలశపాణి, సౌందర్యవతి. అధిదేవత చంద్రుడు.

కృష్ణప్రతిపత్తు:—పురుషుడు మదనుడు. ధూసరగౌరశుభాంగి, చతుర్భుజ, సుందరి, యువతి, శ్వేతవసన, పుస్తకపాత్ర, స్రువ-అక్షమాలాధారిణి, విశ్వనాథ, మదనాంక సమాసీన

కృష్ణద్వితీయ:—వృషభారూఢ, కుముద వర్ణ, కుంకుమరుద్రాక్షమాలాధారిణి.

కృష్ణతృతీయ :— గరుడవాహన, నీల వర్ణ, శంఖపాత్రధారిణి.

కృష్ణచతుర్థి :— కజ్జలవర్ణ, మహిష వాహన, చతుర్భుజ, పాశ పాత్ర దండ అక్ష మాలాధారిణి.

కృష్ణపంచమి:—మకరవాహన, చంద్ర గౌరవర్ణ, పాత్రాక్షమాలాధారిణి.

కృష్ణషష్ఠి:—మయూరవాహన, త్రిలోచన, చంద్రావతంస, నీలగళ, లోహితవర్ణ; అరుణవసన, శక్తికుక్కుటధారిణి.

కృష్ణసప్తమి :—గజవాహ, గౌరాంగ, వజ్రపాత్రధారిణి.

కృష్ణాష్టమి :—ప్రేతాసన, ధవళవసన, నీలకంఠ, రక్తవర్ణ, చతుర్భుజ, పాత్ర అసి ఖేటక అక్షమాలాధారిణి.

కృష్ణనవమి:—వ్యాళవాహన, నీలాంగి, దంష్ట్రావతి, పాత్ర తర్జనీముద్రాధారిణి.

కృష్ణదశమి :—సింహాసనస్థ, గౌరవర్ణ, పీతవస్త్ర, కుండలాలంకృత, జ్ఞానాభయకర ముద్రాధారిణి.

కృష్ణైకాదశి :—నీలాంగి, నీలవృషభ గామిని, కంజనీలచక్రశూలధారిణి.

కృష్ణద్వాదశి :—(అప్రకటితము)

కృష్ణత్రయోదశి :—ఖట్వారూఢ, గౌరవర్ణ, యౌవనమదాలస, హీరకవర్ణవస్త్ర సమలంకృత, షడ్భుజ, ధనుర్బాణ గదాశోకపాత్రద్వయధారిణి.

కృష్ణచతుర్దశి :—అశ్వారూఢ, నీలవర్ణ, నీలవస్త్రధారిణి, నారంగిమృగయాతుర, అసి భల్లసమలంకృతహస్త.

అమావాస్య :— కుశాసనాసీన, అతికృశాంగి, మరకతవర్ణ, కృష్ణాంబర, కుశపిండధారిణి.

# సాభిప్రాయ విశేషములు

శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.

ప్రపంచపరిణామమునందు ధర్మపరిణామము విచిత్రాధ్యాయము. ధర్మదేవత దైవయజ్ఞములందువలెను ఆసురయజ్ఞములందును ప్రత్యక్ష మగుచున్నది. భారతయుద్ధమునందు ధర్మరాజదుర్యోధనులు విజయమునకు యథావిధిగను ధర్మారాధనము చేసియుండిరి. సంకల్పాచరణములు భిన్నములైనను "యతో ధర్మ స్తతో జయః" అనెడిలోకోక్తి మాటలందు సకలారంభములందును పరిపాటియైనది. రాజకీయ మత సాంఘికార్థికాది సకలవ్యవహారములందును ధర్మసంకీర్తనమును నాయకులు, గురుపుంగవులు స్వార్థపరులయి చేయుచున్నారు. నాయకులు గురుపుంగవులు చేసెడి ధర్మసంకీర్తన ప్రకటనములు ధర్మసందేహములకు వినియోగపడినటులు సందేహ నివృత్తికి వినియోగపడకున్నవి. ఆసన్నమై యున్న అబిసీనియా ఇటలీ యుద్ధప్రచారము ప్రపంచము నావరించిన ధర్మహానికి ప్రమాణము. ఇటలీ రాజ్యాంగ నియంత ముస్సోలినీ గారును, క్రైస్తవమతగురువు పోపును చేయుచున్న ధర్మసమర్థనము పరిహాసపాత్రమై పరమానర్థములకు మూలమగుట సహజము.

* * *

## ముస్సోలినీగారి ధర్మము

ఇటలీప్రయోజనములన్నియును ముస్సోలినీ గారికి ధర్మకార్యములు. ముస్సోలినీగారికిని వారి నల్లచొక్కాల దండునకును ఫాసిజమే దైవము, ధర్మము, మతము, మోక్షము. రాజ్యతంత్రజ్ఞులకు మూలగురువైన మాకియవెల్లీగారి సిద్ధాంతములనే ముస్సోలినీ గారును సమర్థించుట సమయోచితముగ నున్నది. ధన ధాన్య సంపదలతో నిండి యున్న అబిసీనియా దేశమును జయించుట ప్రస్తుతము సులభము. కాలము గడచిన కొలదియును నీపని దుర్లభ మగుటయును, అబిసీనియా బల మభివృద్ధిని పొందుటయును, యూరపురాజ్యముల ప్రతిఘటనము బలిష్ఠమగుటయును సహజము. సామదానభేదోపాయములు సాధ్యము గానపుడు బలవంతులకు దండనోపాయము శరణ్యమగుచున్నది. దేశభక్తివ్యాజమునను ముస్సోలినీగారవలంబించుచున్న సంగ్రామ ప్రస్థానము తోడేలు మేకపిల్లకథవలె నున్నది. ఇటలీప్రజల లాభమునకు అబిసీనియా కావలెను. దేశాక్రమణమును జేయుటకు తగిన బలసంపదలున్నపుడు ధర్మమును ముస్సోలినీగారి హస్తములందు వారు విధించినటులు నడవవలసి యున్నది.

పోపుగారును శాంతిని గోరుచు ఆత్మసంరక్షణమునకు అబిసీనియాదండయాత్ర ధర్మ మని సమర్థించుచున్నారు. యూరపురాజ్యములింతవరకును నవలంబించిన రాజ్యతంత్రమునే ముస్సోలినీగా రవలంబించుచున్న సంగతి సత్యమైనను కాలపరిస్థితులు మారినవని ముస్సోలినీగారు గ్రహించుట యవసరము. దురాశాపిశాచ మావరించినపుడు ధర్మాధర్మపరిజ్ఞానము దుర్లభము. అబిసీనియా ఇటలీ సంగ్రామము జపాను రుష్యా సంగ్రామము వలెను ప్రపంచ చరిత్రయందు నూతన శకారంభమునకు సాధనమగుట దైవఘటనమై యుండును. యూరపురాజ్యముల భావి భాగ్యమునకీసంగ్రామము కీలకముగ నుండ గలదు.

ముస్సోలినీగారి రోము సామ్రాజ్య దృష్టాంతమే యూరపు రాజ్యములకును, ఇటలీ రాజ్యమునకును ధర్మోపదేశమునకు దగియున్నది. రోమను సామ్రాజ్యము నామరూపములు లేకను నశించుటయే గాకను ఇటలీదేశమును చిరకాల మధోగతిపాలు చేసినది. రోమను ప్రజానాయకుల దుర్నయములు చిరకాలము ఇటలీదుఃఖానుభవమునకు మూలమయినవి. ముస్సోలినీ సంకల్పించిన దండయాత్ర ఇటలీ యోగక్షేమములకెంతవరకు వినియోగపడునదియును కాలము నిర్ణయింపగలదు. అబిసీనియా సంగ్రామసన్నాహములను ప్రపంచమంతయును నేకగ్రీవముగను నిరసించుచున్నపుడు దండయాత్రను విరమించుట వివేకము. యూరపు రాజ్యములు చిరకాలము సంవర్ధించిన పరాక్రమణతంత్రము మూలచ్ఛేదము గానంతవరకును సంగ్రామములు సహజములు. మానవధర్మ పరిణామమునకు పరమార్థ సాధనములు యంత్రములా, మనుజులా యనెడి మహాసమస్య నిర్ణయమగుటకు సంగ్రామములు, మారణయంత్రములు సంభవములు గావలసియున్నవి. తుపాకులు, ఫిరంగులు, మరఫిరంగులు, బాంబులు, విషవాయువులు, మరణకిరణములు, విమానములు మొదలగు మారణసాధనములు నిరపరాధుల మరణమునకు వినియోగపడుట దురదృష్టము. తెల్లజాతు లీ రీతిని వారి భారమును నిర్వహించుట విచిత్రధర్మము. బుద్ధభగవానుడు, ఏసుక్రీస్తు స్థాపించిన అహింసాధర్మము హింసాపరిణామమును పొందుట ప్రళయకాలప్రభావము.

* * *

అబిసీనియా

అబిసీనియా పెక్కేండ్లనుండియును నిరాటంకముగను స్వాతంత్ర్యము ననుభవించుచున్నది. యూదులకు, క్రైస్తవులకు, మహామ్మదీయులకు కష్టకాలమునందు రక్షణము నొసంగి ప్రపంచగౌరవమునకు పాత్రమైనది ఆఫ్రికాయందు శేషించియున్న స్వతంత్ర రాజ్యమైన అబిసీనియా స్వాతంత్ర్యయుగమునందు సకల జనాదరణమునకును పాత్రముగ నున్నది. ఎతియోపియా చక్రవర్తి రాస్ టఫారి గారు సంగ్రామమును నివారించు

టకును, దేశమును సంరక్షించుటకును చేయుచున్న విశ్వ ప్రయత్నములు ప్రపం చాదరణమును బడయుచున్నవి. నానాజాతి సమితియందు సభ్యులైన రెండు దేశములును జాతిసమితినిర్ణయములను శిరసావహించుట వివేకము, ధర్మము. నల్ల నెపోలియనుగను పరి గణింపబడుచున్న రాస్టఫారిగారి నాయ కత్వముక్రిందను అబిసీనియా నోడించుట సులభకార్యము కాకపోయినను విమాన ములు, బాంబులు, టాంకులు, మరఫిరంగులు, నౌకలు, జలాంతర్గాములు గల రాజ్యమును సంగ్రామసాధనములు లేని రాజ్యము ప్రతి ఘటించుట దుర్లభము. ఇటలీ అబిసీనియా సంగ్రామము దీర్ఘసంగ్రామముగను పరిణమిం చుటయును, ఆఫ్రికామోక్షమునకును, మా నవధర్మ మోక్షమునకును వినియోగపడుట యును దైవసంకల్పమేమొ! దైవానుగ్రహ మునను ఇటలీ రాజ్యనిర్వాహకులకు జ్ఞానో దయము గలిగి శాంతి చేకూరుగాక!

* * *

కాంగ్రెసు వ్యవహారములు

గాంధిమహాత్ముడు శివప్రసాదగుప్త గారికి వ్రాసిన లేఖలు కాంగ్రెసుపక్షావలంబనులకు స్వధర్మారాధన విధానము నుపదేశించు చున్నవి. కాంగ్రెసు నిర్ణయించిన శాసనసభా విధానము నాచరించుట కాంగ్రెసు పక్షావ లంబులకు ధర్మమై యున్నది. పరధర్మారా ధనముకన్నను విగుణమైనను స్వధర్మా నుష్ఠానము శ్రేయస్కరము. కాంగ్రెసు శాసనసభాప్రవేశము నంగీకరించి పని చేయుచున్నపుడు ఆ విషయమై వాదప్రతి వాదములను జేయుటయును నిరర్థకము. మంత్రిపదవుల విషయమునను పర్యాప్తమగు చున్న వాదప్రతివాదములు కాలహరణము నకువలెను కార్యసిద్ధికి సాధనములు గాకు న్నవి. కాంగ్రెసునం దతివాదులు, మితవా దులు, సాంఘికవాదులు చేయుచున్న యాం దోళన మితరపక్షములు యాక్షేపణలకును, స్వపక్ష దౌర్బల్యమునకును వినియోగపడు చున్నది. శ్రీనివాసశాస్త్రిగారికిని, ఆరండేలు గారికిని, నితరపక్షనాయకులకును కాంగ్రెసు పక్షము నాక్షేపించుట సులభము. ఈ యాక్షేపణలను, అంతర్విభేదములను పాటింప కను, కాంగ్రెసువారందరు కలిసి కాంగ్రెసు ధర్మమును త్రికరణశుద్ధిగను పాటించుట ధర్మము. వర్తమానకాలమునందువలెను భావికాలమునందును కాంగ్రెసు సిద్ధాంతాచరణములందు మార్పులు సహజముగను గలుగగలవు. దేశకాలాను సారముగను నైమిత్తిక ధర్మములు మారినను ప్రపంచాధారమైన నిత్యధర్మము సంస్థాపన మగుచున్నది. వ్యక్తులు, సంఘము లు, కులములు, జాతులు స్వాభిమానపరా యణమైన నైమిత్తికధర్మమును నిత్యధర్మము గను ప్రకటించుటయు, నిర్బంధించుటయు ధర్మసంస్థాపనమునకు గాకను, ధర్మసందేహ నాశనములకు వినియోగపడుచున్నది. వర్త మాన సందిగ్ధసమయమునందు గురుపీఠము

లను స్థాపించుట సులభ కార్యముగ నున్నది. గురుపీఠములు, తగిన శిష్యబృందమును సులభముగను సమకూడుచున్నవి. ధర్మాధికారులుగాని గురువులు సమ్మోహపరవశులై చేసెడి ప్రసంగములు ప్రజలను సంశయముల పాలుచేసి కార్యాచరణము దుర్లభ మగుచున్నది. నాయకు లీ ప్రమాదమునుండి ప్రజలను రక్షించుట శ్రేయస్కరము. ఆంధ్ర దేశీయులం దీ యుపద్రవము విశేషము.

*　　　*　　　*

ఆంధ్రులు పక్షములు

ఆంధ్రుల కుత్సాహోద్రేకములు సహజ గుణములు. రాజకీయ, సాంఘిక, మత, సాహిత్యాది విషయములం దాంధ్రులు సంస్కరణప్రియు లని ఆంధ్రుల చరిత్ర మనంత ముఖములను వెల్లడిచేయుచున్నది. సాంఘిక సాహిత్య విషయములందువలెను రాజకీయవిషయములందును ఆంధ్రులస్వాతంత్ర్యప్రియత్వమును సంస్కరణోద్యమము, సాహిత్యనిర్మాణములు, సత్యాగ్రహప్రస్థానములు వెల్లడిచేయుచున్నవి. ఆంధ్రుల స్వాతంత్ర్య ప్రియత్వము ప్రశంసనీయమైనను సంయోగబలమునకు గాకను దుర్బలత్వమునకు వినియోగపడుట దురదృష్టము. ఆంధ్ర దేశావృతమైన స్థల భేదములు, కుల భేదములు, సంఘభేదములు, పక్ష భేదములు దేశప్రజాభ్యుదయములకు సంయోగ బల రహితములై నిరుపయోగము లగుచున్నవి. సంఘసంస్కరణమునకును, సాహిత్యవికాసమునకును ననేకసంస్థ లేర్పడి సంయుక్త కార్యాచరణమును దుర్లభము చేసిన విధమునను రాజకీయపక్షములును సంయుక్తకార్యాచరణమును దుర్లభము చేయగలవు. సకలపక్షాదర్శములును సంస్తవనీయము లైనను కార్యాచరణమునందు భేదములు సహజముగను గలుగుట ప్రకృతిధర్మము. నాయకులస్వాభిమానప్రకర్షణ మనుచరులకు సహజముగను సంక్రమించి సామాన్య ప్రజాహృదయమునందుసంక్షోభమునుగలుగ జేయుటకు సాధక మగుచున్నది. "ఆంధ్రులందు నాయకులు మెండు" అని గాంధిమహాత్ముడు చేసిన ధర్మోపదేశమును నాయకులు గ్రహించి కాంగ్రెసుపక్షబలమును రక్షించుట యవసరము. ఇటీవల విజయవాడయందు సమావేశమైన స్వరాజ్యపక్ష సమావేశము కాంగ్రెసు నాయకానుచరుల కాత్మపరీక్షను జేసికొనవలసిన యవసరమును స్ఫురింపజేయుచున్నది. కాంగ్రెసు సత్యాగ్రహమును ప్రతిషేధించి శాసనసభాప్రవేశము నామోదించినపుడు స్వరాజ్యపక్ష మంకురించి కాంగ్రెసు పక్షమునందు సంక్రమించినది. ఆంధ్రనాయకానుచరులందరును కాంగ్రెసుసామాన్యధర్మమును, ప్రజాసామాన్య ధర్మమును గ్రహించి ఆంధ్రాభ్యుదయమునకును, భారతాభ్యుదయమునకును పాటుపడుట పరమార్థధర్మము.

*　　*　　*　　*

ఆంధ్రాభ్యుదయము

ఆంధ్రాభ్యుదయము నన్ని పక్షములవారును, సీమలవారును కోరుచున్నను సందేహములు, ప్రత్యేక లాభములు కార్యసిద్ధికి ప్రతిబంధకములుగ నేర్పడినవి. హిందూస్థానము భాషాప్రయుక్త రాష్ట్రములుగను విభజింపబడుట ప్రజాపరిపాలనమున కవసరమై ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సాధ్యమైనను సంతర్భేదములు రాష్ట్ర నిర్మాణమును దుర్లభము చేసినవి. రాయలసీమ నాయకులకు ఉత్తరసర్కారు నాయకులమీదను విశ్వాసములేదు. ఉత్తరసర్కారు నాయకులందు పరస్పరవిశ్వాసము లేదు. ఉత్కళరాష్ట్రమునం దాంధ్రసీమ కలిసిపోయినది. తమిళకర్నాటకభాగములం దాంధ్రసీమ కొంత కలిసిపోవుచున్నది. ఆంధ్రావని ఇతర ప్రాంతములందు బలవంతముగను చేయుట విచారగ్రస్తమైనను ప్రతిక్రియామాత్రము దుర్లభముగనున్నది దేశమంతయును నేకగ్రీవముగను నాంధ్రరాష్ట్ర నిర్మాణమునకై పాటుపడవలసిన తరుణము శీఘ్రకాలముననె రానున్నది. అన్ని పక్షములవారును కలిసి ఈ పనిని సాధించుట కుపక్రమించుట కార్యసిద్ధికి సాధనము. కాంగ్రెసుపక్షము క్రియారూపమున నాంధ్రరాష్ట్రమును కాంగ్రెసు వ్యవహారములం దంగీకరించినది. ఇతరపక్ష నాయకులును నీమార్గము నవలంబించుట కార్యసిద్ధికి ప్రయోజనకరము. విజయవాడయందు గూడిన స్వరాజ్యమహాసభ ఆంధ్రరాష్ట్ర నిర్మాణవిషయమై చేసిన తీర్మానము నాచరణమునందు బెట్టుటకు పక్షను బూనుట శ్రేయస్కరము. రాజకీయ విషయములందువలెను సాహిత్యాది విషయములందును సంయోగబలము లేని ఆంధ్రాభ్యుదయము మందగమనమును చేయుచున్న విధము దేశాభిమానులకు విషాదమును గలుగజేయుచున్నది. ప్రతిభావంతులైన ఆంధ్రమహాజనులవకాశములు లేకను మాంద్యావస్థ పాలగుట సకలపక్షములను చింతాకారణమగుచున్నది. రాజకీయ సాంఘిక సాహిత్యకళా పారిశ్రామికాది సకల విషయములందును నాంధ్రాభ్యుదయమునకు పండితులు, నాయకులు, ప్రజలు కలిసి పనిచేయుచు సర్వతోముఖమైన ఆంధ్రాభ్యుదయమును బడయుటకు భగవంతు డనుగ్రహించుగాత !

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St., Madras.
Editor: G. Subbaramayya.

# విషయానుక్రమణిక



## చిత్రములు

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈ క్రింద కనబరచిన నెంబర్లవారికి ఈనెల (నవంబరు)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్ము రానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందాదారులుగ నుందురను నమ్మకముతో డిసంబరు 8-వ తేదిని ర్పూ 6-4-0 లకు వి. పి. పంపుచున్నాము. గావున తా మెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. నిప్పైకొన ప్రార్థితులు. ఒకవేళ తః పత్రిక ప్రస్తుత మనవసర ముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

A 5, 12, D 1, H 7, 46, 47, 49, J 1, K 20, 21, L 6, 7, N 27f P 3, 4, 48, R 19, 46, 47, 10, 14, S 38, 39, 40, 48, 49, 50, 53, 57, 61, 150, 168, 170, 171, 173, 177, 178, 179, 180, 181, 185. 189, 194, 195, V 39, 40, 59, 70,

